శ్రీ రా మా.

# వేకానందస్వామివారి "ప్రాక్పశ్చిమము"

లనువ్యాసమునకుఁ దెలుఁగు.

---

కూచి నరసింహము బి. ఏ. గారిచే

రచియింపఁబడినది.



రెండవకూర్పు 1500 ప్రతులు.

స్కేప్ అండ్ కో,, ముద్రాక్షశాలలో

కె. సుబ్బారాయసోదరులచే ముద్రింపఁబడియె.

కా కి నా డ.

1926

[వెల రు 0-14-0

శ్రీరామా.

1 Each soul is potentially divine.

2 The goal is to manifest this divine within, by controlling nature, external and internal.

3 Do this either by work, or worship, or psychic control, or philosophy—by one or more or all of these—and be free.

4 This is the whole of religion. Doctrines and dogmas, or rituals, or books, or temples, or forms are but secondary details.

SWAMI VIVEKANANDA'S
Raja Yoga.

1 ప్రతిజీవాత్మలోను బరమాత్మశక్తి యంతర్భూతమై యున్నది.

2 అంతర్బాహ్యప్రకృతుల వశీకరణమువలన (శమదమాదులవలన) లోపలనున్న యాభగవత్తత్త్వమును వ్యక్తీకరించుటయే ప్రాపింపవలయు పరమావధి.

3 సత్క్రియాచరణము, భక్తి, యోగాభ్యాసము, తత్త్వవిచారణ—యీసాధనములలో నొక్కటిఁగాని, కొన్నిటిఁగాని, యన్నిటిఁగాని యవలంబించి యదినెఱవేర్చుకొని విముక్తుఁడవుగమ్ము.

4 మతములోనున్న సారమంతయు నిదియే. ఇఁక వాదములు, రాద్ధాంతములు, కర్మకాండము, మతగ్రంథములు, దేవాలయములు. బాహ్యాచారపద్ధతులు—ఇవన్నియుఁ గేవలాప్రధానాంశములు.

శ్రీ వివేకానందస్వామివారిరాజయోగము.

ప్రథమముద్రణమునకు

# పీఠిక

సీ॥ లేఁబ్రాయమునను నిర్లిప్తచిత్తత నభ్య
సించి సద్గురు నాశ్రయించినతఁడు
ప్రాచ్యపాశ్చాత్య సద్గ్రంథజాలము వ్రేల్మి
డి, నిశితబుద్ధిఁ బఠించినతఁడు
సాధనచేతను సద్గురుకృపచేత
బ్రహ్మానుభవసిద్ధి వఱలినతఁడు
వంగభాషను నాంగ్ల భాషను నసమాన
వక్తృత్వసంపత్తిఁ బడసినతఁడు
గీ. సర్వనాగరక ప్రపంచంబు తిరిగి
కాంచి స్వయముగ జ్ఞాన మార్జించినతఁడు
సద్యశుఁడు, వివేకానంద సంజ్ఞవాఁడు
వంగభాషను దీనిని వ్రాసినాఁడు.

అట్టి వివేకానందస్వామివారు "ఉద్బోధన" పత్రికలోఁ బ్రకటించిన—ప్రాక్పశ్చిమములు, The East & the West—అను వ్యాసమును ఇంగ్లీషుచేసి శ్రీ స్వామివారిగ్రంథముల యైదవసంచికలోఁ గడకట ముద్రించినారు.

మ. రా. శ్రీ. కావ్యనిధి, చెలికాని లచ్చారావుగారంపఁగా ఆభాగము నేఁ జదువుట తటస్థించినది. ఆహా! వివేకానందస్వామి యాకర్షణ వశీకరణమహిమ! రుజాపీడితుఁడనై విశ్రాంతిఁగోరుచున్న వాఁడు, ఆవ్యాసము చదివినవెంటనే, దాని నాంధ్రీకరింపఁ దీవ్రమైన వాంఛపుట్టినది. ఎంతకొట్టుకొనినను ఆబుద్ధి మఱలుచుకొనలేకపోయి

తిని. శ్రీమకోర్చుకొని యెట్లో యీయాంధ్రీకరణకృత్యము భగవత్కృపచే నెఱవేర్చుకొంటిని.

ఆమహానుభావుఁడు దీనిని మొట్టమొదట వంగభాషలో వ్రాసినాఁడు. దాని యింగ్లీషుతర్జుమానుబట్టి నేను దెలుఁగుచేసినాను. రెండు భాషాపరివర్తనములవలన మూలవ్యాసములోనుండు రసము తగ్గియుండవచ్చును. నా భాషాంతరీకరణ లోపము లెన్నియున్నను, శ్రీవివేకానంద ప్రతిపాదితవిషయగౌరవమును, ఆనుహామహుని మేఘగంభీరవచనరచనావిశారదత్వమును ఆలోపముల నన్నిటిని గప్పిపుచ్చఁగలవని నేననుకొనుచున్నాను.

సత్యప్రకటనములో, వారేమనుకొందురో! వీరేమనుకొందురో! యని యాయనకణుమాత్రమైనను గొంకుజంకులు లేవు. పిడుగులు పడినట్లు సత్యవాక్కులున్నట్లు నోటినుండియూడి యావలఁబడవలసినదే! అట్లున్నను బక్షపాతబుద్ధిచేఁ బరులగుణములు దాఁచిపెట్టుటగాని, పరులమనస్సు తన వగ్ధారచే నొప్పించుటగాని యాయన ప్రకృతిగా గాన్పింపదు. ఎంత గూఢదుర్గ్రాహ్యాధ్యాత్మికాంశమైనను అరఁటిపండొలిచి చేతఁబెట్టునట్లు చెప్పుటలో వివేకానందస్వామిని మొదటఁజెప్పి పిమ్మట మఱియొకనిఁ బేర్కొనవలెను. అనుభవజ్ఞులకును కేవలగ్రంథపఠనపాండితీసంపన్నులకును గల భేదమిదియే!

అనావశ్యకముగాఁ బీఠిక పెంచుటవలన లాభ మేమియులేదు. మతములలో, దేశాచారసంప్రదాయములలోఁ, గట్టుబట్టలోఁ, గానిపించు తీరులలో, యుక్తాయుక్తవిచారణలలోఁ, బరమార్థనిర్ధారణాలలో, నంతర్బాహ్యపరిశుద్ధులఁ గూర్చిన యభిప్రాయములలో, స్నాన పానాహారవిహారాదులలో, మర్యాదామార్గములలో, నాగరకతాప్రకృతులలో, అన్యజాతిమతముల కగపఱచు గౌరవములలో, అహింసాపరోప

కారాదిపరమధర్మములలోఁ బ్రాచ్యులనఁగు మనకును బాశ్చాత్యుల నఁగు నాంగ్లేయాదులకును గల స్థూలసూక్ష్మతారతమ్యము తెలుఁగఁ గుతూహలపడువారికి శ్రీస్వామివారి యీవ్యాస మువకరించినట్లు మఱియొం డుపకరింపఁజాలదని నాయభిప్రాయము. అదియుఁగాక సర్వప్రపంచచారిత్రమును అతిసంగ్రహముగాఁ గాలపౌర్వాపర్యానుసారముగా సువిస్పష్టముగా స్వామి యిందుఁ జెప్పినాఁడు.

అర్థసౌలభ్యార్థము విసంధులును అన్యదేశ్యపదములును విపులముగా నుపయోగపఱిచినాను. ఇతర భాషానియమములను బుద్ధిపూర్వకముగా నుల్లంఘింపలేదు.

ఈ తెలుఁగువ్యాసము తమ పత్రికలోఁ బ్రకటింపించుటయేకాక, నాకు వ్యయప్రయాస మేమియు లేకుండ, అదనముగాఁదీయించి, దయాగౌరవములతో నాకు 350 ప్రతులిచ్చిన మ. రా. శ్రీ. (కావ్యనిధి) చెలికాని లచ్చారావుగారికి శ్రీరామచంద్రమూర్తి చిరాయురారోగ్య యశస్సుఖము లొసఁగి రక్షించుఁగాక!

పిఠాపురము,
4—1—1923.

సకలసత్సుధీజనవిధేయుఁడు
కూచి నరసింహము.



శ్రీ రామ.

# VIVEKANANDA'S
## "The East and the West"

శ్రీవివేకానందస్వామివారు "ఉద్బోధన" పత్రికను వంగభాషలో
"ప్రాక్పశ్చిమము" లను శీర్షకముతో వ్రాసిన
వ్యాసమునకుఁ దెలుఁగు.

---

నిరవధికములై నిమ్నములై వెల్లివిరిసి యొడ్ల నొరసి వేగముగాఁ బాఱునదులు, వానితీరములపై నింద్రుని నందనవనమును ధిక్కరించు మనోహరమైన యుద్యానవనములు, వానినడుమ నాకాశమునంటుచుఁ జిత్రవిచిత్రశిల్పక్రియాలంకృతములై చిత్తరంజకము లగు పాలరాతిప్రాసాదములు, ప్రక్కలను ఎదుటను వెనుకను పడిపోవుచున్న మట్టిగోడలతోఁ గడుశిథిలమైన కప్పులతో అస్థిపంజరములవలె నంటియున్న వెదురు పెణకలతోఁగానిపించు గుడిసెలగూడెములు, వాఁతచింపులుకట్టుకొని శుష్కించిన శరీరములతో నిట్టట్టుతిరుగులాడు వృద్ధయువాకారములు, చిరకాలానుభూతదారిద్ర్యహతాశాచిహ్నితములైనవారిముఖములు, అట్టి దుర్బలశరీరములతోనే అట్టి దీనవిలోకనములతోనే సామాన్యముగా సర్వత్ర కన్పట్టు ఆవులు, ఎద్లు, గేదెలు, మార్గపార్శ్వములఁ బెంటయు ముఱికియు—ఇది మన ప్రస్తుతహిందుదేశము.

చిత్రభవనముల చెంతనే జీర్ణకుటీరములు, దేవాలయముల దగ్గఱనే దిక్కుమాలిన పెంటపోగులు, కాంచనాంబరప్రభాడంబరుప్రక్కనే పోవు కౌపీనధారి యగు కర్మంది, గొంతుకవఱకు మెక్కు గొప్పస్థితిగలవారిపై వ్రాలుచు గుండె నీరుచేయు క్షుధాపీడితుని శోభావిహీనములైనచూపులు—ఇది మన జన్మభూమి.

మహామారీ విషూచీకృతమైన వినాశము, దేశప్రజ ఆయువుల ట్లనే తినివేయుచున్న విషవాయుజ్వరములు (మన్నెపుజ్వరములు) పామకొని ప్రకృతిప్రాయములైన నిష్పస్తులును అపస్తులును, తెయ్యి మని మాటిమాటికి ఘోరముగా తాండవమాడుమృత్యుదేవతనుబోలు క్షామదేవత, చండరుజాదుఃఖసమరక్షేత్రమగు అపరకురుక్షేత్రము, ఆశ చులుకుఁదనము, సంతోషము, ధైర్యము—ఈజీవలక్షణముల మృతాస్థికలతో సంకీర్ణమైన మహాపితృవనము, ఆత్మదుఃఖమోక్షముకంటె అన్యపురుషార్థము లేదని, జీవాత్మపరమాత్మానుసంధానము కొఱకు ధ్యానమగ్నుఁడై తన్మధ్యమున మహామౌనముద్రతోఁ గూరుచుండు యోగి—యూరప్పునుండి వచ్చి మనదేశములోఁ బ్రయాణముచేయు పథికుని దృక్పథమునఁ బడునవి యివ్వి.

స్వదేశస్థులు పరదేశస్థులు, స్వమతస్థులు పరమతస్థులు, అడుగు క్రిందఁబెట్టి చచ్చునట్లుడఁగఁద్రొక్క-నందువలన, ఆకారమునమాత్రమే మనుష్యులుగా నగపడుచు, పరమశాంతులై పాటుపడి బాధపడుచు, బానిసపాండ్రవలె స్వతంత్రారంభము లేమియు లేక ముందువెనుకలు లేక, ఆశలడుగంటి, యెట్లో యీగాలిబ్రతుకుబ్రతికి కాలమును గడపుకొనినఁ జాలు నని యనుకొనుచు, ఎదుటివచ్చు చూచి యోర్వలేని బానిసల కనుగుణమగు పరమదుష్టస్వభావముపాలై, హతాశులవలె శ్రద్ధావిరహితులై, అవిశ్వాసులై, కపటోపాయములను ద్రోహమును నక్కజిత్తులను ఆత్మరక్షణసాధనములుగఁ జేసికొని, స్వప్రయోజనపరతాస్వరూపములై, బలవంతులపాదధూళినాకుచుఁ జాలనిదుర్బలులఁజావఁ దన్నుచు, ముందాశలేనిఅశక్తులను సహజముగాఆశ్రయించుకొని యుండు వికృతదుష్టమూఢాచారములలో మునిఁగియుండి, నీతినియమములప్రాపులేక, ముప్పదికోట్లజీవరాసులు, కుళ్ళి కంపుగొట్టు శవముపైని లుకలుకలాడు పురుగులవలె హిందుదేశము శరీరముమీఁద మూఁగియున్నట్టు—మనలఁజూచి ఆంగ్లోద్యోగి యనుకొనుచున్నాఁడు. అట్లనుకొనుట సహజము.

సంతతాధికారోపార్జనాసహోన్మత్తులై, యుక్తాయుక్తవివేచనవి

రహితులై, అడవిమృగములవలె నతిభీకరులై, కామాతురులై కాంతలకుఁగడఁగడలాడుచు, ముప్ప్రిద్దుల సురాద్రవములలో మునిఁగి తేలుచు, కచ్ఛశుద్ధి, పవిత్రత, శుచి, శుభ్రత, అనుతలంపే లేక, జడపదార్థమునే నమ్ముచు, దానిని దానివివిధోపయోగములను ఆధారము చేసికొన్న నాగరకతఁ బడసి, బలవంతముగానో కపటోపాయములచేతనో ద్రోహముచేసియో యితరుల దేశములను ఇతరుల విత్తమును సాహసించి స్వాధీనము చేసికొనుచు, దానివలన నైకతమలాభాభివృద్ధులను మాత్రమే చూచుకొనుట కలవాటుపడి, ఆముత్రికవిశ్వాస మణుమాత్రము లేక, అన్నపానాదిశరీరసుఖములును విషయభోగములునే జీవితఫలములను దేహాత్మబుద్ధితోఁ బ్రవర్తించు పాశ్చాత్యులు:—మన హైందవుల దృష్టిని కేవలము పిశాచములు, అసురులు.

ఉభయపక్షముల దృష్టులును ఇట్టి పరస్పరాభిప్రాయములతో నున్నారు—ఈఅభిప్రాయము లన్యోన్యావివేచనమువలనను, బాహ్యమైన అల్పజ్ఞానమువలనను గలుగుచున్నవి. విదేశీయులైన యూరప్ఖండవాసులు మనదేశమునకు వచ్చి పట్టనములలో మంచి నిర్మలారోగ్యకరములైన నెలవులనుండు దివ్యభవనములలో నివసించుచు మన వాసస్థానములను తమ దేశములో శుభ్రముగా సుందరముగా అమర్చి కట్టిన నగరములతో పోల్చి చూతురు. వారిక్రింద నేదో యొక నవుకరిచేసికొనుకులము వారొకరే వారికిఁ బరిచితులు. కష్టదారిద్ర్యములు మన దేశములో నున్నంత యితరదేశములలోఁ గనఁబడ వన్నమాట నిజమే. ఎక్కడఁజూచినను మురికియు రోఁతయు నుండు నన్నమాటయును వాస్తవము కాదనలేము. ఇట్టి మలినదాస్యనైచ్యములమధ్యమున మంచికి తావుండునని యూరప్దేశీయు లూహింపఁజాలరు.

ఇఁకను యూరప్వారన్ననో—జిహ్వానియమము లేక, దొరకిన దెల్లఁ దినుచు, మన సంప్రదాయానుసారమైన పరిశుభ్రత యన్ననేమో యెఱుఁగకుండ, వర్ణభేధములు లేక, స్వేచ్ఛగా స్త్రీలతోఁ గలసితిరుగుచు, మద్యపానముచేయుచు, ఒకరినొకరు కౌఁగిలించుకొని స్త్రీలును పురుషులును గూడి సిగ్గుబిడియములు లేక విందులలో విపరీతన్పృ

త్యములు చేయుచు—మనకన్నులకు విడ్డూరముగాఁ గానిపింతురు. ఇట్టిజాతిలో మంచి కవకాశ మెక్కడనుండునని మన మనుకొందుము.

ఈయభిప్రాయములు రెండును బాహ్యదృష్టివలన నుత్పన్నములైనవే కాని లోతుగా పరికించి పరిశీలించుటవలనఁ గలిగినవి కావు. పరదేశీయులను మనతోఁ గలియనీయము. వారు మ్లేచ్ఛులందుము. మనము నల్లవారమని బానిసలమని వారు మనలఁ జూచి అసహ్యించుకొందురు.

ఉభయులలో నొక్కరును రెండవవారిలో పరోక్షముగానుండు పరమసత్యమును గనుఁగొననప్పటికిని, రెండభిప్రాయములలోను కొంత నిజ ముండక తీఱదు.

ప్రతివానిలోను భావరూపమైన గుఱిగా ముఖ్యలక్షణ మొకటి యుండును. భావమును ప్రకటించు భాషవలె, ఈలక్షణమును బాహ్యమానుషాకృతి బయలుపఱుచుచుండును. అట్లే ప్రతిజాతికిని ప్రధానలక్ష్య మొకటి యున్నది. ఈధర్మము ప్రపంచముకొఱకుఁ బనిచేయుచున్నది. ప్రపంచపోషణమున కది యావశ్యకము. ప్రపంచరక్షణమున కట్టిధర్మముయొక్క ఆవశ్యకత యెప్పుడు పోవునో అప్పుడే ఆధర్మమున కాశ్రయముగానుండు పురుషుఁడుగాని జాతిగాని నశించిపోవును. ఎంతదుఃఖదురవస్థలలోనున్నను, ఎంతదరిద్రతాపీడితులమైనను, స్వజనులవలనను పరజనులవలనను ఎంతహింసింపఁబడుచున్నను, మనము—హిందువులము—ఇంకనుజీవించియుండుటకుఁగారణము, ప్రపంచపరిరక్షణమున కింకను గావలయు నొకజాతీయ వ్యక్తి మనలోనుండుటయే. యూరప్పునివాసులకు వారిజాతీయభావ మున్నది ; అది లేకున్నను ప్రపంచవ్యాపారము సాగదు ; అందుచేతనే వారంతబలవంతులుగా నున్నారు. యావచ్ఛక్తిపోయిన మనుష్యుఁ డొక్కనిమిషము బ్రతుకఁగలఁడా ? ప్రత్యేకమానవుల సమాహారమే జాతి. జవసత్వములు సంపూర్ణముగాఁ జచ్చినజాతి నిలిచియుండునా ? ఒకవేయివత్సరములనుండి యెన్నో కష్టములపాలై గగ్గోలుపడుచున్న యీమనహిందుజాతి యేల మడిసిపోలేదు ? మన ఆచారమర్యాద లంత చెడ్డవైనచో

ఈపాటికి మన మీప్రపంచమునుండి తుడిచిపెట్టుకొని పోవలసినదే ? అట్లేల జరుగలేదు? మన దేశమును జయించిన యనేక పరరాజులు మనల నణఁగఁద్రొక్కి చంపివేయుటకు సర్వవిధములఁ జూచిరి గాని ప్రయత్నలోప మేమైనఁ జేసిరా? అనాగరకములైన యితరదేశములలోని ప్రజలవలె హిందువు లేల రూపుమాసిపోలేదు ? భరతఖండము పాడువడి నిర్జనారణ్యమేల కాలేదు ? అట్లైనచో, పరదేశీయులు, పరమ సంభ్రమముతో పరుగెత్తుకొనివచ్చి హిందుదేశములో పీఠము వేసికొనియుండి యందలి సారవంతములైన భూములు దున్నుకొని పండించుకొనుచు సుఖముగానుందురే ! అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికాఖండములలో వారట్లు చేయలేదా ? చేయుచుండుటలేదా ? ఓ నావిదేశమిత్రమా ! నీవనుకొనునంతబలము నీకు లేదు ! అట్టి వృథాభావనలోఁ బడకుము. భరతఖండమునకుఁగూడ దానిబలము దానికున్నదనియు, ఇంకను దానిసత్యసారము దానిలోనున్నదనియుఁ దొలుతఁ దెలిసికొనుము. అదిగాక, ప్రపంచనాగరకతానసృష్టిభండారమున కింకను ధనమొసఁగవలసియున్నది గనుకనే భారతవర్షమింకను బ్రదికియున్నదనియుఁగూడఁ దెలిసికొనుము. మాదేశీయులలోఁ గొందఱు బాహ్యవేషములలోను అభ్యాసములలోను లోపలియూహాలలోను ఉద్దేశములలోను పూర్తిగా పరదేశీయులుగా మాఱి—"మేమధఃపతితులమై పశుప్రాయులమైనాము. ఓయూరప్ఖండవాసులారా! మాకు మీరే రక్షకులు! మామీఁద కనికరముంచి మమ్మీయధోగతినుండి యుద్ధరింపుఁడు"—అని కన్నులు కరఁగిపాఱునట్లేడ్చుచు యూరప్పుదేశమువారిని ప్రార్థించుచున్నారు. అట్టియోస్వదేశీయసోదరులారా! మీరును ఈసంగతి బాగుగా తెలిసికొనవలసియున్నది. మఱియు మంగళగీతములు పాడుచు "ఇదిగో! జీజస్సుగారు హిందుదేశమునకు వేంచేసినారు. కాలక్రమమున భగవదాదేశము నెఱవేఱునున్నట్లు అదిగో! కన్నుల కగపడుచున్నది!" అని అడావుడిచేయుచుఁ గొందఱున్నారు. వారికిఁగూడ ఈసంగతి యెఱుకపఱుపవలసియున్నది. శివశివా! జీజస్సు రాలేదు. జిహోవా రాలేదు. వారు రారు. వారియి

ల్లు చక్కఁబెట్టుకొనుచు వారున్నారు. మన దేశమునకు వచ్చుటకు అవిలేదు. యథాపూర్వకముగా ఆసనము వేసికొని కూరుచుండి మహా ప్రాఁతశివుఁడే మన కిక్కడ నున్నాఁడు; ఎప్పటిపూజాద్రవ్యములతో పూజలనందుచు రక్తమయమైన కాళీమాత కాన్పించుచున్నది; అవిలో నావులఁగాచుచు ప్రేమమూర్తియైన గొల్లపిల్లవాఁడు—శ్రీకృష్ణుఁడు—ముద్దులొల్క మురళీనాదములు చేయుచు మనుపటియట్లే యున్నాఁడు. ఈముసలిసాంబుఁడు, ఒకప్పుడు, నందివాహనారూఢుఁడై, డమరువువాయించుచు హిందూదేశమునుండి, యీవైపు సుమత్రా, బోర్నియో, సెలిబిజ, ఆస్ట్రేలియాలు దాఁటి అమెరికాతీరములవఱకు ప్రయాణము చేసినాఁడు. ఆవైపుగా టిబెట్టు చీనాజపానులు దాఁటి సైబీరియావఱకు వెళ్లి తనయెద్దును బలియమేపినాఁడు; ఇంకను అట్లు చేయుచున్నాఁడు. కాళితల్లి కూడ ఇంకను చీనాజపానులలోఁ బూజలనందుచున్నది. ఆతల్లి నే క్రైస్తవులు రూపము మార్చి మేరీకన్యను జేసి జీసుక్రైస్టుగారి మాతగా సేవించుచున్నారు. అవిగో! హిమవత్పర్వతములు! వాని యుత్తరమున కైలాసగిరి యున్నది, అది మా ముసలిసదాశివునియొక్క ముఖ్యసదనము, పదితలలు ఇరువది బాహువులుగల పరాక్రమవంతుఁడైన రావణుఁడైనను ఆగద్దెను గదలపలేకపోయినాఁడు. ఇప్పు డీనవీనమతబోధకులా ఆపనిఁ జేయువారు? ఓ వెఱ్ఱిలారా! ఇక్కడ, ఈహిందుదేశములో డమరుకధ్వనులు చేయుచుఁ బురాతనశివుఁడును, జంతుబలులతో సేవింపఁబడుచు కాళీజననియు, వేణుగానము చేయుచు చిన్నారి శ్రీకృష్ణుఁడును, ఎప్పటికిని ఉందురు. హిమాలయములవలె స్థిరముగా వారు నెలకొనియున్నారు. క్రైస్తవులుగాని యితరమతబోధకులుగాని యెంతప్రయత్నము చేసినను వారిని గదల్పఁజాలరు. చూచి సహింపలేనియెడల శీఘ్రముగా వెడలిపోయి వేఱుమార్గము చూచుకొనుఁడు. స్వల్పసంఖ్యాకులగు మీకోసము జాతియంతయు సకలక్రమముపడి చావవలెనా? స్వేచ్ఛగా మేయుటకు మేపుకొనుటకు పొలములు భూములు నున్న మఱియొకచోటి కేలపోవరు? విరివియైన ప్రపంచమెల్లను మీకు వెల్లడియైయున్నదే! చే

యరు. అట్లు చేయరు. అట్లు చేయుటకుఁ జాలినశక్తి యేదీ! రామ రామా! పాపము! ప్రీతశివుని ప్రసాదముతిని బ్రతుకుచు, ఆయనకు ద్రోహము చేసి ఆయనను దూషించుచుఁ బరరక్షకుని మహిమలు వర్ణించిపాడుచుందురు! "అయ్యో! మేమునీచులమై అధోగతిపాలైనాము, పడిపోయినాము, మా ప్రవర్తనయంతయు పరమదుర్మార్గమైన ప్రవర్తనమైపోయినది." అనికూనరాగములు పెట్టుచు గ్రుడ్లు నలుపుకొనుచు మాలోఁగొందఱు యూరప్పుదేశీయులకడకుఁ బోవుచున్నారే, వారికిట్లు చెప్పుచున్నాను. "ఔను! నిజము చెప్పుచున్నామని మీరనుచున్నారుగనుక, మీ మాటలు సత్యములే కావచ్చును, మిమ్ము నమ్మకపోవుటకుఁ గారణముగపడదు, కాని—మేము, మేము—అని జాతినంతను ఏలకలిపి చెప్పుచున్నారు? అది మీకేమిమర్యాద?"

సద్గుణములు ఏదోయొకజాతి ప్రత్యేకము గుత్తగొని యుండలేదు. మనుష్యులలోఁ దారతమ్యమున్నట్లే, జాతులలోను, కొన్ని సద్ధర్మము లొకజాతి కంటె మఱియొకజాతిలో ఎక్కువగా నుండవచ్చును—అని మొట్టమొదట మనము తెలిసికొనవలెను.

మన ముఖ్యోద్దేశము ముక్తి; పాశ్చాత్యుల ప్రధానాశయము ధర్మము. మనకుఁ గావలయునదిముక్తి. వారుకోరునది ధర్మము. ఇట ధర్మమను పదము మీమాంసక మతానుసారముగా వాడుచున్నాను. ధర్మమన నేమి? ఇహలోకసుఖమునకో పరలోకసుఖమునకో పురుషునిచేఁ బ్రయత్నము చేయించునది ధర్మము. ధర్మము కర్మాధారము. సుఖసంపాదనమునకై పనిచేయుమని ధర్మము మనుజుల నహోరాత్రములు పొడిచిపొడిచి పురికొల్పుచున్నది.

ముక్తియన నేమి? ఈలోకములో సుఖముకూడ దాస్యమే. అట్లే పరలోకసుఖమును. ఏలనఁగా ఈలోకముగాని యితరలోకములుగాని ప్రకృతిశాసనముల నుల్లంఘించి యుండలేవు. అన్నియుఁ బ్రకృతినియమబద్ధములే! ఇనుపసంకెలలకును హేమశృంఖలలకును ఉండుభేదమే యిహలోకదాస్యమునకును పరలోకదాస్యమునకును ఉండుభేదము—అదిగాక, ఎక్కడివైనను అట్టి సుఖములు ప్రకృతిబద్ధములు

గావున మరణమునకులోఁబడి యున్నవి, శాశ్వతములు గావు. కనుక
పురుషుఁడు ముక్తుఁడగుట కపేక్షింపవలెను, శరీరబంధములను దాఁటి
పోవలెను, బానిసతనము పనికిరాదు:—అని బోధించునది ముక్తిమా
ర్గము. మోక్షమార్గ మొక్క హిందు దేశములోనే యున్నది గాని యిత
ర దేశములలో లేదు, ముక్తాత్ము లొక హిందు దేశములోనే యున్నారు,
ఇతర దేశములలో లేరని తఱచుగాఁ జెప్పఁబడు వాక్యము సత్యము.
కాని ముందుముందు అట్టివారితర దేశములలోఁగూడ నుందురనుటయు
అంతసత్యమే—అదిమంచిదే, అట్లుండుట మాకుఁ బరమసంతోషము.
వెనుక నొకప్పుడు హిందుదేశములో ధర్మమును ముక్తియుఁ బరస్పరా
నుకూలములుగా నుండెను. యుధిష్ఠిరుఁడు, అర్జునుఁడు, దుర్యోధనుఁడు,
భీష్ముఁడు, కర్ణుఁడుమున్నగు ధర్మోపాసకు లుండిరి. వారిప్రక్క నే వ్యా
సశుక జనకాదిముక్తకాములుండిరి. బౌద్ధమతముప్రవేశించుటతోడనే,
ధర్మముపూర్తిగా త్యజించినారు, మోక్షమార్గ మొక్కటియే ప్రబలి
ప్రధానమైనది. కనుకనే—గయాసురుఁడు అందఱకు మోక్షమార్గమే
యుపదేశముచేసి ప్రపంచము పాడుచేయఁ బ్రయత్నించెననియు, అం
తట దేవతలందఱును ఒకసభచేసికొని కపటోపాయమువన్ని అతనిని
శాశ్వతముగా శయనించి విరమించునట్లు చేసిరనియు—అగ్నిపురాణ
ములో రూపకాలంకారోక్తులతో వ్రాసిన యొకకథ మనము చదువు
చున్నాము. అందఱు చాటిచెప్పుచుండు మనదేశపతనమునకుఁ గార
ణము ధర్మముపూర్తిగానశించుటయే యనునది యీకథాసారము. ప్ర
జలందఱు మోక్షమార్గమవలంబించి యాచరించినచో అది సర్వోత్త
మమే, కాని యెట్లుసాధ్యమగును? భోగానుభవము లేకుండ భోగపరి
త్యాగ మెన్నఁడునురాదు. మొదట సుఖమనుభవింపుము, తరువాత
దానిని వర్జింపవచ్చును. అట్లుగాక దేశీయులందఱు ఆకస్మికముగా
సన్న్యాసస్వీకారము చేసినచో, కావలసినది రాకపోవుటయే కాక, యిది
వఱకున్నదికూడ ఎగిరిపోవును. చేతిలోనున్నపక్షి చేయిదాఁటిపాఱిపో
వును, చెట్టుమీఁదనున్న పిట్టపట్టుపడదు. బౌద్ధమతాధికారము మంచి
ప్రబలముగానుండి ప్రతిమఠమునందును వేలకొలఁది సన్న్యాసులు వ

సించియుండురోజులలోనే దేశము వినాశదశోన్ముఖమై యుండెను. బౌద్ధులు, క్రైస్తవులు, ముసల్మానులు, జైనులు, సూక్ష్మదృష్టి లేక, అందఱకు నొక్కసూత్రమే, యొక్కనియమమే విధించుచున్నారు. అది పెద్ద పొరపాటు. స్వభావభేదమునుబట్టి, వివిధమానవులకు వివిధజాతులకు విద్యాచారధర్మవ్యవహారవిధులు వివిధముగా నుండవలెను. బలవంతముగానెల్లరను ఏకముచేయఁ బ్రయత్నించుటవలన నేమియును లాభము లేదు. పురుషార్థములలో మోక్షముకంటెఁ బరమార్థము లేదు, మీరెవ్వరైననుసరే! అందఱువచ్చి యది గైకొనుఁడు—అని బౌద్ధులు బహిరంగముగాచాటించి చెప్పినారు. అదెప్పుడైన సాధ్యమా? "నీవుగృహస్థుఁడవుగాన, అట్టివానిప్రసక్తి నీకుండఁగూడదు. నీస్వధర్మమును నీవుచేయుము." అని హిందుమతగ్రంథము లనుచున్నవి. ఆమాట యేమంచిది. ఒకఅడుగు దుముక లేనివాఁడు, ఒక్కగంతుతో ఉదధిదాఁటి లంకకుఁ బోఁజూచుచున్నాఁడు. అది వివేకమా? నీకుటుంబమును పోషించుకొని తోడివారికిద్దఱకైనను పట్టెఁడన్నము పెట్టలేవు, ఇతరులతోపొత్తుగా నుండి ప్రజాహితార్థము సామాన్యమైన కార్యమొక్కటియుఁ జేయలేవు. ఇఁక ముక్తి వెంటఁబరుగిడుదువా? "మోక్షము ధర్మముకంటె ఎక్కువ నిజమే, కాని మొట్టమొదట ధర్మముతప్పక నెఱవేర్పకోవలెను." అని హిందువులశ్రుతులు చెప్పుచున్నవి. ఈవిషయముననే బౌద్ధులు భ్రమపడి దేశమునకనేకానర్థములు తెచ్చినారు—అహింసమంచిదే, ఎగ్గుసేయువారి నెదిరింపక సహించుకొనుట గొప్పమాటయే—ఇవి మహోదారమైన మతసిద్ధాంతములే! కాని "నీవు గృహస్థాశ్రమములో నున్నావు, నిన్నెవఁడైన లెంపకాయకొట్టినప్పుడు, దానికి సమానమైన ప్రతీకారము చేయనిచో, నీవునిజముగాఁ బాపముచేసినవాఁడ వగుదువు" అనిశాస్త్రములు చెప్పుచున్నవి. "నిన్నుఁజంపుట కెవఁడేనివచ్చిన, అతఁడు బ్రాహ్మణుఁడైనప్పటికిని అతనిఁజంపుట పాపముగాదు" అని మనువుచెప్పుచున్నాఁడు. (VIII-350). ఇది పరమప్రమాణము, మఱచిపోఁదగిన విషయముకాదు. శూరులే యీప్రపంచసుఖము లను

భవింతురు — నీవీర్ష్య మగపఱచి శత్రుజయవశీకరణములు సమకూర్చుకొని ఐహికసుఖము లనుభవించుటకు సందర్భానుసారముగా సామదానభేదదండోపాయములను రాజనీతులువాల్గును ఉపయోగపఱుపుము- అప్పుడే నీవు ధార్మికుఁడవగుదువు. అట్లుచేయక, యథేచ్ఛముగా నిన్నెవఁడైనవచ్చి తన్ని కాలిక్రిందఁబెట్టి రాచుచున్నను, ఆబాధావమానములు ఎఱిఁగి యెఱుఁగనట్లు నోరుమూసికొని భరించియున్నచో, నీబ్రతుకంత నీచపుబ్రతుకు మఱియొకటిలేదు; నీయిహలోకజీవనము కేవలనిరయమే, నీపరలోక జీవనమును అట్టినరకమే — ఇట్లు శాస్త్రములు చెప్పుచున్నవి. నీస్వధర్మమును నీవుచేయుము — ఇది పరమసత్యసిద్ధాంతము. నామతమువారికి ప్రేమపూర్వముగా నేఁజేయు హితోపదేశమిది. అట్లని యెవ్వరికిని కీడుచేయకుఁడు, ఎవ్వరియెడలను దౌర్జన్యముతోఁబ్రవర్తింపకుఁడు; శక్త్యనుసారముగాఁ బరోపకారము చేయుటకుఁ బ్రయత్నింపుఁడు. అంతేకాని, పరులుపెట్టుబాధలను పట్టిస్తబ్ధుఁడై భరించి యూరకుండుట గృహస్థునకు పాతకము, తత్క్షణమే ప్రతీకారప్రయత్నములు చేయుట అతనికివిధి. గార్హస్థ్యమునందుండువాఁడు కడు శ్రద్ధతో యావచ్ఛక్తి యుపయోగించి ధనము సంపాదించి దానితో స్వకుటుంబమును చక్కఁగా పోషించుకొనుచు, ఇతరులను సుఖపెట్టుచు, సాధ్యమైనంతవఱకు సత్కార్యము లాచరించు చుండవలెను. అదినీవు చేయలేనియెడల మనుష్యుఁడనని యెట్లుచెప్పుకొనఁ గలవు? గృహస్థుఁడవైనను కావే! మోక్షముమాట యెట్లెత్తఁగలవు?

ధర్మము కర్మమూలమని యింతకుముందు చెప్పినాను. ఫలసాధనసమర్థమైన సంతతకర్మాచరణమే ధార్మికునిధర్మము. ఇంతయేల? కర్మములవిధింపని వేదభాగములు వాస్తవముగా వేదములే కావని కొందఱు మీమాంసకుల యభిప్రాయము: "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్య మతదర్థానాం" అని జైమినిసూత్రములం దొకటి యున్నది — వేదోద్దిష్టమైనది కర్మముగనుక, కర్మప్రతిపాదకములుగాని వేదభాగములు నిష్ప్రయోజనములు — అని దానియర్థము.

"ప్రణవాక్షరము నిత్యము జపించుటవలనను, తన్మంత్రార్థము ను ధ్యానించుటవలనను, సర్వము సిద్ధించును." "భగవన్నామోచ్చారణ మువలన సమస్త పాపక్షయమగును." "ఈశ్వరేచ్ఛ యెట్లో అట్లు జరుగనిమ్ము అని అతని మీఁద భారము వేసి అన్నియు వదలుకొన్న వారికి అన్నియు చేకూడును." ఔను! శాస్త్రములు, జ్ఞానులు చెప్పిన యీ మాటలు సత్యములు; కాని మనలో వేలకొలఁది జనులు యావజ్జీవము ప్రణవధ్యానము చేయుచుండుట లేదా? భగవన్నామము చ్చరించి భక్త్యానందపరవశులై యుండుట లేదా? నీయిష్టమెట్లో యట్లే కానిమ్ము తండ్రీ! భారము నీమీఁద వేసి పూర్తిగా నన్ను నీకర్పణము చేసికొన్నాను, అని యనుచుండుట లేదా? నిజముగా వారికేమి ప్రతిఫలము ముట్టుచున్నది? ఏమియు లేదు! ఎందుచేత? కారణమిది, అది బాగుగాఁ దెలిసికొనవలెను. ఎవరి ధ్యానము నిజమైన ధ్యానము? ఫలకారి? ఎవఁడు సర్వసంగ పరిత్యాగియై సర్వేశ్వరు నిచ్ఛకుఁ దన్నుఁ దావదలి వేసికొనఁగలఁడు? ఎవఁడు అనివార్యమైన శక్తితో, పిడుగుపడినట్లు, భగవన్నామ ముచ్చరింపఁగలఁడు? చిత్తశుద్ధిసంపాదించు కొనినవాఁడొక్కఁడే, అనఁగా, సత్క్రియాకలాపముచే స్వాంతమును స్వచ్ఛముగాఁ జేసికొన్న వాఁడు—అనఁగా ధార్మికుఁడైన వాఁడు.

ప్రతిమనుజుఁడును ఏదోయొక శక్తి నభివ్యక్తము చేయుటకుఁ దగినస్థానమై యున్నాఁడు. ఈశక్తి పూర్వకృత సముదాయసంచితము. అట్టిశక్తి వెంటఁబెట్టుకొని మనలో ప్రతివాఁడును పుట్టినాఁడు. ఆశక్తి పూర్తిగా వినియోగపడువఱకు క్రియాత్యాగము చేసి ప్రశాంతుఁడై యెవఁడూరకుండఁగలఁడు? అంతవఱకును పురుషుఁడు తనసుదుష్కర్మ ఫలరూపమైన సుఖదుఃఖము లనుభవించుచు అనివార్యముగా క్రియాప్రేరితుఁడై యుండును. అంతవఱకు కర్మాచరణమును సుఖదుఃఖానుభూతియు తప్పనప్పుడు, దుష్కార్యములు మాని సత్కార్యములు చేయుచు, దుఃఖమును తొలఁగించుకొని సుఖమనుభవించుచు నుండుట శ్రేయస్కరము గాదా? "మంచిచెడ్డలను రెండుమాటలు మాటాడు

చున్నారు. అందు మంచిచేయుట మంచిది," అని * శ్రీరామప్రసాదుడుగారు సెలవిచ్చెడువారు.

సరే! అనుసరణీయమైన మంచి యేది? ముముక్షువునకుఁ గావలయుమేలు వేఱు, ధర్మావలంబికి గావలయుమేలు వేఱు. గీతాప్రకటనకర్తయగు శ్రీకృష్ణభగవానుఁ డంతశ్రమపడి బోధించినది యీ మహాతత్వమే! హిందుమతాంతర్గతములైన వర్ణాశ్రమాచారములును స్వధర్మసిద్ధాంతమును ఈమహాసత్యమునే యాధారము చేసికొని యున్నవి.

అద్వేష్టా సర్వభూతానాం । మైత్రఃకరుణఏవచ
నిర్మమోనిరహంకారః । సమదుఃఖసుఖఃక్షమీ॥ (గీతXII—13)

ద్వేషరహితుఁడును, సర్వభూతములయందును మైత్రీకరుణలు గలవాఁడును, అహంకారమమకారములు లేనివాఁడును, సుఖదుఃఖములందు సమచిత్తుఁడై యుండువాఁడును, క్షమావంతుఁడును——ఈమాటలును ఇట్టిమాటలును కేవలమోక్షార్థికే చెల్లును.

క్లైబ్యంమాస్మగమః పార్థనైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రంహృదయదౌర్బల్యంత్యక్త్వోత్తిష్ఠపరంతప॥ (గీతII—3)

పృథాపుత్రా! నపుంసకుఁడవు (పౌరుషహీనుఁడవు) కాకుము! అది నీకుఁ దగదు. నీచమైన పిఱికితనము వదలిపెట్టి, ఓశత్రుసంతాపకుఁడా! లెమ్ము.

తస్మాత్త్వము త్తిష్ఠ యశోలభస్వ
జిత్వాశత్రూన్ భుంక్ష్వరాజ్యంసమృద్ధం
మయైవైతేనిహతాఃపూర్వమేవ
నిమిత్తమాత్రంభవసవ్యసాచిన్। (గీత XI—33)

* ఈయన వంగదేశస్థుఁడు, మహాజ్ఞాని, కాళికాభక్తుఁడు, తత్కృపాలబ్ధసరసకవితాసంపన్నుఁడు. కాళీస్తోత్రకదంబకము చేసి యాగీతములలో అతిసులభమగు పాటలతో ఆధ్యాత్మికతత్వములు అరఁటిపండొలిచి చేతిలోఁబెట్టినట్లు బోధించినాఁడు. ఆ పాటలుపాడునప్పుడు వంగదేశములో పండితులుమొదలుకొని పామరులవఱకు ఎల్లరు భక్తిపరవశులౌదురు. అవి యంతభక్తిరసభరితములుగను సర్వజనరంజకములుగనువున్నవి.

—కనుక లేచి ఖ్యాతిసంపాదింపుము. శత్రువుల జయించి పుష్కల రాజ్యమును భోగింపుము. నాచేత వారు ఇతఃపూర్వమే హతులై నారు. ఓ సవ్యసాచీ! నీవూరక నిమిత్తమాత్రుఁడవు గమ్ము.

ఈ మాటలతోను ఇట్టి యితరగీతావాక్యములతోను ప్రభువు ధర్మమార్గమును చూపుచున్నాఁడు. సర్వవ్యాపారములును సదసన్మిశ్రములన్నమాట సత్యమే, యేపనిచేసినను ఇంతో అంతో పాపము చేయక తప్పదు. అయిననేమి? అట్లే కానిమ్ము. కేవలనిర్వ్యాపారత్వము కంటె ఏదో యొక వ్యాపారము మంచిదికాదా? అనశనముకంటె అల్పాహారము మంచిదికాదా? పుణ్యపాపమిశ్రితమైనను ఏదో యొక పనిచేయుట, ఏమియుఁ జేయక అలసులై సోమరులై రాతిబండలవలె నుండి జీవనము వృథాచేసికొనుటకంటె మేలుగాదా? ఆవు ఎన్నఁడు అబద్ధమాడదు, దుంగ ఎప్పుడు దొంగతనము చేయదు. అయినను ఆవెప్పటికి ఆవుగానే యుండును, దుంగ దుంగగానే యుండును. మనుష్యుఁ డసత్యమాడును చౌర్యమును జేయును, కాని, వాఁడే భగవంతుఁడుకూడఁ గాఁగలఁడు. శుద్ధసాత్త్వికగుణము ప్రబలముగా నున్న పురుషుఁడు నిష్క్రియుఁడై నిరంతరధ్యాననిమగ్నుఁడై యుండును, రజోగుణప్రధానుఁడైనవాఁడు సత్క్రియలు దుష్క్రియలు కూడఁ జేయును. తమోగుణాతిశయము గలమానవుఁడు మందుఁడై మొద్దులాగున ఏమియును జేయకుండును. బాహ్యచర్యలఁబట్టి, మనుష్యునిలో సత్త్వగుణమధికముగానున్నదో తమోగుణ మధికముగానున్నదో—పైకిఁ గనఁబడు శాంతి సర్వకర్మాతీతమై, సుఖదుఃఖముల దాఁటిన శుద్ధసాత్త్వికనివృత్తిస్థితియో, అలసుఁడై అచేతనపదార్థమువలె పనిచేయుటకు బలములేక తెలియకుండఁగనే క్రమక్రమముగా కుళ్లి కూలఁబడుచుండు జడుని అధమాధమతామసికస్థితియో—చెప్పను చూతము. ఎవరి మనసునువారు ప్రశ్నించుకొనిన సత్యము బయలుపడును. ప్రశ్న వేసి ప్రత్యుత్తరమునకై ప్రతీక్షించుచుండనేల? ఫలమునుబట్టి పాదపమెట్టిదో తెలియును. సత్త్వసంపన్నుఁడు పనిచేయక పరమశాంతుఁడై యుండు నన్నమాట వాస్తవము. కాని, ఆ శాంతి, ఆనిష్క్రియత, మహామహ

శక్తులన్నిటిని ఒక మధ్యస్థానమునకు లాగిపట్టియుంచినందువలనఁ గలిగినది. శుద్ధసాత్వికుఁడైనమహాత్ముఁడు మనవలె పాణిపాదములతోఁ బనిచేయనక్కఱలేదు. ఇచ్ఛామాత్రముననే ఆయన యెల్లకార్యములు తత్క్షణము పూర్తిగా నెఱవేఱును. అట్టి సత్వబలసంపన్నుఁడే సర్వపూజ్యుఁడైన బ్రాహ్మణుఁడు. నన్ను పూజింపుఁడని ఆయన యింటింటికి వెళ్లి యితరులను యాచింపవలెనా? "ఈమహానుభావుఁడైన నాప్రియపుత్రుని మీరందఱు పూజింపవలెను," అని సర్వశక్తురాలగు జగన్మాత స్వహస్తముతో, స్వర్ణప్రభాభాసితములగు వర్ణములతో అయననిటలతటమున వ్రాయును. ప్రజలావ్రాఁత చదువుకొని వినయవిధేయతలతో వినమితోత్తమాంగులై ఆయనకు మ్రొక్కుదురు. అట్టిమహాత్ముఁడే నిజముగా "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణఏవచ, నిర్మమోనిరహంకారః సమదుఃఖసుఖఃక్షమీ" అని చెప్పఁదగినవాఁడు. తడిచింపిపీలికలవలె, తన్నినను కదలక, అదేమనక, వారముక్రిందట అన్నముదిన్నవాండ్రవలె పీలగొంతుకతో నములి నములి నంగినంగిమాటలుమాటాడు ఆఁడంగిపిరికివందల లక్షణములు అధమాధమమైన తమోలక్షణములు. అవికుళ్లి కంపుగొట్టు మృతకళేబరచిహ్నములు గాని సాత్వికలక్షణములుగావు. అర్జునుఁ డట్టివారిలోఁ జేరనుండెను. గనుకనే శ్రీకృష్ణదేవుఁడు గీతలో విషయ మంతవిపులముగా అతనికి బోధచేసినాడు. ఈమాట వాస్తవమా కాదా యని నీకు సంశయమున్నచో, ప్రభువునోటినుండి ప్రథమమున వచ్చినమాట లివిగో వినుము—క్లైబ్యంమాస్మగమః పార్థనైతత్త్వయ్యుపపద్యతే—అటుపిమ్మటఁ జెప్పినమాటలివి—తస్మాత్త్వము త్తిష్ఠయశోలభస్వ—జైనులు బౌద్ధులు, మున్నగువారు చేసిన బోధములు వినుటచేత పరమతామసికపరంపరలో మనము ప్రవేశించినాము. గతించిన వేయివత్సరముల నుండియు, భగవన్నామములతో రోదోంతరాళము నిండిపోవుచున్నది, ప్రజలందఱు పరమాత్మని ప్రార్థించుచున్నారు, కాని వానిని ఆప్రభువు చెవియొగ్గివినుచుండుట లేదు. ఆయన యేలవినవలెను? వెఱ్ఱిబా

గులవారి విలాపములు మనుష్యుఁడు సైతము విననప్పుడు, దేవుఁడు విను ననుకొనుచున్నావా? భగవంతుఁడు భగవద్గీతలోఁ జెప్పిన "క్లైబ్యంమా స్మగమః పార్థ" "తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ" అను వాక్యములు వినుట యొక్కటియే దుఃఖమునుండి యీవలఁబడు మార్గము.

ఇఁక మనప్రస్తుతవిషయము లైన "ప్రాక్పశ్చిమములఁ" గూర్చి మాటలాడుకొందము. ఒకవిపరీతమున్నది. ముందదివినుఁడు, "ఎక్కడను శత్రుభావ ముంచుకొనకుము; నిన్నాడుకొనువారి నాశీర్వదింపుము; నిన్నొకరేని కుడిచెంపను గొట్టినచో తిరిగి రెండవచెంపకూడ ఆయనకిమ్ము; సమస్తకర్మము లొప్పుగొని పరలోకమునకు సంసిద్ధుఁడవై యుండుము, ప్రపంచప్రళయము సన్నిహితమై యున్నది" అని యూరప్ దేశస్థుల దేవుఁడగు జీజస్ క్రైస్తుగారు బోధించుచున్నారు. మనప్రభువుగారు—అతిశ్రద్ధతో అనవరతము కర్మాచరణము చేయుము; శత్రుసంహారము చేసికొని ప్రపంచసుఖ మనుభవింపుము—అని గీతలోఁ జెప్పుచున్నారు. కాని యీయుభయుల యభిప్రాయములకును వ్యతిరేకముగా వ్యాపారములు జరుగుచున్నవి. యూరప్పుదేశీయు లెన్నఁడును జీజస్ క్రైస్తుగారి యుపదేశములను నిజముగా గ్రహించి అవలంబింపలేదు. చురుకుతనమున కలవాటుపడి ఉద్దండమైన రాజసికస్వభావముగలవారై, పడుచుతనపుపట్టుదలతోను మహాజవసత్త్వసాహసములతోను ప్రపంచమందలి నానాదేశములలోని సమస్తైశ్వర్యములు సమస్తభోగములు సంపాదించుకొని యథేష్టముగా అనుభవించుచున్నారు. ఇఁక మనమో! మూటముల్లె కట్టుకొని ఒకమూల ముడుఁచుకొని కూరుచుండి పగలురాత్రియు మృత్యువునే తలపోసికొనుచు—నలినీదళగత జలమతితరళం తద్వజ్జీవనమతిశయచపలం—తామరాకుమీఁదినీటివలె బ్రతుకు పరమచంచలము—అని పాడుకొనుచుందుము. మారణాధిదేవతయగు యమునిభయముచే రక్తముచల్లఁబడి కాయము గరపటుటయే దానిఫలము. ఆదేమిపాపమో కాని, యెన్నఁడుకూడ వినుమాటలేకట్టుకొని మహామారిమున్నగు మహావ్యాధు

లను మనదేశములోఁ బ్రవేశపెట్టినట్లు తోఁచుచున్నది. గీతాబోధములప్రకారము ప్రవర్తించుచున్న వారెవరు? యూరప్పులోనివారు. జీజస్ క్రైస్టుగారి యుపదేశములప్రకారము జీవనము గడపుకొనుచున్న వారెవరు? శ్రీకృష్ణునిసంతతివారమైన మనము! ఈపరమాశ్చర్యకరమైన సంగతిమాత్రము బాగుగాఁ దెలిసికొనవలెను. మోక్షపథము మొట్టమొదటఁ గనిపెట్టి అందఱకుఁ బ్రకటించినది వేదము, మహాబోధకులైన బుద్ధుఁడు క్రీస్తువు మున్నగువారు తరువాత బోధించిన దేమున్నను అదియంతయుఁ దత్ప్రథమోత్పత్తిస్థానములైన వేదములనుండియే సంగ్రహింపఁబడినది. వారు సన్యాసులు; కనుక "వారికి శత్రువులు లేరు, అందఱయెడలను వారికి దయామిత్రభావము లున్నవి" వారిమట్టున కదంతయు బాగుగనే యున్నది. కాని, ఆ ఒక్క మోక్షమార్గమే మీరందఱు అనుసరింపుఁడని యావత్ప్రపంచమును బలవంతపెట్టుటకు ఆప్రయత్నమేమి? రాచితోమి రుద్ది సౌందర్యమును సృష్టింపఁగలరా; ప్రార్థించికాని బలాత్కరించికాని యెవరినేని ఆత్మీయులుగాఁ జేసికొనఁగలరా? మోక్షమక్కఱలేనివానికి, మోక్షమునకు తగనివానికి, బుద్ధుఁడును క్రీస్తువును ఏమిబోధింతురు? ఏమియు లేదు. మోక్షమైనను గ్రహింపవలెను, తప్పక వినాశమైన నందవలెను—ఈరెండుమార్గములే వారు చూపినవి, మధ్యమార్గమేమియు లేదు. మోక్షేతరప్రయత్నమేమైనఁ జేయుటకు నీకాళ్ళుచేతులు కట్టిపెట్టినారు. కొంతకాల మొకించుక ఐహికసుఖము లెట్లనుభవింపవచ్చునో ఆపుంత యేమియు పొడకట్టఁ జేయలేదు. అన్నిత్రోవలు దిట్టముగా బంధించుటయే కాక, నీకు అడుగడుగునకు అడ్డములు వేసినారు. ధర్మార్థకామమోక్షచతుర్విధపురుషార్థఫలసిద్ధికై మార్గము లాలోచించి నియమములు విధించిన మతము ఒక్క వేదమతమే. బుద్ధుఁడు మనలను పాడుచేసినాఁడు, గ్రీసు రోము దేశములను క్రీస్తువు పాడుచేసినాఁడు. వారి యదృష్టవశమున యూరప్పుదేశీయులు కాలక్రమమున ఆదిక్రైస్తవమతము నెదిరించి 'ప్రొటెస్టెంటు'లయి పోప్పుగారు అనుశాసించిన క్రైస్తవబోధముల విదిల్చివైచుకొని, అమ్మయ్య! ఇఁక బ్రతికి పైనిబడినామని యనుకొ

లను మన దేశములోఁ బ్రవేశపెట్టినట్లు తోఁచుచున్నది. గీతాబోధములప్రకారము ప్రవర్తించుచున్నవారెవరు? యూరప్పులోనివారు. జీజస్ క్రైస్టుగారి యుపదేశములప్రకారము జీవనము గడపుకొనుచున్నవారెవరు? శ్రీకృష్ణునిసంతతివారమైన మనము! ఈపరమాశ్చర్యకరమైన సంగతిమాత్రము బాగుగాఁ దెలిసికొనవలెను. మోక్షపథము నెట్టమొదటఁ గనిపెట్టి అందఱకుఁ బ్రకటించినది వేదము, మహాబోధకులైన బుద్ధుఁడు క్రీస్తువు మున్నగువారు తరువాత బోధించిన దేమియున్నను అదియంతయుఁ దత్ప్రథమోత్పత్తిస్థానములైన వేదములనుండియే సంగ్రహింపఁబడినది. వారు సన్న్యాసులు; కనుక "వారికి శత్రువులు లేరు, అందఱయెడలను వారికి దయామిత్రభావము లున్నవి" వారిమట్టున కదంతయు బాగుగనే యున్నది. కాని, ఆ ఒక్క మోక్షమార్గమే మీ రందఱు అనుసరింపుఁడని యావత్ప్రపంచమును బలవంతపెట్టుటకు ఆప్రయత్నమేమి? రాచితోమి రుద్ది సౌందర్యమును సృష్టింపఁగలరా; ప్రార్థించికాని బలాత్కరించికాని యెవరినేని ఆత్మీయులుగాఁ జేసికొనఁగలరా? మోక్షమక్కఱలేనివానికి, మోక్షమునకు తగనివానికి, బుద్ధుఁడును క్రీస్తువును ఏమిబోధింతురు? ఏమియు లేదు. మోక్షమైనను గ్రహింపవలెను, తప్పక వినాశమైన నందవలెను—ఈరెండుమార్గములే వారు చూపినవి, మధ్యమార్గమేమియు లేదు. మోక్షేతరప్రయత్నమేమైనఁ జేయుటకు నీకాళ్ళుచేతులు కట్టిపెట్టినారు. కొంతకాల మోకించుక ఐహికసుఖము లెట్లనుభవింపవచ్చునో ఆపుంతయేమియు పొడకట్టఁ జేయలేదు. అన్నిత్రోవలు దిట్టముగా బంధించుటయేకాక, నీకు అడుగడుగునకు అడ్డములు వేసినారు. ధర్మార్థకామమోక్షచతుర్విధపురుషార్థఫలసిద్ధికై మార్గము లాలోచించి నియమములు విధించిన మతము ఒక్క వేదమతమే. బుద్ధుఁడు మనలను పాడుచేసినాఁడు, గ్రీసు రోము దేశములను క్రీస్తువు పాడుచేసినాఁడు. వారి యదృష్టవశమున యూరప్పుదేశీయులు కాలక్రమమున ఆదిక్రైస్తవమతము నెదిరించి 'ప్రొటెస్టెంటు'లయి పోప్పుగారు అనుశాసించిన క్రైస్తవబోధముల విదిల్చివైచుకొని, అమ్మయ్య! ఇఁక బ్రతికి పైనిబడినామని యనుకొ

తలిదండ్రులు లేనిబిడ్డలకును అన్నము పెట్టుటకు అన్యదేశములలో నేను ముష్టియెత్తి తెచ్చినధనమును స్వదేశీయులు సంగ్రహించుటకు యావత్ప్రయత్నములు చేయుచున్నారు! ఆడబ్బు రానియెడల గావలసినన్ని తిట్లును అపనిందలును ! ఓస్వదేశీయవిద్వాంసులారా ! నాదేశస్థులట్టివారు. ముఖస్తుతులవలన వారినుండి నాకు వచ్చుప్రతిఫల మేమియులేదు, వారిని నేను బాగుగా నెఱుగుదును. పిచ్చివాండ్రను జూచినట్లు వారిని జూడవలయునని నాకుఁ దెలియును ; మతిపోయినవారికి మందిచ్చువాఁడు తన్నులకు కొట్లకు సిద్ధపడియుండవలెను ; కాని ఆయున్నిటికి ఆయిత్తపడి బలవంతముగా గొంతుకలో ఔషధముపోసి మ్రింగించువాఁడే వారికి నిజమైన స్నేహితుఁడు.

ప్రతిదేశమునకు ఈజాతి ధర్మస్వధర్మపద్ధతి ప్రజాక్షేమకరమైన మార్గము—చివరకు ముక్తికెక్కించు నిచ్చెన. ఈజాతిధర్మస్వధర్మములు పాడగుటతోడనే మనదేశ మధోగతిపాలగుటకుఁ బ్రారంభించినది. కాని ప్రస్తుతము పైజాతివారు జాతిధర్మస్వధర్మములఁగూర్చి పడు అభిప్రాయములు అనర్థదాయకములు. ఈక్రొత్తయుపద్రవమునుండి కాచుకొనవలెను. జాతిధర్మమునుగూర్చి సమస్తము వారికిఁ దెలియుననుకొందురుగాని నిజముగా నేమియుఁ దెలియదు. వారిగ్రామములోనియాచారములే వేదవిహితములైన సనాతనధర్మములనుకొని సర్వాధికారములు తామే సేకరించుకొని యవసానదశకు వచ్చుచున్నారు. ఇట వంశపరంపరగా వచ్చువర్ణపద్ధతినిగూర్చి వచించుచున్నానుగాని గుణప్రధానములైన వర్ణములఁగూర్చి కాదు. ఆదిని గుణములఁబట్టియే వర్ణవిభాగము లేర్పడినవని నేనొప్పుకొనుచున్నాను ; కానిగుణములు రెండుమూఁడుతరములలోనే వంశపరంపరానుగతము లగును. మన జాతీయతకు, ప్రాణప్రియమై ప్రధానముగానుండు ఆయంశమున బాధకలిగినది, లేనిచో మన మిట్లేల క్రుంగికూలఁబడవలసివచ్చినది ? ఈగీతావాక్యము జూచుఁడు.—సంకరస్యచకర్తాస్యాముపహన్యామిమాఃప్రజాః॥ అప్పుడు నేను వర్ణసాంకర్యకర్తుఁడనగుదును, అందువలన ఈప్రజలను పాడుచేయువాఁడనగుదును—ఈపరస్పరానులోమవిలోమ

జాతిసంక్రమణము, ఈగుణగాగవభేదవినాశము, ఈ ఘోరమైన వర్ణసాంకర్యము ఎట్లువచ్చినవి ? మనపూర్వుల తెల్లనిశరీరచ్ఛాయ నల్లగా ఏలమాఱినది ? సత్వగుణము చచ్చి ముష్కరమైనతమోగుణ మెట్లు దాపురమైనది ? పోషించిన ట్లెక్కడ నిక్కడ సంచితరజోగుణ మున్నను ఏమిలాభము ? అదియొక పెద్దగాథ ; ఆవిషయమై ముందొక్కొకడైన ముచ్చటించెదను. ఇప్పటి కిది మనసులోఁ బెట్టుకొనుఁడు — జాతిధర్మములను నసిగా అసిధారావ్రతముగాఁ గాపాడుకొన్న జాతి యెన్నఁటికిని నశింపదు. ఈమాట నిజమైనయెడల, మనల నధోగతికిఁదీసికొనివచ్చిన దేదిమఱి ? జాతిధర్మముల పునాది చెడిపోయినదనుటకు మనము పతితులమగుటయే ప్రబలప్రమాణము. కనుక మీ రనుకొను జాతిధర్మము నిజమైనజాతిధర్మమునకుఁ గేవలము విరుద్ధము. మీరుశాస్త్రములన్నియు నామూలాగ్రముగా చదివి గాలించి చూచినయెడల, శాస్త్రవిహితములైన జాతిధర్మములు ఇప్పుడు దేశములో దాదాపుగా లేవనియే మీరు సులభముగాఁ దెలిసికొనఁగలరు. నిజమైనజాతిధర్మమును తిరుగఁ దీసికొనివచ్చుటకుఁ గడఁగుఁడు, అప్పుడు దేశమునకు మీరు నిజమైన యుపకర్తలగుదురు. నేను నేర్చి గ్రహించిన దేదో అది నిష్కపటముగా మనసిచ్చి మీకుఁ జెప్పుచున్నాను. ఏవో క్రొత్తశాస్త్రీయసమాధానములు చెప్పి మీమూఢాచారముల నన్నిటిని సమర్థించి పోషించుటకు నేను పరదేశమునుండి దిగుమతియైవచ్చి మిమ్ము రక్షింపఁ బూనుకొన్నవాఁడను గాను ; మన విదేశమిత్రులట్లు చేయఁగలరు, దానివలన వారికి వచ్చునష్టమేమియు లేదు. జయజయధ్వానములుచేసి మీరు వారిని సంస్తుతులతోఁ గప్పివేయుచున్నారు. వారికంతకంటెఁ గావలసినది లేదు. మఱికి, దుమ్ము మీముఖముల మీఁదఁగొట్టినచో నామొగముమీఁదఁగూడఁ బడును. అది యొప్పుకుదురా ? దాని కేమందురు ?

ప్రతిజాతికిఁ బ్రత్యేకముగా నొకపరమార్థలక్ష్యమున్నదని యితఃపూర్వ మొకచోటఁ జెప్పినాను. ప్రకృతిశాసనము ననుసరించియో గొప్పవారి బుద్ధివిశేషముచేతనో, ప్రతిదేశీయాచారమర్యాదలును తన

ద్దేశసాఫల్యమున కనుకూలముగా అచ్చునఁ బోసినట్లు ఏర్పఱుపఁబడును. ప్రతిదేశజీవితములోను, ఆయుద్దేశమును, దానిని నెఱవేర్చుకొనుట కత్యావశ్యకములగు ఆచారవ్యవహారమర్యాదలును గాక యితరములు కొన్ని యుండును గాని అవన్నియు అముఖ్యములు. అనావశ్యకములు. అట్టియాచారము లభివృద్ధినొందినను అడుగంటిపోయినను ఒక్కటే; జాతికి నష్టములేదు; కాని దాని జీవితముఖ్యోద్దేశమునకుమాత్రము భంగముగలుగునెడల ఆజాతి తప్పక నశించును.

మనమందఱము బాల్యములో ఒకరాక్షసినిగూర్చి కథ వినియున్నాము. దానిప్రాణ మొకచిన్నపిట్టలో దాఁచి పెట్టఁబడియుండెను, ఆపిట్టను గిట్టించినఁగాని రాక్షసిచావదు. జాతియొక్క ప్రాణముకూడ నట్లే. అదిగాక యింకొకసూక్ష్మాంశముకూడ మీరు కనిపట్టవలెను. జాతీయముఖ్యోద్దేశమునకు విశేషముగా సంబంధింపని స్వామ్యములఁ బ్రజలనుండి నీవు లాగుకొనినను, వారంతగాఁ జింతింపరు, అట్టివన్నియుఁ బోగొట్టినను లక్ష్యపెట్టరు; కాని జాతియొక్క ప్రాణమునకాధారముగానుండు ఆయుద్దేశమున కించుక హానితగిలినవెంటనే వారందఱు రేఁగి విపరీతవీర్యవంతులై తిరుగఁబడుదురు.

ఇప్పుడు జీవించియుండు ఫ్రెంచిజాతి, ఇంగ్లీషుజాతి, హిందుజాతి ఉదాహరణములుగాఁ దీసికొందము; అంతో యింతో వారిచరిత్ర మీరెఱిఁగియేయున్నారు. ఫ్రెంచివారి కీప్రకృతిలో రాజకీయస్వాతంత్ర్యము ప్రధానలక్షణము. అన్నిబాధలను వారు భరింతురు—ఎన్నిపన్నులు వేసినను మాటాడరు, దేశీయులనందఱను సేనలోఁ బ్రవేశించి దెబ్బలాడుఁడని బలాత్కరించినను, అదేమనరు; కాని పరిపాలన స్వాతంత్ర్యమున కడ్డు ఏమాత్రమువచ్చినను, ప్రజలందఱు ఏకీభవించి వెఱ్ఱియెత్తినట్లు ప్రతిఘటింతురు. "ఎవనినైనను సరే ఒక్కని బలవంతముగా మాపైన అధికారము చలాయింపనీయము; విద్యావంతులకు విద్యావిహీనులకు, భాగ్యవంతులకు పరమదరిద్రులకు, అభిజాతులకు అల్పజాతులకు—అందఱకు దేశపరిపాలనమందును ప్రజాపరిపాలనమందును సమానమైన హక్కున్నది." ఇది ఫ్రెంచివారి ప్రవర్తన ప్రకృ

తికి మూలాధారమైన లక్షణము. ఈస్వతంత్రతకు భంగముగలిగింపఁ బ్రయత్నించువాఁడు బాధ యనుభవింపకతప్పదు.

ఇంగ్లీషువారి ప్రధానస్వభావలక్షణము ఇచ్చి పుచ్చుకొను వాణిజ్యసహజలక్షణము. అధికారములు న్యాయముగా సమానముగా పంచుకొని యనుభవించుట వారికి ముఖ్యముగాఁ గావలసినది. రాజునకు, కులీనులుగొప్పతనమునకు, ఆంగ్లేయుఁ డడఁగి మడఁగి యుండును. అయిననేమి? తా నొకదమ్మిడీ యీయవలసివచ్చినప్పుడు దానికి జమాఖర్చు లడుగకమానఁడు. రాజన్నాఁడు, మంచిదే, ఆయనకు విధేయతాగౌరవములు కనఁబఱుచుట కాంగ్లేయుఁడు సిద్ధముగానుండును; కాని రాజునకు డబ్బు కావలయునెడల—సరే కాని నీకు డబ్బేల కావలయునో దానివలన నాకేమిలాభమో మొట్టమొదటఁ జెప్పుము, తరువాత, అది యెట్లువ్యయముచేయవలెనో ఆవిషయమున నాయభిప్రాయము పుచ్చుకొనవలెను. అట్లయినచో నేనాడబ్బిచ్చెదను—అని యతఁడు పల్కును. ఆంగ్లేయప్రజలనుండి మున్నొకప్పుడు బలాత్కారముగా డబ్బులాగుకొనుటకుఁ బ్రయత్నించిన ప్రభువుమూలమున దేశ మల్లకల్లోలమై పాలనాపద్ధతిలోఁ బెద్దపరివర్తనము కలిగినది. పాపమారాజును ప్రజలు చంపివేసినారు.

రాజకీయవ్యవహారములలో స్వాతంత్ర్యము సరే, సంఘపాలనాస్వాతంత్ర్యము సరే, వాని మాటకేమి? సత్యమైనది నిత్యమైనది ఆత్మస్వాతంత్ర్యము, ముక్తి, అది కావలెను—అని హైందవుఁడనును. మనజాతీయసంకల్పము, మనజాతికి పరమార్థము. ఇది. వైదికులు, జైనులు, బౌద్ధులు, అద్వైతులు, విశిష్టాద్వైతులు, ద్వైతులు,—అందఱును ఈవిషయమున ఏకాభిప్రాయులై యున్నారు. దానిజోలికిపోక, మీయిష్టమువచ్చినట్లు చేసినను, హిందువు ఉదాసీనభావముతో ఊరకుండును, కాని ఆవిషయములో దానికి వ్యతిరేకించి వ్యవహరించితిరా, జాగ్రత్త! మీగోయి మీరు త్రవ్వుకొందురు! అతనిసర్వస్వమును దోఁచికొనినను సరే, తన్నినను సరే, నల్లవాఁడని కాని మఱియొకటియని కాని అతనిని దిట్టినను సరే, వాని కంత లక్ష్యపెట్టఁడు, అతని

మతద్వారముమాత్రము నిర్నిరోధనముగా స్వేచ్ఛగా అతనికి వదలిపెట్ట వలెను. నవీనశకములో పఠాణవంశజులు వచ్చుచుం బోవుచు నుండిరి గాని హిందురాజ్యము స్వాధీనమైదేమో చూడుడు ! ఎందుచేత ? ఎల్లప్పుడు వారు హిందుమతమునకు బాధకలిగించుచుండెడివారుగనుక. మొగలురాజ్యము ఎంతబలముగా ఎంతదృఢముగా స్థాపితమైనదో చూడుడు. ఎందుచేత ? మొగలులు మతముజోలికిం బోలేదుగనుక. నిజముగా హిందువులే మొగలు రాజ్యమునకు ఆసరాగాఉండిరి. జహాంగీరు, షాజహాను, దారాషకో—వీరందఱు హిందుమాతలబిడ్డలేయని మీరెఱుంగుదురుకదా. ఇంకొకటి చూడుడు-అభాగ్యుండైన ఔరంగజేబు ఆమతమున కడ్డుదగిలినవెంటనే బ్రహ్మాండమైన మొగలు రాజ్యమంతయు క్షణములో స్వప్నప్రాయమై రూపుమాసిపోయినది. మన దేశములో బ్రిటిషు రాజ్యమేల బలముగా పాదుకొనియున్నదో తెలియునా ? ఎంతమాత్రము పరిపాలకులు దేశస్థులమతముజోలికి ఎన్నండును బోరుగనుక. బుద్ధిమంతులైన క్రైస్తవమతబోధకులు దానిలో వ్రేలుపెట్టుటకుం జూచినవెంటనే సేనలు తిరుగఁబడినందువలన 1857 వ సంవత్సరపు సంక్షోభము సంభవించినది. ఇంగ్లీషువారీయంశమును బాగుగా గ్రహించి జాగరూకతతోం బ్రవర్తించిన మొదల, వారిరాజ్యము నిశ్చలముగా నిష్కళంకముగా నిలిచియుండఁగలదు. వారిలో వివేకవంతులును దూరదృష్టిగలవారును కూడ ఈరహస్యము గ్రహించి యొప్పుకొనుచున్నారు. రాబర్ట్సుదొరగారు వ్రాసిన " హిందుదేశములో నలువదియొక్క సంవత్సరములు అను పుస్తకములోని 30, 31 ఆశ్వాసములు-Forty one years in India, 30th &31st chapters" చదువుడు.

ఈ మనరాక్షసి ప్రాణ మెచటనున్నదో యీపాటికి మీకు స్పష్టముగాం దెలిసియుండవచ్చును—అది మతములోనున్నది. అది చంపుటకెవఁడు శక్తుఁడు కాకపోవుటచేతనే అన్నిన్నికష్టములు గండాలుగడచి హిందుజాతి యింకను జీవించియున్నది. " జాతియొక్క ప్రాణము మతములోం బెట్టుటవలన లాభమేమున్నది ? ఇతరజాతులవలె దానిన్ని

సాంఘికరాజకీయస్వాతంత్ర్యములలోఁ బెట్టరాదా ?" యని మనభారతీయవిద్వాంసుఁ డొకఁడు ప్రశ్నించుచున్నాఁడు. అట్లుపలుకుట కడు సులభము, మతము, ఆత్మ, ఆత్మస్వాతంత్ర్యము, ముక్తి — ఇవన్నియు వట్టి అసత్యములని కేవల వాదార్థము ఒప్పుకొని, ఆపక్షమునను నను సంగతిసందర్భము లెట్లుండునో చూతము. ఏకమైన అగ్ని బహురూపవికారములనంది యెట్లు మనకగపడుచున్నదో, అట్లే ఏకమైనమహాశక్తి ఫ్రెంచివారిలో రాజకీయస్వతంత్రతారూపముగాను, ఆంగ్లేయులలో వాణిజ్యనైపుణ్యరూపముగను న్యాయవ్యాపనకుశలతారూపముగను, హిందువులలో ముక్తీచ్ఛారూపముగాను గోచరించుచున్నది. ఈమహాశక్తి ప్రేరణమువలననే, అనేకశతాబ్దము లనేకకష్టసుఖములు — అనేకావస్థాభేదములు — అనుభవించి ఫ్రెంచివారును ఇంగ్లీషువారును ప్రస్తుతస్వభావమునకు వచ్చినారు, ఈమహాశక్త్యావేశమువలననే యనేకసహస్రశతాబ్దములు పరిణామదశలనంది మనహిందువులు ప్రస్తుతజాతీయప్రకృతి యులవఱుచుకొన్నారు. అనేకశతసహస్రవర్షసంచితమైన మనజాతీయప్రకృతి వదలివేయుట సుకరమా ? కొన్నివందలయేండ్లనుండి అంటుకట్టి అలవడఁజేసికొన్న విదేశీయప్రకృతి విడిచిపెట్టుటసులభమా ? ఆంగ్లేయులు, వారియుద్ధాభ్యాసములు మఱచిపోయి, దెబ్బలాటలు మారణకృత్యములు మానుకొని ఒకచోట శాంతముగాఁ గూరుచుండి, కేవలము మతమే జీవితప్రయోజనముగాఁ జేసికొనుటకు తమయావచ్ఛక్తియు ఏల వినియోగపఱుపరు?

ఉన్నసంగతి యిది — నది దానియుత్పత్తిస్థానమైన పర్వతములువదలి ఒకవేయిమైళ్ళు క్రిందికి వచ్చినది. అది తిరుగ తనజన్మస్థానమునకుఁ బోవునా ? పోఁగలదా ? అట్లుపోఁదలఁచినచోఁ జెల్లాచెదరై యీవైపు ఆవైపు వ్యర్థముగాఁ బాఱి యిట్టిపోవును. సుందరమైనబయళ్ళమీఁదుగాఁ బ్రవహించియో, ముఱికినేలలలోనుండి కొట్టుకొనికొట్టుకొని యావలఁబడియో, ఎట్లో, యెప్పటికోయొకప్పటికి నది తనగమ్యస్థానమైన సముద్రమును జేరకతప్పదు. ఈపదివేలసంవత్సరము లనుండియు మనము చేయుచున్న జాతీయజీవనము వట్టిభ్రమప్రమాదమే యై

వచో, దానికి మనము చేయునదేమియు లేదు ; అది మన గ్రహాచారము ; ఇప్పుడు మనస్వభావమును మార్చుకొని క్రొత్త స్వభావము తెచ్చి పెట్టుకొనుటకుఁ బ్రయత్నింతుమేని, మనవినాశమే అట్టిప్రయత్నమునకు అనివార్యమైన ఫలమగును.

కాని, మనజాతివారు పరమార్థముగా నెంచుకొన్న ప్రయోజనము పొరపాటని యూహించుట కేవలము మౌఢ్యము, అజ్ఞానము అవివేకము. ఇట్లన్నందులకు నన్ను క్షమింపవలెను. తొలుత ఇతర దేశములకు వెళ్ళి అక్కడివారి యాచారములు స్థితిగతులును, ఇతరులదృష్టితోఁగాక నీకన్నులతో జాగ్రత్తగాఁగనిపట్టుము, కనిపట్టి, వివేకము నీకున్నయెడల దానితోఁబర్యాలోచనము చేయుము ; పిమ్మట నీవేదములు పూర్వగ్రంథములు చదువుము, చదివి హిందుదేశమెల్లఁ దిరుగుము. తిరిగి యందలివివిధభాగములప్రజలను వారియాచారవ్యవహారములను, మూఢదృష్టితోఁగాక మంచి వివేకము పరిశీలనము గలవాని దృష్టితోఁ గన్నులు బాగుగాఁదెఱచి పరికింపుము—అట్లు చేసితివేని, మనజాతి యెప్పటియట్లే యింకను బ్రతికియున్నదనియు, దానిజీవనాడి యింకను గొట్టుకొనుచున్నదనియు, మధ్యందినమార్తండునివలె నీకు స్పష్టముగాఁ బ్రత్యక్షముగాఁ గానిపించును. అంతేకాక, పైకి మరణించి భస్మమయిన ట్లగపడుదానిలోఁడాఁగి మనజాతీయజీవనాగ్ని యింకను రగులుచున్నదనియు, మనజాతియొక్క ప్రాణభాషాభావములు మూఁడును మతమేయనియు, నీరాజకీయవ్యవహారములు, ప్రజాసంఘప్రయోజనములు, పట్టనపరిపాలనాసంఘకృత్యములు, మహామారిరాకుండఁగాచునేర్పాటులు, క్షామబాధానివారకక్రియలు—ఇవన్నియుఁ బూర్వమునుండి యింతవఱకుజరుగుచున్నట్లే జరుగుననియు, అనఁగా మతమూలముగా నెఱవేఱుననియు—నీకుఁ దెలియును. అట్లుకానిచో మిత్రమా ! నీపిచ్చికేకలు ఏడ్పులు నిరర్థకములు.

మఱియు, ఎన్నిభేదములున్నను ప్రతిదేశములోను సాధనసంపత్తిమాత్రము సమానమే—అనఁగా బలవంతులైన స్వల్పసంఖ్యాకుల మాట విధిగా నెఱవేఱును, తక్కినవారందఱు గొఱ్ఱెలమందవలె వారిని

వెంబడించిపోనురు; ఇంతే. చెలి గాంధా! నీపార్లమెంటులు, నీప్రెస్సులు నీవోట్లు, నీమెజారిటీలు, నీబేలట్లు నేను చూచినాను. జనులవర్గము సర్వత్రసమానములే. ప్రతిదేశములోను బలవంతులు, సంఘమును వారి యిష్టమువచ్చినట్లు త్రిప్పుచున్నారు, తక్కినవారు గొర్రెలమందలే! మన మడుగవలసినప్రశ్న యేమనగా, హిందూదేశములో ఈశక్తిమంతులైన జనులెవ్వరు? మతములో ఉద్దండులైనవారు. వారే సంఘమును నడిపించువారు, వారే ఆవశ్యకతనుబట్టి సాంఘికాచారధర్మములను మార్చువారు, మాఱుమాటాడకుండ వారియాజ్ఞలను శిరసావహించి మనము ప్రవర్తింతుము. మెజారిటీవోట్లు, బేలట్లు-ఇత్యాది యనావశ్యకమైన అట్టహాసములు, ఆడంబరములు, తత్సంబంధములైన గొడవలు దొమ్ములాటలు పరదేశములకున్నట్లు మనకు లేవు—ఇదొక్కటియే మనకు వారికి ఉండుభేదము; అంతకంటె లేదు. వోట్లబ్యాలట్లపద్ధతివలన పశ్చిమఖండములో జనసామాన్యమునకు కలవని విద్య మనకు లభించుట లేదన్నమాట వాస్తవమే, కాని రాజకార్యద్వారమున ఇతరులను దోచుకొని, యూరపుదేశములోని పామరజనుల ప్రాణరక్తము పీల్చి తాముక్రొవ్వి బలియుచుండు శ్రీమంతులు మన దేశములో లేరు. మిత్రమా! ఈరాజ్యతంత్రజ్ఞులు తెరచాటున జేయు ఘోరకృత్యములు—అట్టి సమయములందిచ్చు పుచ్చుకొను లంచముల దండుగలు, పట్టపగలు బహిరంగముగా జరుగు దోపిడ్లు, మనుష్యునిలోనుండు మనోదుర్వృత్తి పిశాచము చెలరేగి త్రొక్కుచిందులు—ఇవన్నియు నీవు చూచితివేని, ఇంక మనుష్యుని బాగుపడుట యెక్కడ? అని నిరాశుడవై పోదువు. "కొనుకొనుడస వాలు, కంచ కంచెలబడి బిచ్చమెత్తును, పతివ్రతాశిరోమణికి మానగోపనమునకైనను మంచివంచె దొరకుటకష్టము; కాని, కల్లుపాకలో కాలుపెట్టుటకైనను సందులేనంత జనసమ్మర్దము, పట్టణములో సర్వాభరణభూషితలైన కులటలకులుకులాటలు" అని యొకకవిశ్వేశ్వరుడు సంసారమును వర్ణించినాడు. ప్రజలు తుచ్ఛవిషయసుఖములకై తుఱ్ఱుతుఱ్ఱున పరుగెత్తుచుందురు; కాని, పరిశుద్ధతను పరమార్థమును చూడరు. ధనవంతులు

దేశపరిపాలనమంతయు వారిచేతిలోఁ బెట్టుకొని, ప్రజలవిత్తము నపహరించి వారిని పీల్చిపిప్పిచేసి, పరదేశములకు యుద్ధభటులుగా వారినిబంపి పరిమార్చి, రణరంగమునఁబడిన పరిపాలిత ప్రజలరక్తమువలన గడించిన కనకరాసులతో వారిభోషాణములను నింపుకొందురు. ఇఁకఁ బరిపాలిత ప్రజలకుఁగలుగు లాభ మేమి? తమరక్తమురాల్చి చచ్చుటయే వారికి వచ్చులాభము—పరిపాలనతంత్రముయొక్క పసయిది—మిత్రమా! ఉలికిపడకుము; దాని తిరుగుళ్లలోఁ జిక్కి త్రోవదప్పి చెడిపోకుము

మొట్టమొదట ఇది చక్కఁగా గ్రహించుకొనఁజూడుము—మనుష్యుఁడు చట్టము లేర్పఱచునా, చట్టము లతనిని జేయునా? మనుష్యుఁడు డబ్బు ఆర్జించునా, డబ్బు మనుష్యుని ఆర్జించునా? మనుష్యులు పేరును ప్రతిష్ఠను సంపాదించుకొందురా? పేరును ప్రతిష్ఠయును మనుష్యుని సంపాదించుకొనునా? మిత్రమా! తొలుత సరియైన మనుష్యుఁడవుగమ్ము, తరువాతఁ దామంతటఁ తామే తక్కినవన్నియు నీవెంటఁబడి యెట్లువచ్చునో నీకే తెలియును. ఆదిక్కుమాలిన యీర్ష్యాద్వేషములును, ఆకుక్క మొఱుఁగులును, కొట్లాటలును వదలిపెట్టి, సత్ప్రయోజనము, సత్సాధనములు, సత్కార్యకరణమునందు నిర్భయత్వము—వీని నంటిపట్టుకొని పౌరుషవంతుఁడవు గమ్ము. పురుషుఁడవై పుట్టినందులకు, శాశ్వతమైన పౌరుషస్మారకచిహ్న మేదోయొకటి నీవెనుకవదలిపెట్టిపొమ్ము. "నీవు ప్రప్రథమమున ఈప్రపంచమునకు వచ్చినప్పుడు, ఓ తులసీదాసా! లోకులు సంతసించినారు, నీవేడ్చినావు. అందఱు నీకోసము గోలుగోలున నేడ్చుచుండఁగా నీవుచక్కఁగా నవ్వుచుఁ బ్రపంచమును వీడిపోవునట్లు సత్కార్యములుచేయుచు నీవిప్పుడు జీవయాత్రచేయుము." అని హిందిరామాయణము వ్రాసిన మహానుభావుఁడు—తులసీదాసుఁ డను మహాకవియు మహాభక్తుఁడును—ఇట్లు తన్నుఁదాను సంబోధించుకొని పలికినాఁడు. ఐహికచింతనాసక్తులకు అందిట్టి సమవదేశములును లలితమైన తత్త్వవాక్యములును అనేకములున్నవి. అట్లు చేయఁగలిగిననే నీవు పురుషుఁడవనిపించుకొందువు; లేనిచో నీవలనఁ బ్రయోజనమేమి?

మఱియొక సంగతి నీవు తెలిసికొనవలయును—ఇతర దేశీయులవలన మనము నేర్చుకొనఁదగిన విషయము లనేకములున్నవి—నేనిఁక నేర్చుకొనవలసిన దేదియు లేదు, అని చెప్పువాఁడు, ఊర్ధ్వశ్వాస మూర్చస్థితికి వచ్చినవాఁడన్న మాటయే! సమస్తము మే మెఱుఁగుదుము, అనుకొనుజాతివారు వినాశసన్నిహితులై యున్నారన్న మాటయే! "యావజ్జీవము నేను నేర్చుకొనుచునే యుందును, కాని యితరులనుండి సంగ్రహించినవన్నియు నాదేశీయసంప్రదాయముల కనుకూలముగా మార్చు సవరించుకొందును," అనుకొనవలెను. ఈసంగతి మఱచిపోఁగూడదు. ఇతరులు మనకు బోధింపఁదగినదేమైన నున్న యెడల అది మనము సంగ్రహించుకొని మన జ్ఞానభండారములోఁ జేర్చుకొందము, అంతేకాని అది మనసొత్తుకు భంగకరముగానీయఁగూడదు. ఈవిషయమున మనము సదా జాగరూకులమై యుండవలెను. యూరప్పువారిపగిది వంటచేసికొనవలెనని నాకుఁ గోరికయున్నదనుకొనుము. వారు కుర్చీలపైఁ గూర్చుందురు. క్రిందఁగూర్చుండి భోజనముచేయుట మన కలవాటు, వారి ననుకరింపవలెనను నుద్దేశముతో నేను భోజనపదార్థములు ఎత్తుబల్లమీఁద వడ్డింపించుకొని, కుర్చీమీఁద నొక గంటకుఁబైగాఁ గూరుచుంటినేని, కాళ్లుపీఁకుచు కాలమందిరమునకుఁబోవసిద్ధముగా నుందును. కనుక వారివంటకములు దినుచున్నను, నేను నాదేశాచారము ప్రకారము నేలమీఁదఁ గూరుచుండి తినవలెను. అట్లే విదేశసంప్రదాయముల ననుకరించినపుడెల్ల, మనము పూర్తిగా మన జాతీయలక్షణములు కాపాడుకొనుచు తదనుగుణముగా వానిని మార్చుకొనుచుండవలెను. "మనుష్యుఁడు దుస్తులకుట్టుకొని ధరించునా? దుస్తులు మనుష్యుని జేయునా?"—ఈసంగతి యాలోచించుకొనుఁడు. బుద్ధికుశలుఁ డేబట్టలు కట్టుకొనినను గౌరవింపఁబడును, చాకిగాఁడివలె వీఁపు మీఁద నెంతబట్టల బరువుపెట్టుకొని పోవుచున్నను, నావంటిమూఢుల నెవ్వరు లక్ష్యము చేయరు.

నేనింతవఱకు ఉపోద్ఘాతముగాఁ జెప్పినది కొంచెము దీర్ఘమైనది, కాని అది చదివినపిమ్మట, ఉభయజాతుల వారిని పోల్చి చూచుకొ

నుట సులభముగా నుండును. వారును మంచివారే, మనమును మంచివారమే. రెంటను సమానమైన రెండు తక్కెడకుడుక లేకాని, అమచిలో రకములున్నవి తరతమభావమున్నది. ఇదియే యున్నభేదము.

మన మతప్రకారము మనుష్యుని నిర్మాణములో దేహము, మనస్సు, ఆత్మ—అని మూడు ప్రకృతులున్నవి. బాహ్యాతమమైన శరీరమునుగూర్చి మొట్టమొదట ఆలోచింతము.

శరీరములో ఎట్టెట్టిభేదములున్నవో చూతము. ముక్కులలో, ముఖములలో, శిరోజములలో, దేహచ్ఛాయలలో, ఒడ్డులో, పొడుగులో—ఎన్నెన్నో భేదములున్నవి.

రక్తసాంకర్యమువలన శరీరచ్ఛాయ మారునని యిప్పటిజాతి శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

వాసస్థానముయొక్క శీతోష్ణస్థితినిబట్టి యొడలిచాయ కొంతవరకు మారుట నిజమేకాని, యట్టిమార్పునకు ముఖ్యకారణము వంశపారంపర్యమే యనుట నిస్సందేహము. ప్రపంచమందలి యతి శీతల ప్రదేశములలో నల్లనిజనులును, అత్యుష్ణప్రదేశములలో తెల్లనివారును గనబడుచున్నారు. అమెరికా, కెనడాలోని యాదిమ నివాసుల శరీరకాంతియును, ఉత్తర ధ్రువప్రాంతమందలి ఎస్కిమోల దేహమురంగును తెలుపుగాదు; భూమధ్యరేఖకు సమీపమున మిక్కిలి వేడిగానుండు బోర్నియో, సెలిబిజుమున్నగు ద్వీపములలో అనాదిగా నివసించుచున్నవారు తెల్లనివారు.

హిందూశాస్త్రదృష్టిని జూచినయెడల బ్రాహ్మ, క్షత్రియ, వైశ్యజాతులు మూడును, భరతఖండమునకు బైటనున్న-చీనులు, హూణులు, దరదులు, పల్లవులు, యవనులు, ఖానులు మున్నగు అనేకజాతులును ఆర్యజాతులే. మన శాస్త్రములలోని చీనుడు ఇప్పటి చీనాదేశస్థుడు కాడు. ఆకాలములో చీనాదేశస్థులు తమ్ము చీనులని యెన్నండును చెప్పుకొనలేదు; కాశ్మీరదేశమునకు ఈశాన దిశాభాగములందు ఆనాడు ప్రత్యేకముగా చీనులను ఒక తెగవారు బలపరాక్రమశాలులుండిరి. ఇప్పుడు మన దేశమునకును అఫ్ఘనిస్థానమునకును నడుమ

కొండజాతులందు ప్రదేశములలో అప్పుడు దరదులుండిరి. ప్రాచీనచీన పరిశిష్టులు కొంద అత్యల్ప సంఖ్యాకులు ఇప్పటికిని గానఁబడుచున్నారు; దరదస్థానమను ప్రదేశము ఇప్పటికిని ఉన్నది. కాశ్మీరచరిత్రమును దెల్పు రాజతరంగిణిలో బలవంతుఁడైన దరదరాజు ఔన్నత్యమును సూచించు వాక్యములు బహుళముగాఁ గాన్పించుచున్నవి. పూర్వ హూణజాతివారు హిందూదేశపు వాయవ్యభాగములందు చిరకాలము రాజ్యము చేసినారు. టిబెట్టు దేశస్థు లిప్పుడు తాము హూన్నులనుకొనుచున్నారు; ఈహూన్నులే హూణులు కావచ్చును, కాని మనువుచెప్పిన హూణులు ఇప్పటి టిబెట్టు దేశీయులు గారన్నమాట నిజము. ఇప్పటి టిబెట్టు నివాసులు—ప్రాచీనార్యహూణజాతికిని, ఏషియా మధ్యభాగమునుండి టిబెట్టునకువచ్చిన మోగలు తెగలకును, గలిగినసంతతి కాగచ్చునని తోఁచుచున్నది. రష్యాదేశస్థుఁడైన "ప్రిజెవాల్స్కి" గారును ఫ్రెంచిదొరయగు "డార్లెయాను గారును" బహుదేశ సంచారముచేసి జాతి పరిశోధనము చేసినవారు. ఆర్యజాతి ముఖలక్షణములును అఖిలలక్షణములునుగల తెగలవారు ఇప్పటి టిబెట్టులోని కొన్ని ప్రదేశములందుఁ గనఁబడుచున్నారని వారు చెప్పినారు. గ్రీకులను పూర్వము యవనులనెడువారు. ఈశబ్దముయొక్క వ్యుత్పత్తినిగూర్చి అనేక పూర్వపక్ష సిద్ధాంతములున్నవి. అయోనియా యను దేశములోని యొకగ్రీకుజాతివారికి మొట్టమొదట ఆపేరిడినారనియుఁ గావుననే పాళిభాషలోనున్న అశోకుని శాసనములలో గ్రీకులకుబదులు "యోనాను" లని యున్నదనియును ఈయోనశబ్దమునుండియే తరువాత సంస్కృతములోయవశబ్దము పుట్టినదనియుఁ గొందఱు వాదించుచున్నారు. యవనులనఁగా గ్రీకులుగారని హైందవపురాతనచరిత్రవిమర్శకులు కొందఱు చెప్పుచున్నారు ఈ యభిప్రాయము లన్నియుఁ దప్పనియే నా యభిప్రాయము. ఒక హిందువులేకాక, యీజిప్టు బేబిలోనియాలోని ప్రాచీనులుకూడ గ్రీకులను యవనులనియే పిలిచెడువారుగాన, యవనశబ్దమే మూలపదమై యుండవలెను. పల్లవభాష మాటలాడు పూర్వపు పారసీకులనే పల్లవులనెడివారు. నేఁడు సైతము, హిమాలయములందును

తత్ప్రాంతపర్వతప్రదేశములందును నివసించు అర్ధనాగరులకు ఆర్యజాతివారికే, ఖాసులను పదము వాడుచున్నారు. ఈవాడుకను బట్టి చూచినయెడల ప్రస్తుతపు యూరప్పుదేశీయులు ఖాసుల సంతతివారని చెప్పవలసివచ్చును—అనఁగా అనాగరకులగు ఆర్యజాతివారి నందఱను పూర్వము ఖాసులనెడు వారన్నమాట.

ఆర్యులు తెలుపు ఎఱుపుఁ గలిసిన వన్నెగలవారనియు, వారిశిరోజములు నల్లఁగానో ఎఱ్ఱఁగానో యుండెడివనియు ముక్కు వంకరగాలేక తిన్నగా నుండెడిదనియు, కన్నులు చక్కఁగా దీర్ఘములై యుండెడివనియు పుఱ్ఱె యాకారము పొడుగ్రకల రంగునుబట్టి యించుక పొఱుచుండెడిదనియు నవీనశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఒడలిరంగు నలుపైనపట్ల స్వచ్ఛమైన ఆర్యరక్తమునకు నల్లజాతుల సంపర్కము కలుగుటచేతనే ఆమార్పు కలిగినదని వారందురు. హిమాలయపర్వతములకుఁ బశ్చిమమున స్వచ్ఛమైన ఆర్యరక్తముగల కొన్నిజాతులింకనునున్నవనియు ఇతరులందఱు సంకరజాతులేయనియు, కాకున్నచో వారు నల్లవారెట్లు కాఁగలరనియు వారివాదము. కాని, హిందూదేశముయొక్క దక్షిణ ప్రదేశములందు ఎఱ్ఱవెండ్రుకలతో అనేక శిశువులు పుట్టుదురు. ఆ వెండ్రుకలు రెండుమూఁడు సంవత్సరములలో మారి నలుపెక్కుచున్నవి; ఇదిగాక, హిమాలయప్రదేశములలో అనేకులకు వెండ్రుక లెఱ్ఱగానుండును, కన్నులు నీలవర్ణముగానో బూడిదరంగుగానో యుండును. సంగతులు యూరప్పు పండితులకీపాటికి దెలిసియుండవలెను. ఈ

పండితుల నొకరితోనొకరు దెబ్బలాడుకొననిండు; పూర్వము నుండియు హిందువులు తమ్ము ఆర్యులని చెప్పుకొనుచున్నారు; స్వచ్ఛరక్తమువారైనను మిశ్రరక్తము వారైనను హిందువు లార్యులే, అది సిద్ధాంతము. నల్లవారమను కారణమున యూరప్పులోనివారికి ఆర్యుల మను మనము, ఇష్టులము గానిచో వారినే యింకొక పేరు పెట్టుకొననిండు, దానవలన మన కేమి బాధ?

నల్లనివారైనను సరే తెల్లనివారైనను సరే. ప్రపంచప్రజాసంఘములలో హిందువులు మంచి రూపరేఖావిలాసములు గలవారు.

మిక్కిలి చక్కనివారు, వారు హాజాతివారని, బడాయిమాటలును అతిశయోక్తులును కలుగుటలేదు; ఈసంగతి యావత్ప్రపంచమునకునువిశదమైయే యున్నది. రూపసులైన స్త్రీపురుషులు మన హిందూదేశమునందున్నంతమిక్కుటముగా మఱి యెటనున్నారు? అదిగాక ఇతర దేశస్థుల శరీరములవలెంగాక మన దేహములు బట్టబయలై యుండును. అట్టిచో మన దేశములో అందముగా నగపడుట కెంతశ్రమపడవలెనో యూహింపుకొనుడు. ఇతర దేశములలో దుస్తులమీద దుస్తులు వేసి కురూపులను సుందరులుగాఁ గనఁబడునట్లు చేయుటకు నిరంతరము ప్రయాసపడుచుందురు.

ఆరోగ్యములో మాత్రము పాశ్చాత్యులు మనలను మించినారన్నమాట వాస్తవము. పశ్చిమదేశములలో నలువదియేండ్ల పురుషులును ఏఁబదియేండ్ల స్త్రీలును ఇంకను యౌవనములోనే యుందురు. మంచి తిండితినుటయు, మంచిదుస్తులు తొడుగుకొనుటయు, చల్లని దేశములలో నివసించుటయు, వారట్లుండుటకు హేతువులు; బాల్యవివాహములు లేకుండుట అన్నిటికంటెను ముఖ్యమైన రహస్యకారణము. వారిబాలికలఁ బోనక్కఱలేదు. దేహబలముగల తెగలు మన దేశములోను కొన్ని యున్నవి; వారేవయసునఁ బెండ్లిచేసికొందురో చూడుఁడు. మీ రేయీడునఁ బెండ్లాడుదురని ఘూర్ఖాలు, పాంచాలులు, జాట్లు, ఆఫ్రిడీలు మున్నగు పర్వతీయు లనడుగుఁడు. తరువాత మీశాస్త్రములనే చదువుకొనుఁడు. వివాహయోగ్యమైనవయస్సు, బ్రాహ్మణునకు ముప్పదియనియు, క్షత్రియునకు ఇరువదియైదనియు, వైశ్యునకు ఇరువదియనియు అందు విధింపఁబడియున్నది దీర్ఘాయువులోను, దేహదార్ఢ్యములోను, మనోబలములోను పాశ్చాత్యులకును మనకును విశేష భేదమున్నది. మనకు నలువదియేండ్లు రాగానే మన యౌవనబల దేహబల బుద్ధిబలములు క్షీణింప మొదలుపెట్టును; వా రావయసులో మంచి యౌవనములోనుండి ఆశాపూర్ణులై యుత్సాహముతో పనిచేయుటకుఁ బ్రారంభింతురు.

మనము ధాన్యములు ఆకులు దుంపలు పండ్లు మొదలగు ఉద్భిజపదార్థములు తిని బ్రతుకువారము— మన రోగములలో పెక్కులు

జఠరసంబద్ధమైనవి; సాధారణముగా మనలో వృద్ధులు అజీర్ణ
లచే మరణింతురు. పాశ్చాత్యులు మాంసాహారులు—వారిరోగ
పెక్కులు హృత్సంబంధమైనవి; వారిలో వృద్ధస్త్రీలు వృద్ధపుర
సామాన్యముగా హృద్రోగములవలననో శ్వాసకోశవ్యాధులవ
మరణింతురు. దీర్ఘజఠరరోగపీడితులు సాధారణముగా చింతా
ను వైరాగ్యస్వభావులును అగుదురనియు, హృద్రోగములచేతను
కాయవ్యాధులచేతను బాధపడుచుండువారు యావజ్జీవము ఆశా
విశ్వాససంపన్నులై యుందురనియు నొక పాశ్చాత్యవైద్యశాస్త్ర
రదుఁడు వ్రాసినాఁడు; విషూచీరోగి మొదటినుండియు మరణశ
నుండును, క్షయరోగి చివరవఱకు జీవితాశతో నుండును. ఇం
నేనా హిందువులు సదాచావునుగూర్చియు సన్యాసమునుగూ
ఆలోచించుకొనుచు పరిసంగించుచుందురు? అని ఆవైద్యుఁడడి
అది అసంగతప్రశ్నముగాదు. ఆప్రశ్నకు సరియైన ప్రత్యుత్తర
కింకను స్ఫురింపలేదు; కాని యది సహేతుకమైన ప్రశ్నగాఁ గ
చుచున్నది; దానిఁగూర్చి శ్రద్ధగా ఆలోచింపవలయును.

మన దేశములో దంతవ్యాధులును తలవెండ్రుకల జబ్బు
అట్టిలేవు; పశ్చిమదేశములలో ఎవ్వరికో కాని స్వాభావికమై ఆ
వంతములగు పండ్లుండవు, ఏక్కడఁజూచినను బట్టతలవారే కా
రు. నగలు పెట్టుకొనుటకు మనస్త్రీలు ముక్కులును చెవులును
పించుకొందురు. అక్కడనన్ననో గొప్పయింటిస్త్రీలు అట్టిపను
జులలోఁ జేయుదు కాని, అందముగాఁ గానిపించుటకు పాపము! న
నొక్కి నొక్కి సన్నముచేసికొని, వెన్నెముక వంకరచేసికొని, అ
కాలిజమునకును ప్లీహామునకును స్థానభ్రంశము కలుగఁజేసి రూ
డఁగొట్టుకొని మరణబాధ నొందుచుందురు; దానికితోడుగ అ
స్ఫుటప్రదర్శనముకై అమర్చుకొను బట్టలభార మొకటి! పాశ్చా
వస్త్రధారణము పనిచేయుటకు ఎక్కువ అనుకూలముగానుండిన
నవంతులస్త్రీలు సభలకువచ్చునప్పుడు ధరించుకొను మనుస్తులు సు

ముగా నుండును గాని, సాధారణముగా అక్కడి స్త్రీలు వేసికొను బట్ట లు చూచుటకు వికృతిముగానుండును. మన స్త్రీల చీరలు పురుషుల వస్త్రములు తలపాగాలు అందములో అసమానములు. బిగుతుగా శరీరము నంటిపట్టుకొను దుస్తులు, చక్కని స్వాభావికమైన మడుపులు మడుపులుగా వ్రేలాడు వదులుబట్టలలో అందమున సరిరాజాలవు. కాని ముడుతలతో క్రిందుచుండు దుస్తులు పనిచేయుటకుఁ బనికిరాక త్వరగా చినిఁగిపాడైపోవును. పశ్చిమదేశములలో ఇట్టి విషయములందు నాగరకతాసంప్రదాయమను నొకటి గలదు. నాగరకతావిలాసము వారికి దుస్తులలో నున్నది. మనకు నగలలో నున్నది. అదిప్పుడిప్పుడు బట్టలలోనికిఁగూడఁ గొంచెము ప్రాకుచున్నది. క్రొత్తక్రొత్తరకముల దుస్తులు బయలుదేఱఁదీయుటకు పారిసు లండనులు ముఖ్యస్థానములు; మొదటిది స్త్రీల దుస్తులలోను రెండవది పురుషుల దుస్తులలోను వింత వింతమార్పులు గావించును. పారిసులోని నటీబృందము తఱచు ఈ క్రొత్తక్రొత్తమార్గములు చూపును; శృంగారస్త్రీపురుషు లత్యభిలాషతో వాని నవలంబింతురు. ఇప్పుడిప్పుడు నున్న కొట్లు దర్జీసంఘముల వారిపద్ధతులకు మూలకారకు లగుచున్నారు. పశ్చిమఖండవాసులు ప్రతిసంవత్సరము దుస్తులకై యెన్నిలక్షలపౌండ్లు వ్యయముచేయుచున్నారో మనము తెలిసికొనఁజాలము. దుస్తులు తయారుచేయు వ్యాపారము ప్రత్యేకముపక కళయైనది—ఏరంగుబట్ట, యేశరీరశిరోజచ్ఛాయలుగలవారమునకు, సరిపడునో—శరీర మందేభాగము మఱుఁగుపఱచి యేయవయవములు వెలిపుచ్చిన నందముగా నుండునో-యిట్టి ముఖ్యవిషయములు దుస్తులుచేయువారు కడుశ్రద్ధతో ఆలోచించుకొనవలెను. అదిగాక ఉన్నతపదములో నుండు స్త్రీలు ధరించు దుస్తులు క్రిందివారుకూడ వేసికొనవలెను, అట్లు చేయనియెడల, వారిని వెలివేయఁబడినవారినిగాఁ బరిగణింతురు. ఇది వారివస్త్రధారణసంప్రదాయము!! ఈసంప్రదాయములు దినదినము మాఱుచుండునని చెప్పినఁ జెప్పవచ్చును; ఋతుఋతువునకు సంవత్సరమునకు నాలుగుసారులు మాఱుచుండుననుట నిర్వివాదాంశము; అంతకంటె నెక్కువగాఁగూడమాఱు

చుందురు. భాగ్యవంతులు తమదుస్తులను సరిక్రొత్త పద్ధతిననుసరించి ని పుణులగు దర్జీలచేతఁ గట్టించుకొందురు; మధ్యసంసారస్థితిలోనుండువారు ఇంటిదగ్గఱ ఆఁడుదర్జీలచేతనైనఁ గుట్టించుకొందురు; స్వయముగనైనఁ గుట్టుకొందురు; క్రొత్తపద్ధతి తత్పూర్వపుపద్ధతికి దాదాపుగా నున్న యెడల, పాతదుస్తులలోఁగావలయుమార్పులు చేసికొని వానిని ధరింతురు, అట్లు లేనియెడలఁ గ్రొత్తదుస్తులనే కొందురు. ధనవంతులు తాత్కాలికసంప్రదాయానుసారముగా లేని దుస్తులను తమ నూశ్రితులకును సేవకులకును ఇచ్చివైతురు; గొప్పయిండ్లలోని దాసదాసీజనము ఆ విసర్జించిన బట్టలను అమ్మివేయును; అ యమ్మివేసిన దుస్తులను యూరప్పుదేశస్థులు, ఆఫ్రికా ఏషియా ఆస్ట్రేలియామున్నగు పరదేశములకు పలసపోయి క్రొత్తగా సటనేర్పఱచుకొన్న వాసస్థానములకు ఎగుమతి చేయఁగా, అక్కడివారు నాటిని వాని నుపయోగించుకొందురు. మహాధనికులగువారు వారిదుస్తులన్నిటిని పారిసుపట్టణమునుండి తెప్పించుకొందురు; అంతకంటెఁ దక్కువధనవంతులు వానినూదిరిగాఁ దమదేశములోనే వారిదుస్తులను దర్జీలచేత దయారుచేయించుకొందురు. దొరసానుల టోపీలుమాత్రము పారిసులో తయారుచేయించి తెప్పింపకతప్పదు. ఆంగ్లస్త్రీల దుస్తులును, జర్మనీస్త్రీల దుస్తులును అంత బాగుగా నుండవు; ఎవ్వరోకొందఱు గొప్పవారుతప్ప, సాధారణముగా వారు పారిసుపద్ధతుల ననుసరింపరు. కావుననే పరదేశీయులు వారిని పరిహాసము చేయుదురు ఆంగ్లపురుషులలో పెక్కురు మంచి దుస్తులు వేసికొందురు. అమెరికా స్త్రీపురుషులందఱు, వారువీరను భేదములేకుండ, నీటుగాదుస్తులు వేసికొందురు. విదేశవస్తుబహిష్కారముకై అమెరికా పరిపాలకులు లండను పారిసులనుండి వచ్చు దుస్తులమీఁదఎక్కువ దిగుమతి పన్ను వేసినను, అచ్చటి స్త్రీలు పారిసునుండియును, పురుషులు లండను నుండియును, తమ దుస్తులు తెప్పించుకొందురు,

వేలకొలఁది స్త్రీపురుషులు ప్రతిదినము నానావిధవర్ణములైన ఉన్నిబట్టలును పట్టుబట్టలనుబజాములలోనికిఁ దీసికొనివత్తురు. వేలకొలఁది జనులు ఆ తెచ్చినబట్టలతో వివిధములగుదుస్తులు తయారుచేయుచుం

దురు. అచ్చు నవీనపద్ధతిగాఁ జేసిన దుస్తులు ధరింపకుండ గొప్ప స్త్రీలును గొప్ప పురుషులును వీథులలో నడచిపోయినచో వస్త్రమర్యాదా విచారదులగు శృంగారపురుషులు వారినివింతగాఁజూచి వెక్కిరింతమాటలాడుకొందురు. ఈ వస్త్రమర్యాదా బాధలు మన కేమియు లేవుగాని, దానికిమాఱు ఆభరణమర్యాదా నాగరకతలు కొంతవఱకున్నవి. ఆ దేశములలో పట్టుబట్టలు ఉన్నిబట్టలు మున్నగు సరకులమ్ముకొనువర్తకులు, సాగసు లెట్లెట్లు మాఱుచున్నవో, వేనివేనికిఁ బ్రజలిప్పుడిష్టపడుచున్నారో కనుఁగొనుటకు బహుజాగరూకులై పరికించుచుందురు; వారేయొకప్పుడు స్వబుద్ధినుపయోగించి క్రొత్తసాగసుపద్ధతిని కనిపట్టి దానిపైకిఁ బ్రజాచిత్తముల నాకర్షించుటకుఁ బ్రయత్నింతురు. వర్తకుఁడు తాను క్రొత్తగా బజారులోనికిఁ దీసికొనివచ్చిన రకముపైకి ఒక్కసారి ప్రజలదృష్టి ప్రసరించునట్లు చేసికొనినచో, వాఁడు యావజ్జీవము కుబేరుఁడైనాఁడన్నమాటయే. ఫ్రాన్సుదేశచక్రవర్తియగు మూఁడవ నెపోలియను భార్య, "అ జే నీ" చక్రవర్తినిగారు తత్కాలపాశ్చాత్యవస్త్రసంప్రదాయావతారమని యెన్నికగన్నవారు. కాశ్మీరపుసాలువులన్న నామెకెంతో యిష్టము, కనుక ఆమె కాలములో కాశ్మీరదేశమునుండి యూరప్పుఖండమునకుఁ బ్రతిసంవత్సరము అనేకలక్షల రూపాయల విలువగల సాలువులు ఎగుమతి చేసెడివారు. మూఁడవ నెపోలియనుగారు పడిపోవుటతోడనే, కాశ్మీరపుసాలువులమీఁద మోజుపోవుటచేత వాని అమ్మకమును పోయినది. మనదేశపు వర్తకులెప్పుడు ప్రాచీనమార్గములనే పట్టిపోదురు. పాశ్చాత్యపరిస్థితులు మాఱుటతోడనే అప్పటివారికిఁ జిత్తరంజకమగు నేదోయొక క్రొత్తరకము స్వబుద్ధి యుపయోగించి సమయోచితముగా మనవర్తకులు కల్పింపలేకపోవుటచే, యూరప్పు వర్తకపు లాభమంతయు వారు గోల్పోయినారు. ఆదెబ్బతో కాశ్మీరదేశములోని గొప్పవర్తకు లందఱు ఆకస్మికముగాఁ బడిపోయినారు. చూచుటకుఁ గన్నులున్న యెడల ఈప్రపంచము నిది, లేని యెడల నాది; ఒకరికొకరు కనుపెట్టుకొని యుందురనుకొనుచున్నావా? లోకములోని వివిధదేశములవారి కనుకూలమగు భోగపదా

ర్థములందుఁ గ్రొత్తక్రొత్త మార్గములు కనిపెట్టి పాశ్చాత్యులు బాగుపడుచున్నారు. పరిస్థితులు పదికన్నులతోఁ బరికించి వారు రెండువందలచేతులతోఁ బనిచేయుచున్నారని చెప్పవచ్చును. ఇఁక మనము శాస్త్రకర్తలు గ్రంథములలో వ్రాయని పనులేమియుఁ జేయము. ప్రాఁతపుంతలలోనే ప్రాఁకులాడుచుఁ గ్రొత్తవి కనిపట్టుటకుఁ బ్రయత్నమైనఁ జేయము—క్రొత్తవస్తువులుగల్పించు ఉపజ్ఞాశక్తి పోవుటయే మనకిప్పుడు దానివలన వచ్చినలాభము. మన దేశీయులందఱును అన్నమో రామచంద్రా! యని ఆకాశము పగులునట్లు ఆర్తధ్వనులు చేయుచున్నారు, పస్తులచేఁ బ్రాణములు విడుచుచున్నారు. ఎవరిదితప్పు? మనది. ఈదుస్స్థితినుండి విముక్తులమగుటకు మనమేమి ప్రతిక్రియలు చేయుచున్నాము? ఏమియు లేదు. శుష్కోపన్యాసములు, పెద్దపెద్ద మాటలు—ఈ సందడితప్ప మనమేమియుఁ జేయుచుండుట లేదు. మూలమూలలనుండక యీవలికివచ్చి ప్రపంచాభివృద్ధి యెట్లగుచున్నదో కన్నులు తెఱచి న్యాయముగా నేలకనుఁగొనరు? అట్లుచేసినచో మీమనసు వికసించును, ఆలోచనశక్తియు సమయోచితక్రియాపాటవమును వానియంతట నవియేవచ్చును. దేవాసురయుద్ధవృత్తాంతము మీకు బాగుగాఁ దెలిసియేయున్నఁకదా! ఆత్మ, పరమాత్మ, ఉత్తరగతి—వీనిలో దేవతలకు నమ్మకముండెను. అసురులు ఇహజీవనముకుఁ బ్రాధాన్యమిచ్చి, కేవలశరీరసుఖములును ఐహికభోగములును సాధ్యమైనంతవఱకనుభవించుటకు యావత్ప్రయత్నములు చేసినారు. దేవతలు మంచివారా అసురులు మంచివారా యని యిటఁ దర్కించుట మన పనికాదు. పురాణములలోని వర్ణనలఁబట్టి, నిజమాడఁ దలఁచుకొనునెడల, అసురులు దేవతలకంటె ఎక్కువ పౌరుషవంతులనియును అసురులకంటె దేవత లనేకవిషయములందు తక్కువవారనియును చెప్పక తప్పదు. ప్రకృష్టమతారతమ్యములను యథార్థముగా గ్రహించుటకై హిందువులు దేవసంతతివారనియు, పాశ్చాత్యులు అసురసంతతివారనియుఁ జెప్పుటకంటె యుక్తమైన మార్గాంతరము లేదు.

దేహాశుచిత్వవిషయమున నుభయుల యభిప్రాయము లెట్లున్న

వో మొదటఁ జాతము. పరిశుద్ధి—చిత్తపరిశుద్ధి, శరీరపరిశుద్ధి, యని ద్వివిధము; రెండవది జలాదులచేఁ గలుగును. హిందువులు నీరు యథేచ్ఛముగా వాడుకొందురు; వారిదేహములంత శుచిగాఁ బ్రపంచములోని మఱియొకజాతి వారి దేహములుండవు. ఎక్కడనో కాని, యితర జాతులలో మునిఁగిచేయు సంపూర్ణస్నానములు అరుదు. హిందుదేశస్థుల పరిచయము కలిగినపిమ్మట ఆంగ్లేయులు అట్టిస్నానములు వారిదేశములోఁ బ్రారంభించినారు. ఇప్పుడైనను పూర్ణస్నానమునకుఁ గావలయునేర్పాటులు ఆదేశములో నెంతతక్కువగా నుండునో, చదువుకై వెళ్లి యటనివసించిన మనదేశపు విద్యార్థులనడిగి తెలిసికొన వచ్చును. వారమునకొకసారి పాశ్చాత్యులు స్నానముచేయుదురు; అప్పుడే లోపలివస్త్రులను మార్చుకొందురు; కాని యిప్పుడిప్పుడు ధనవంతులలో ననేకులు దినదినము స్నానముచేయుచున్నారు; అమెరికాలో అట్టి వారెక్కువగా నున్నారు; జర్మనులును ఫ్రెంచివారును తక్కిన వారును ఎప్పుడో కాని స్నానమే చేయరు. స్పెయినుదేశము ఇటలీదేశము ఉష్ణదేశములు; అయినను స్నానమట మఱియును తక్కువ. వెల్లుల్లి తెగఁదినుచు, పగలురాత్రియు చెమ్మటలు తెగఁగార్చుచు స్నానము లేకున్న వారెట్లుందురో మీరేయూహించుకొనుఁడు! పిశాచములైనను దగ్గఱ నిలువలేక పాఱిపోవలసి యున్నప్పుడు, మనుష్యుల మాట చెప్పవలయునా ?

పశ్చిమదేశములలో స్నానమననేమి? పైకిఁగనఁబడుభాగములు—ముఖము, తల, చేతులు—కడుగుకొనుట. పారిసుపట్టణమునకురమ్మని కోటీశ్వరుఁడగు స్నేహితుఁడొకప్పుడు నన్నుపిలిచినాఁడు. పారిసుఅనఁగనేమో తెలియునా? నవీననాగరతకు ముఖ్యస్థానము, సమస్తైహికభోగశృంగారవిలాసముల కునికిపట్టైనస్వర్గలోకము, సమస్తకళలకు సమస్తశాస్త్రములకును నెలవు. పెద్ద దివ్యభవనమువలెయుండు నొకపూటకూళ్ళయింటిలో నామిత్రుఁడు నన్నుఁబ్రవేశపెట్టి నాకు రాజభోజనము పెట్టు నేర్పాటులుచేసినాఁడు; కానిస్నానమునకుపాయమేమియు లేదు. ఏమిచేయుదును? రెండురోజులు నోరుమూసికొని యాబాధ భరించి

నాను; ఇఁక సహింపలేక—సోదరా! నీరాజోపచారము లేమియు నా కక్కఱలేదు, ప్రాణములతో నెట్లాగు పైని బడుదునాయని చూచుచున్నాను, ఈయెండకాలమేమి? స్నానముచేయుటకు సాధనము లేకపోవుటయేమి? ఈరీతిగానున్నచో మతిచెడి వెఱ్ఱిపుక్కనగుదునేమోయని భయపడుచున్నాను—అని నామిత్త్రునితోఁ జెప్పవలసివచ్చినది. అతఁడు నామాటలువిని విచారించి పూఁటకూటివారిమీఁదఁ గోపపడి—నిన్నిఁక నిటనుండనీయను, మఱియొక మంచిచోటికిఁ దీసికొనిపోయెదను—అని చెప్పెను. ఆపట్టణములోఁ బ్రశస్తములని ప్రసిద్ధిపడసిన పండ్రెండాహారాగారములు (హాటెళ్ళు) చూచినాము, కాని యందొకదానిలోను స్నానముకై నీళ్ళవసతి లేకపోయెను. స్నానాగారములు ప్రత్యేకముగానున్నవి, నాలుగైదురూపాయలిచ్చి అక్కడ స్నానము చేయవచ్చును. స్నానమాడుటకు నీళ్ళతొట్టెలోఁ జొచ్చినవెంటనే యొకముసలమ్మ చచ్చిపోయినదని శివశివా! ఆ సాయంకాలముననే యొక వార్తాపత్త్రికలోఁ జదివినాను! వైద్యులేమేమో కారణములు చెప్పవచ్చునుగాని, ఆమె జీవితములో నంత నీరామెదేహము తాఁకుటకదే తొలిసారి కావచ్చును, అందుచే ఆకస్మికమైన ఆయదురున తాఁగలేక యామె మరణించియుండవచ్చును—అని నాయభిప్రాయము. ఇందతిశయోక్తి యేమియులేదు. ఈవిషయమున రష్యాదేశస్థులును మఱికొందఱును మిక్కిలి రోఁతగానుందురు. టిబెట్టు దగ్గఱనుండి యావైపు దేశములన్నిటిలోను ప్రజలిట్లేయుందురు. అమెరికాలోని యన్నిపూఁటకూళ్ళ యిండ్లలోను ప్రత్యేకముగా స్నానముచేయు గదులును గొట్టములనుండివచ్చు నీటివసతులును ఉండును.

స్నానములో మనకు వారికి నుండు భేదము చూడుఁడు. పాపభీతిచే మనహిందువులు స్నానముచేయుదురు, పరిశుభ్రతకై పాశ్చాత్యులుముఖమును చేతులును కడుగుకొందురు. మనలో స్నానమనఁగా ఊరకే యొడలిపైనీరు కుమ్మరించుకొనుట, శరీరముపైనున్న చమురును ముఱికియుపోక అట్టుననే యుండవచ్చును. మనదక్షిణహిందూస్థానపు సోదరులు పెద్దపెద్దబొట్లును పట్టెవర్ధనములును బెట్టుకొందురు, ఇటిక

ములు; కానిభోజనకాలమందు జేబురుమాలులో ముక్కుచీదుకొనుట తప్పుగా నెంచుకొనరు. అది మనకెంతో అసహ్యముగా నుండును. వారిదేశములవంటి శీతలదేశములో అప్పుడప్పు డట్లు చేయక తప్పదు.

ముటికియన్న హిందువులకెంతో రోఁత, అయినను మనముతచు ముటికిపనులే చేయుచుందుము. ముటికిముట్టుకొనిన స్నానముచేయవలెనుగనుక, అట్లుచేయకుండుటకు ఆపదార్థములను ఇంటిదగ్గఱ యొకచోటఁ బోగుచేసి కుళ్ళఁబెట్టుదుము; వానిని అంటకుండుటయే మనకుఁగావలసినది, కాని కేవలనరకములో వసించుచున్నామని యెప్పుడైన అనుకొనుచున్నామా? ఒక అశుభ్రతఁ దొలఁగించు కొనుటకు, ఒక చెడుగునుండి తప్పించుకొనుటకు, అంతకంటె నెక్కువ రోఁతయు కీడునుగలిగించు పనులుచేయుచున్నాము. ఇంటిలో నికృష్టమలినపదార్థములు పెట్టుకొనుట యెంతయుఁబాపము, దానికేమియు సందేహములేదు. ఆపాపఫల మనుభవించుటకు ఇంకొకజన్మముకై కనుపెట్టుకొనియుండనక్కఱలేదు, ఇక్కడనే యీజన్మములోనే యది కట్టికుడుపుచున్నది.

లక్ష్మీసరస్వతుల కరుణాకటాక్షము ఇప్పుడు పాశ్చాత్యులపై పరిపూర్ణముగాఁ బ్రసరించుచున్నది. భోగ్యపదార్థములు సంపాదించుకొని యంతటితో వారూరకుండరు, సమస్తకృత్యములలోను ఒకరీతి సొగసును నాజూకుఁదనమును ఉండునట్లు చూచుకొందురు. ఇండ్లలోను బైటను అన్నపానాదు లన్నిటిలోను లాలిత్యలక్షణము లుండునట్లు చూతురు. దేశము ధనసంపన్నమై యున్నప్పుడట్టి లక్షణములు మనకును ఉండెడివి; మనమిప్పుడతి దరిద్రతాదశలో నున్నాము; దానికిఁ దోడుగా స్వనాశమును రెండువిధములుగా సమకూర్చు కొనుచున్నాము — మనసంప్రదాయములను పరిత్యజించుచున్నాము, పరదేశీయ సంప్రదాయములను స్వీకరించుకొనుటకు పడరానిపాట్లుపడుచు విఫలమనోరథులమగుచున్నాము. ఉత్తమమైన మనజాతీయధర్మములు క్రమముగా ఉడిగిపోవుచున్నవి, వానికిబదులుగాఁ బాశ్చాత్యధర్మములైన నింకను అలపడుట లేదు! గమనాశనసంభాషణాదులలో పరంప

రాగత ప్రాచీనలక్షణములన్నియుఁ జటాపంచలైపోయినవి, వానికిమాఱుగాఁ పాశ్చాత్యమర్యాద లవలంబించుటకు సమర్థులముగాకున్నాము. పోఁగా మనకుమిగిలిన పూర్వకాలపు టగ్నిహోత్రియజ్ఞయాగాదికర్మకాండమును అధ్యయనమును అబ్ధిలోఁబడవేయుచున్నాము, ఆలోటు దీర్చుకొనుటకు, వానికిమాఱుగా అవసరమునుబట్టి గ్రహించిన నవీనాచారములింకను వేళ్ళుపాఱి స్థిరముగా నాటుకొనలేదు. ఈరెంటినడుమను ఊఁగులాడుచు మనము బాధపడుచున్నాము. భావివంగదేశమునకింకను స్థిరమైనయాధారము కుదురలేదు. అన్నిటికంటె నధమగతిలోనున్నవి మనకళలు. పూర్వకాలములో మనస్త్రీలు నేలమీఁదను, ఇండ్లగోడలమీఁదను, తలుపులమీఁదను, నీళ్లుగలిపిన బియ్యపుముగ్గుతో చిత్రచిత్రమైన ప్రతిమలు, నానావిధములుగా వేసెడువారు; అరఁటాకువిస్తళ్ళు చమత్కారముగా కత్తిరించెడువారు, పలువిధములైన భోజనపదార్థములు పాత్రములందు వింతవింతగా వడ్డించుటలో విశేష కళాకౌశలము గనఁబఱచెడువారు. ఈచిత్రకళలన్నియు క్రమక్రమముగా క్షీణించినవి, ఇంకను క్షీణించుచున్నవి.

క్రొత్తవి నేర్చుకొని ప్రవేశపెట్టి ఆచరణములోనికిఁ దేవలసినదే, కాని ప్రాఁతవియను కారణమున నట్టివన్నియుఁ దుడిచివేసి వానిస్థానమున నేవోక్రొత్తవి దూర్పఁదగునా? నీవు నేర్చుకొన్న నవీనాంశములేవి? మాటల గలిబిలితప్ప నేమియులేదు! నిజముగా ఉపయోగకరమైన క్రొత్తశాస్త్రముగాని క్రొత్తకళగాని మీరేమి సంపాదించినారు? ఇప్పటికిని పల్లెయూళ్ళలోఁ జేయుచుండుకట్టుపనియు ఇటికపనియు వెళ్లి చూడుఁడు. పట్టనములలోని వడ్రంగులకుఁ బ్రశస్తములైన తలుపులు చేయుటయైనను చేతఁగాదు. వారుచేసిన తలుపులు గుడిసెలకుపయోగించునో గొప్పమందిరములకుపయోగించునో తెలిసికొనుట కష్టముగానుండును. వారి వడ్రంగపు నైపుణ్యమంతయు విదేశపుపనిముట్లు కొనుటలోనే కనఁబడుచున్నది, అంతే! మనదేశీయవ్యాపారము లన్నిటిలోను కటకటా! అట్టిదుస్థితియే కాన్పించుచున్నది. స్వదేశకళలన్నియుఁ జచ్చిపోయినవి, వక్తృతావైశారద్యమొక్కటియే పరదేశీయులవలన

మనలకుఁ బట్టువడినది! పతనప్రలాపములు కావలసినన్ని! పదరుఁబోతుతనములోను వాదప్రతివాదములలోను అల్ల ఐర్లెండు దేశస్థులును మనవంగదేశస్థులును ఒక్కమచ్చుగానున్నారు. ఈ రెండుజాతులవారును వాచాటత్వములో మహానిపుణులు, ప్రయోజనకరమైనపని గావలయుచోట నెక్కడను గానరారు; మీఁదు మిక్కిలి, వారియావజ్జీవము అంతఃకలహములలోను పరస్పర దూషణములతోను వృథాపఱుచుకొనుచున్నారు.

పాశ్చాత్యులు తమచుట్టునున్న ప్రతిపదార్థమును పరిశుభ్రముగా నుంచుకొందురు; కటికిదరిద్రుఁడుకూడ ఆవిషయమై కడుజాగ్రత్తగా నుండును; శుభ్రమైనదుస్తులు వేసికొనకున్నచో నెవనినికొలువులోనికిఁదీసికొనరు కావునఁ బ్రజలు శుచిగానుండకతప్పదు. నౌకరులుపరిచారికలు పాచకులు మొదలగువారు ఎక్కడను మఱకలేని పరిశుద్ధమైన దుస్తులు ధరింతురు, ప్రతిదినము తుడిచికడిగి, ధూళిదులిపి వారి యిండ్లనుచక్కఁగా నుంచుకొందురు. వస్తువులను వెదచల్లినట్లు అక్కడను ఇక్కడను పడవేయక యుక్తస్థలములందు పొందికగానమర్చిపెట్టుకొనుట మర్యాదాలక్షణములలో నొకటి. వారి పాకశాలలు శుభ్రముగా, చూచుట కింపుగానుండును—తఱిగిన పెచ్చులు పొట్టు మొదలగు పనికిమాలిన వస్తువులు అప్పటిమట్టున కొకతొట్టిలోఁబెట్టి వేఱుగానుంతురు; తరువాత ఊడ్చువాఁడువచ్చి వానిని దూరముగాఁ గొనిపోయి యందులకై నియమింపఁబడిన స్థలములోఁ బాఱవేయును. అట్టి పెంటను వారు పెరళ్ళలోఁగాని వీథులలోఁగాని పడవేయరు.

భాగ్యవంతుల మందిరములను రాత్రియైననుసరే, పగలైనను సరే, యెక్కడనుండవలసిన వస్తువుల నక్కడనమర్చి కడిగిన ముత్తెములవలె పరిశుభ్రముగా నుంతురు; అవినిజముగాఁ జూడఁదగిన భవనములు. నానాదేశములనుండి తీసికొనివచ్చిన చిత్తరువులు మున్నగువానితో నందలిగదుల నలంకరించుకొందురు. ఇపుడు పరదేశశిల్పాలంకారసంగ్రహణము మనము చేయలేము, దానిమాట కేమి పోనిండు! మనకున్నవియైనను మంటఁగలసి పాడుగాకుండ సంరక్షించుకొనవలదా?

జెబురుమాలు పైకిఁదీసి దానిలోఁజుట్టఁజేఁది ఆచేతితోనే రొట్టెలపిండి మర్దించును ; వంటయింటిలోఁ జొరకముందు చేతులైనను కడుగుకొనక పచనకృత్యము ప్రారంభించును. అయిననేమి ? ధరించు దుస్తులును పెట్టుకొను టోపీయును కొబ్బరముక్కలవలె తెల్లఁగా నుండును. రొట్టెలకై గోధుమపిండి గట్టిగా మర్దనము చేయవలెను గనుక తన యావచ్ఛరీరభారముమోపి దానిమీఁద తాండవముకూడఁ జేయుచుండవచ్చును, లలాటముమీఁది స్వేదోదకము దానిలోఁబడినను అంత లక్ష్యము సేయకపోవచ్చును. (వారి యదృష్టమున అట్టిపనులు చేయుటకు ఇప్పుడు విపులముగా యంత్రములున్నవి గనుక ఆరోఁతలు పోవుచున్నవి.) ఇంతయుపవిత్రపుపనియుఁ గావించి రొట్టెలుతయారుచేసి, తెల్లని పింగాణిపళ్లెములోఁబెట్టి తెల్లనిరుమాలు పైఁగప్పి, వపుకరు స్వచ్ఛమైన దుస్తులుధరించి చంద్రికాధవళమైన చేజోడు దొడుగుకొని, తీసికొనిపోయి దానిని భోజనపుబల్లమీఁద పదిలముగా నమర్చును— వట్టివ్రేళ్లతో రొట్టె ముట్టుకొనఁగూడదనినుఁడీ ! సేవకుఁడు చేతులకు జోడు తొడుగుకొనుట !

ఇఁక మన పచనభోజనపద్ధతులు చూతుఁడు. మన వంటబ్రాహ్మణుఁడు మొట్టమొదట శుచిగా స్నానముచేసి, పరిశుభ్రముగాఁ కడిగినపాత్రములలో ఆహారపదార్థములు వండును ; అయిననేమి ? గోమయముతో నలికిన ఉత్త నేలమీఁద విస్తరివేసి దానిలో అవి వడ్డించును. ప్రతిదినము తడుపుచున్నప్పటికిని అతనిగుడ్డ ఎప్పుడు నీళ్లమొగమెఱుఁగనట్లు మురికిగా నుండును. గ్రహచారముచాలక, ఆ వేసిన అరఁటాకుచినిఁగినయెడల, వడ్డించిన చేరో, పులుసో, పేఁడతో అలికిన చెమ్మనేల రసముతోఁగలిసి విలక్షణమైన రుచినిచ్చును.

చక్కఁగా స్నానము చేసియు మనము చమురుతో అంటుకొనుచుండు పరమాసహ్యములగు బట్టలు వెంటనే కట్టుకొందుము— పాశ్చాత్యులు చక్కఁగా స్నానముచేయక, మురికియొడలమీఁద, ప్రశస్తమైన దుస్తులు తొడుగుకొందురు. ఈ విషయమున ప్రాక్పశ్చిమతారతమ్యము పూర్తిగాఁ దెలిసికొనవలెను. ప్రాచ్యుల అంతర్దృష్టి

ము, పాశ్చాత్యుల బహిర్దృష్టియు వారివారి యాచారవ్యవహారములన్నిటిలోను గానిపించుచున్నవి, హిందువులు లోచూపువారు, పాశ్చాత్యులు వెలిచూపువారు. హిందువు శ్రేష్ఠమైన వజ్రమును చింపిగుడ్డలోఁ గప్పిపెట్టును. పాశ్చాత్యుఁడు పనికిమాలిన మట్టిముద్దను స్వర్ణసంపుటములోఁ బెట్టి సంరక్షించును. శరీరశుద్ధికై హిందువు స్నానము చేయును, కట్టుకొనుగుడ్డ యెంతకలుషమైనదియైననుసరే! పాశ్చాత్యుఁడు పరిశుభ్రమైన వస్త్రములు ధరించును లోపలి శరీరముపై నెంత మురికియున్నను సరే! ఇంటిలో నుండుగదులు, తలుపులు, నేల, మున్నగునవి హిందువు స్వచ్ఛముగా నిర్మలముగా నుంచుకొనును. వాకిటి యూకల ఎట్టి పెంటపోగులున్నను సరే! పాశ్చాత్యుఁడు తన యింటి యెదురింతయుఁ గాంతిమంతములై కనుమనోహరములైన చిత్రాసనములతో నొప్పును. పైకిఁ గనబడకున్నచో వానిక్రింద నెంత దుమ్ము మురికియున్నను సరే! ఎంత కంపుగొట్టుచున్నను సరే! హిందువు తనయింటిలోని మురికికాలువ వీధిలోనికి విడిచిపెట్టును; పశ్చిమదేశములలో నట్టికాలువలు భూమియడుగుననుండి విషజ్వరములకు విడుదులౌను. హిందువు అంతశ్శుద్ధి చేసికొనును, పాశ్చాత్యుఁడు బాహ్యశుద్ధి చేసికొనును.

కావలసినదేమన — పరిశుద్ధవస్త్రములతో నుండు పరిశుద్ధమైన శరీరము, పుక్కిలించి యుమియుట. పండ్లు తోముకొనుట మున్నగునవి చేయవలసినవే. కాని యవి రహస్యముగాఁ జేసికొనవలెను. నివసించు గృహములు, వీధులు రచ్చలు ఇతర బాహ్యప్రదేశములుకూడ పరిశుభ్రముగా నుండవలసినదే. పాచకులు బట్టలు శరీరముకూడఁ బరిశుద్ధముగా నుంచుకొనవలెను. చక్కని శుభ్రమైనచోటఁ గూర్చుండి తెల్లఁగాఁ దోమిన కంచములలోనో పళ్ళెములలోనో భోజనము చేయువలెను. ఆచారము మతమునకుఁ బ్రథమసోపానము, సరే కాని మన శ్శరీరములయొక్కయు గృహాదులయొక్కయు పరిశుద్ధి ఆయాచారమున కాయువుపట్టు: ఆచారవిరహితున కెప్పుడేని మతఫలము సిద్ధించునా? ఆచారవిహీనుల దురవస్థలు మనకుఁ బ్రత్యక్షముగాఁ గానిపించుటలేదా?

అనాచారశిక్ష యట్లనుభవించుచున్న మనము బుద్ధి తెచ్చుకొనఁ గూడదా ? విషూచి, విషజ్వరము, మహామారి, మున్నగునవి మనహిందు దేశములో నిల్లుకట్టుకొని కదలక కాఁపురము చేయుచున్నవే ! అది యెవరితప్పు ? తప్పక మనదే యీతప్పు—అయ్యో ! మన యాచార శూన్యులమైపోయినాము !

“ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః”—అను సుప్రసిద్ధ శ్రుతియొక్క సత్యమును హిందుమతమునందలి నానాశాఖలవారును ఒప్పుకొందురు. “ఆహారము పరిశుద్ధముగానున్న అంతఃకరణము స్వచ్ఛముగా నుండును. అంతకరణశుద్ధియున్న స్మృతి (ఆత్మ పరిపూర్ణుఁ డనుబుద్ధి) స్థిరముగా నుండును”—ఇది యాశ్రుతి కర్థము. శంకరాచార్యులవారు ఆహారమనఁగా ఇంద్రియములని యర్థముచేసినారు. రామానుజాచార్యులవారు ఆహారమనఁగా అన్నమనియే తీసికొన్నారు. ఈరెండిట్లు విదును ? ఉభయములును ఆవశ్యకములని అందఱుహిందువులును ఒప్పుకొనుచున్నారు, కనుక రెండును గణనీయములే. పరిశుభ్రమైన యాహారములేకుండ ఇంద్రియములు వానివాని కృత్యము లెట్లు చక్కఁగా నెఱవేర్పఁగలవు ? కలుషాహారము ఇంద్రియముల గ్రహణశక్తిని దుర్బలమైనఁ జేయును, లేదా మన యిచ్ఛకు వ్యతిరేకముగా వానిని ప్రవర్తించునట్లైనఁ జేయును—అను సంగతి యందఱకు స్వానుభవమువలన స్పష్టమే. అజీర్ణము, వస్తుస్పృష్టి వికృతముచేసి, యొక పదార్థమును మఱియొక పదార్థముగాఁ గోచరింపఁ జేయుననియు ఆహారాభావము (నిప్పస్తు) నేత్రాదీంద్రియపాటవమును బోఁగొట్టి మాంద్యమును గలిగించుననియు అందఱెఱిగిన విషయమే. ఆరీతిగనే యొక్కొక్క యాహారపదార్థము మనశ్శరీరముల కొక్కొక్క విలక్షణమైన స్థితిని గలిగించును. ఇది తినవచ్చును, ఇది తినఁగూడదు—అని హిందువులకుఁ గఠినమైన యాహారనియమములను విధించువివిధవిధినిషేధసూత్రముల కిదియే మూలాధారమైన హేతువు; కాని పెక్కుచోట్ల అత్యావశ్యకమైన యీ అంతస్సారము మాటమఱచిపోయి పై

పెంకును ప్రధానము చేసికొని దానికోసము తగని యభినివేశముతో తగాదాలు పడుచున్నాము.

రామానుజ మతప్రకారము ఆహారమును అపవిత్రము చేయు దోషములు మూఁడు. అందు మొదటిది జాతిదోషము — అనఁగా పదార్థముల జాతిచేతనే, స్వభావముచేతనే, కొన్ని దూష్యములగును; నీరుల్లి, వెల్లుల్లి యున్నగునవి, తినినచో యింద్రియోద్రేకము కలిగించి, చిత్తస్థైర్యమును చెడఁగొట్టి బుద్ధిని పాడుచేయును. రెండవది ఆశ్రయదోషము — అన్నమిడువాని స్వభావమందలి దోషము. దుష్టుఁడు పెట్టిన యన్నము తినినవాఁడు తానును దుష్టుఁడై దుష్టచింతల పాలౌను; సత్పురుషుని యన్నము తినువానికి ఉదారభావములు కలుగును. ఇఁక మూఁడవది నిమిత్తదోషము. ఇది యాహారములో ధూళి, మట్టి, పురుగులు, వెండ్రుకలు, మున్నగునవి కలియుటవలనఁగలుగును; ఇట్టిపదార్థములను భుజించిన వాని మనస్సుకూడ కలుషమై చెడిపోవును. ఈమూఁడిటిలోను జాతినిమిత్తదోషము లందఱును తొలఁగించుకొనవచ్చును, కాని యాశ్రయదోషనివారణ మందఱకు సులభముగాదు. ఈదోషము తప్పించుకొనుటకే యీరోజులలో అస్పృశ్యత (అంటరానితనము) అంత ప్రబలముగా వ్యాపించినది. ఈవిషయమున సాధారణముగా (గుఱ్ఱముముందు బండిపెట్టి) ప్రజలు వ్యత్యస్తముగా నడచుకొనుచున్నారు. ఆహారనియమముల కాధారభూతమైన యథార్థకారణమును తిన్నగా గ్రహింపక పోవుటచే కాలక్రమమున అట్టి సదాచారములు పరిహాసాస్పదమును వికృతమును అగు మూఢాచారములుగాఁ బరిణమించును. ఇట్టి విషయములలో మతబోధకులగు మహాచార్యుల యాచారములే యాచరణీయములు గాని (జనసామాన్యమాచరించు) లోకాచారములు గావు. శ్రీచైతన్యదేవుఁడు మున్నగు మహా మతబోధకుల జీవచరిత్రలు చదివి వారిట్టియంశములలో [illegible]డిజనులతో నెట్లు ప్రవర్తించిరో చూడవలెను. జాతిదోషమును పరిశీలించి యాహార[illegible]ను గొనుటలో హిందుదేశముకంటె మంచిదేశము లేదు. అన్నిజాతులలోను హిందుజాతి వారు స్వచ్ఛతమమైన యాహారమును భుజింతురు;

ఆహారమునందు జాతినైర్మలనియమముల ననుష్ఠించుటలో హిందూదేశమువంటి దేశము మఱియొకటి లేదు. నిమిత్తదోషములు మిక్కిలి బాధాజనకము లగుచున్నవి కాన, ప్రస్తుతకాలములో మనము వానింగూర్చి కొంచెమెక్కువ జాగరూకులమై యుండవలెను. బజారులో మిఠాయి దుకాణమునుండి ఆహారపదార్థములు కొని తినుట యిప్పుడు సర్వసామాన్యకృత్యమైనది ; నిమిత్తదోషదృష్టిని ఆ పదార్థము లెంత యపరిశుద్ధములును అపవిత్రములునో మీ రాయంతట మీరే తెలిసికొనవచ్చును—బట్టబయలుగాఁ బెట్టి యుంచుటచేత ముఱికి, రోడ్డుధూళి, వానిమీఁదఁబడి చచ్చిన పురుగులంటుకొని యవి చెడి పాసిపోయి యెక్కొకప్పు డెంత యసహ్యముగాను అపవిత్రముగాను ఉండునో యించుక యాలోచింపుఁడు. ప్రతి గృహమందుఁ గానఁబడు అజీర్ణరోగమును, ఇప్పుడు పట్టణ నివాసులను బాధించుచు అతివ్యాప్తమై యున్న అతిమూత్రశర్కరామూత్రములును బజారులోనికలుష పదార్థములను దినుటవలననే కలుగుచున్నవి. పల్లెలలోని వారికి సాధారణముగా ఆ జబ్బులు లేకపోవుటకు ముఖ్య కారణము, పాడుమిఠాయి మున్నగునిష భక్ష్యములు కొనుటకువీలైన బజారులు ప్రాంతమందు లేకుండుటయే. ముం దీవిషయమునుగూర్చి వివరముగాఁ జెప్పెదను.

ఇది మన పూర్వులు ఆహారమునుగూర్చి విధించిన సామాన్యవిధి, కాని తద్విషయమునఁ బూర్వమును ఇప్పుడునుగూడ భిన్నాభిప్రాయముల నేకములున్నవి మాంసాహారము మంచిదా కూరగాయలు భుజించుట మంచిదా, మాంసభక్షణమువలన మేలుకలుగునా కీడు కలుగునా, యనువివాదము అప్పుడు ఇప్పుడుకూడ విశేషముగానున్నది. అదిగాక, జంతుహింస చేయవచ్చునా చేయఁగూడదా యను విషయమెప్పుడును పెద్దవివాదకారణమై యున్నది. ప్రాణిహింస పాపము ; ఎప్పుడును అది చేయఁగూడదు—అని యొక పక్షమువారు చెప్పుదురు. ఆమాట పట్టిపనికిమాలినమాట, జీవహింస చేయకుండ జీవించుట కేవల మసాధ్యము—అని రెండవ పక్షమువారు ప్రత్యుత్తరమిత్తురు. శాస్త్రములుకూడ ఈవిషయమున భిన్నాభిప్రాయములై యుఁడనుకల

వరపెట్టుచున్నవి. శాస్త్రము—యజ్ఞములందు పశుహింస చేయుము అని యొకచోట శాసించుచున్నది. అదియే స్థలాంతరమున—జీవహింస చేయకుము—అని చెప్పుచున్నది. యజ్ఞములలోఁదక్క జంతువుల ను చంపుట పాపమని హిందువు లనుకొనుచున్నారు; కాని యజ్ఞమం దు పశుమారణమైనపిమ్మట దానిమాంసమును యథేచ్ఛముగాఁ దిని సుఖింపవచ్చును. ఇంతయేల ? శ్రాద్ధాద్యవసరములందు గృహస్థుఁడు పశుహింస చేయవలయునని కొన్నివిధులున్నవి; అసమయము లందట్లు చేయనివాఁడు పాతకియు నింద్యుఁడును అగుచున్నాఁడు. (శ్రాద్ధాదికర్మ ములం దాహూతుఁడైనవాఁడు తత్కాలదత్తమైన మాంసము భుజింపనిచో, తరువాతిజన్మమున పశువై పుట్టునని మనువు చెప్పుచున్నాఁడు.) "అట్టి శాస్త్రవిధులను మేము విశ్వసింపము. ప్రాణిహింస యెప్పుడును పాపమే, యెన్నఁడును అట్టిపని సేయఁగూడదు." అనిదానికి వ్యతిరేక ముగా జైనులు, బౌద్ధులు, వైష్ణవులు చెప్పుదురు, బౌద్ధచక్రవర్తియగు అశోకుఁడు యజ్ఞములు చేసినవారిని, ఏకర్మమునకైనను పిలిచి మాం సము పెట్టినవారిని, దండించినట్లు గ్రంథములందున్నది. వైష్ణవుల వా దస్థితి యించుక కష్టముగాఁ గానిపించుచున్నది రామకృష్ణులను వారు భగవద్బుద్ధిఁ బూజింతురు. వారుభయులునుమాంసభక్షణము మద్య పానము చేసినట్లు భారతరామాయణములందు ప్రమాణములు గలవు. సీతాదేవి, మాంసము, అన్నము, వేయికుండల మద్యము గంగానది కిచ్చెదనని మ్రొక్కుకొన్నట్లు పుస్తకమునందున్నది.

సీతామాదాయ బాహుభ్యాం మధుమైరేయకంశుచి ।
పాయయామాస కాకుత్స్థః శచీమింద్రోయథామృతం॥
మాంసానిచసుమృష్టాని వివిధాని ఫలానిచ ।
రామస్యాభ్యవహారార్థం కింకరాస్తూర్ణమాహరన్॥

తా॥ ఇంద్రుఁడు శచిచే నమృతము గ్రోలించినట్లు రాముఁడు సీతను కౌఁగిలించుకొని మైరేయకమను మంచి మద్యమును ఆమెచేఁ ద్రాగించెను.

తా॥ చక్కఁగా పక్వముచేసిన మాంసమును, నానావిధములైన పండ్లను రామునకు సేవకులం దర్పించిరి.

సురాఘట సహస్రేణ మాంసభూతౌదనేనచ।
యక్ష్యేత్వాం ప్రీయతాం దేవిపురీంపునరుపాగతా॥

తా॥ గంగాదేవీ! మమ్ము ననుగ్రహింపుము. నేనింటికి మరల వచ్చినతరువాత, నీకు వేయికుండల సురయును, మాంసముతో వండిన యన్నమును సమర్పించి నిన్నుఁ బూజించెదను, (రామాయణము,)

ఉభౌమధ్వాసవక్షీబౌ ఉభౌచందన రూషితౌ।
స్రగ్విణౌ వరవస్త్రౌతౌ దివ్యాభరణ భూషితౌ॥

తా॥ (కృష్ణార్జునులను నేఁ జూచినాను. ఉభయులును మధ్వాసవముచే (తేనెతోఁ జేసిన తియ్యని మద్యముచే) మత్తిల్లియున్నారు, ఉభయులును గంధము పూసికొనియున్నారు, ఉభయులు పుష్పమాలలును, చక్కని వస్త్రములను, దివ్యమైన నగలను ధరించియున్నారు, (మహాభార-ఉద్యో-58-5)

మాంసాహారము ఆరోగ్యభంగకరమా కాదా, అదికూరగాయలకంటె బలకరమైన ఆహారమా కాదా—ఇట్టివాదములు పాశ్చాత్యులలో జరుగుచున్నవి. మాంసాహారులు నానావిధములైన శరీర రోగములతో బాధపడుదురని యొక కక్షవారందురు. అవన్నియు చిట్టి మాటలు; అవేనిజమైనయెడల, హిందువులందఱికంటె ఎక్కువ ఆరోగ్యవంతులుగా నుండవలసినది, బలశాలులై మాంసమే ముఖ్యాహారముగాఁగల ఆంగ్లేయులును అమెరికావారును మఱికొందరును వివిధశరీరవ్యాధుల బారిఁబడి యీపాటికిఅంతరించియుండవలెను—అని యెదుటికక్ష వారందురు. మేకమాంసముదినువారిబుద్ధి మేకబుద్ధివలెనగును, పందిమాంసము తినువారిబుద్ధిపందిబుద్ధిగా మాఱిపోవును, చేఁపమాంసము చేపబుద్ధి నిచ్చును—అనివారందురు. బంగాళాదుంపలు మున్నగు కాయగూరలు తినువారిబుద్ధి ఆ యచేతనపదార్థముల బుద్ధివంటిబుద్ధియే యగునని వాదింపవచ్చును; అప్రాణిపదార్థముల మొద్దుబుద్ధి సంపాదించుకొనుటకంటె సజీవజంతువులబుద్ధి సంపాదించుకొనుట మంచిదికాదా?—అని వీరందురు. కూరగాయలలో నుండు భూతపదార్థములే మాంసాహారములోను ఉన్నవి—అని వారనుచున్నారు. ఔను! అవి గాలిలోఁగూడఁ నున్నవి, పిల్లి గాలితిని బ్రతుకుఁ

డు—అని వీరు వారిని పరిహాసము చేయుచున్నారు. ధాన్యాదులు తిని బ్రతుకువారు బాగుగా పాటుపడి దీర్ఘశ్రమ కోర్వఁగలరు—అని వారనుచున్నారు. అట్లైన నట్టిజాతివారు అందఱిలో నగ్రగణ్యులుగా నుండవలసినదే! అట్లులేరే! బలవత్తమములును ప్రథమగణ్యములును అగు జాతులవారెల్లప్పుడును మాంసాహారులేయై యున్నారే!—అని వీరు వారి నధిక్షేపించుచున్నారు. హిందువులును చీనావారును ఎంత దీనులుగా నున్నారో చూడుఁడు? వారు మాంసము తినరు, వరియన్నము కూరగాయలు మున్నగు స్వల్పాహారముతో నెట్లో జీవయాత్ర చేయుచున్నారు, వారి దురవస్థ పరికింపుఁడు! జపాను దేశస్థులుకూడ మొనమొన్నటివఱకును అట్లే యుండిరి, కాని మాంసముదినుట యారంభించినదిమొదలుకొని విచిత్రముగా మాఱిపోయినారు. హిందూదేశపుసైన్యములో రమారమి లక్షమంది హైందవయుద్ధభటులున్నారు; వారిలో ఉద్భిజ్జాహారముతో ఉదరపోషణము చేసికొను వారెందఱున్నారో చెప్పుఁడు, అందు సిక్కులు ఘూర్ఖాలు మున్నగు శూరాగ్రేసరు లెప్పుడును కేవలము కూరగాయలు తిని బ్రతుకువారుగారు—అని మాంసాహారానుకూలపక్షమువారు వాదింతురు. మాంసాశనము వలన అజీర్ణరోగము పుట్టును—అని ప్రతిపక్షమువారు చెప్పుదురు. అదంతయు వ్యర్థప్రలాపము; గర్భకోశసంబంధమైన రోగములు కాయగూరలు తినువారికే యెక్కువగా వచ్చుచున్నవి. కాయగూరలు దినుటవలన కాలవిరేచనము బాగుగాఁ గావచ్చును; కాని యంతమాత్రమునఁ బ్రపంచమంతయును అట్టియాహారమే భుజింపవలయునని మీరెట్లు చెప్పఁగలరు?—అని యవ్వలిపక్షమువారు చెప్పుదురు.

వీరేమి చెప్పినను, వారేమి చెప్పినను, మాంసాశన జాతులవారెప్పుడును సాధారణముగా, మహాశూరులును, మహాసాహసులును వివేకవంతులును అయి యుందురు; ఇది యథార్థమైన మాట యజ్ఞహోమధూమము ఆకాశమునంటు రోజులలోను, హిందువులు యజ్ఞపశుమాంసము భుజించురోజులలోను,—ఆ కాలమునందే—మహాబుద్ధిశాలులును, మేధావులగు మతబోధకులును హిందూజాతిలోఁ బుట్టిరనియు,

నిస్సారమైన బైరాగి శాకాహారములోనికి దిగినతరువాత వారిలో ఉపజ్ఞానవంతుఁడగు గొప్ప వాఁడొక్కఁడును బయలుదేఱలేదనియు, మాంసము తినుజాతులవారు నొక్కి చెప్పుచున్నారు. ఈయభిప్రాయము పుచ్చుకొని, మన దేశములో మాంసము దినుట కలవాటుపడినవారు మాంసాహారమును వదలిపెట్టుటకు భయపడుచున్నారు. ఈ విషయమున ఆర్యసామాజికులలోఁగూడ భిన్నాభిప్రాయములును తీవ్రవాదములును ఉన్నవి. వారిలో కొందఱు మాంసాహార మత్యావశ్యక మనుచున్నారు. కొందఱది నీతివిరుద్ధమైన మహాదోషమని గర్హించుచున్నారు.

ఈవిధముగా వాదప్రతివాదములు జరిగించుచు, జగడమాడుచు, నొకరి నొకరు తిట్టుకొనుచున్నారు. ఈ సున్నితమైన యాహారవిషయమునుగూర్చి ప్రస్తుతము బహుళముగా వ్యాపించియుండు మూఢదురభిమానాభినివేశము లావలఁబెట్టి, యుభయపక్షవాదములును సాకల్యముగా సూక్ష్మదృష్టితోఁ బరిశీలించిచూడఁగా, నాకు విశ్వసనీయముగాఁ దోఁచిన యభిప్రాయ మిట నిచ్చుచున్నాను. చివరకు హిందుమతసిద్ధాంతమే మంచిదిగాఁ గానిపించుచున్నది—అనఁగా—తక్కిన పెక్కుటివలెనే యాహారముకూడ మనుష్యుల జన్మవ్యాపారభేదముల ననుసరించి వివిధముగా నుండవలయునని హిందూశాస్త్రములు శాసించిన విధి సమంజసమైన సిద్ధాంతము. అయిన నేమి ? ప్రస్తుతకాలపుహైందవులు శాస్త్రానుసారముగాను ప్రవర్తింపరు, మహాపురుషులైన యాచార్యుల బోధములను వినరు.

నిజముగా మాంసభక్షణము క్రూరమును అనాగరకమును అయిన కృత్యమే, శాకాహారము స్వచ్ఛతరమే, ఎవరు కాదనఁగలరు ? కేవలాధ్యాత్మికజీవనము చేయఁగోరుముముక్షువులకు శాకాహారకష్టనియమము కడుమంచిదన్నమాట సత్యము. కాని, యేకఫలాపేక్షకులై యెల్లజనులు నిరంతర మొకరితో నొకరు పెనఁగులాడుకొనుచుండు ఈ ప్రపంచసంసారసముద్రములో జీవనౌకాయాత్ర శ్రమపడిచేసి కృతకృత్యుఁడు గావలసినసంసారి మాంసము భుజింపక తప్పదు. బలవంతుఁడు

బలహీను నడఁగఁద్రొక్కి విజృంభించు ననుమాట మానవసంఘములో నుండునంతకాలమును మాంసమో, దానికి ప్రత్యామ్నాయముగా సమబలకరమగు ఆహారము కనిపట్టి అదియో భుజించుట యావశ్యకము; అట్లు చేయనిచో బలవంతులు దుర్బలులను నలఁగఁగొట్టి కాలిక్రిందఁ బెట్టి రాచి చంపుదురు. శాకాహార మితనికి సరిపడినది అతనికి సరిపడినది యని వ్యక్త్యైకనిదర్శనము లగపఱచుట పనికిరాదు; ఒకజాతి నింకొకజాతితోఁ బోల్చి సిద్ధాంతములు లాగుఁడు.

శాకాహారులలో నైనను సామరస్యము లేదు, వారిలో భిన్నాభిప్రాయము లున్నవి. వరిధాన్యము, గోదుమలు, యవలు, జొన్నలు, బంగాళాదుంపలు, తదితరమైన పిండియాహారపదార్థములు పనికిరావు; ఇవన్నియు మనుష్యుఁడు పైరుచేసి పండించినవి; అనేకరోగములు వీని వలనఁ గలుగుచున్నవి, తినినతరువాత దేహములో శర్కరగామాఱు పిండిగలపదార్థములు మిక్కిలి యారోగ్యభంగకరములు; ఇంటఁ గట్టిపెట్టి గోదుమలు బియ్యము పెట్టినందువలన జబ్బుపడిన గుఱ్ఱములును ఆవులును బయళ్లమీఁది కేఁబట్టిక స్వేచ్ఛగా మేసి మరల ఆరోగ్యవంతములగుచున్నవి; పచ్చగడ్డిలోను పచ్చనికూరాకులలోను పిండిపదార్థమత్యల్పముగా మాత్రముండును. ఒరాంగు అను వాలిఁడికోఁతి పచ్చగడ్డియును కాయలును గింజలునుతినునుగాని సాధారణముగా గోదుములు బంగాళాదుంపలు మున్నగునవి తినదు. ఒకవేళ తినినను అవి పక్వముగాకముందు—అనఁగా వానిలో విశేషముగా పిండిపదార్థము బయలుదేఱకముందు—తినును—అని కొందఱు చెప్పుదురు. నిప్పుమీఁద కాల్చి వేల్చినమాంసమును, విశేషముగా పండ్లును పాలును పుచ్చుకొన్నయెడల ఆయుర్వృద్ధియగును. ఎముకలమీఁద కట్టుపెచ్చు వార్ధకము వచ్చుటకు ముఖ్యకారణము, ఫలములలోని ఆమ్లరసము ఆకుష్టమైన పెచ్చులను కరఁగివేయును, అందువలన విశేషముగా ఫలములను దిను వారికి యౌవనము వేగముగాఁబోదు—అని కొందఱందురు.

ఈవాదములకు యుక్తులకు విరామమన్నమాట లేదు. ఇప్పటికిని అవి యవిచ్ఛిన్నముగా సాగుచున్నవి. బలకరమై సులభముగా జీర్ణ

మగుసట్టి మంచి యాహారము భుజింపవలయు ననునది యాదీర్ఘ వివాద మూలకమైన విషయముపైని వివేకవంతులిచ్చు అభిప్రాయము. ఆహారప్రమాణము తక్కువగానుండి పుష్టినిచ్చుపదార్థములందెక్కువగా నుండవలెను, అవి త్వరగా జీర్ణమై రక్తమాంసాది పరిణామ మొందవలెను. అట్లుకానిచో ఆహారము విశేషముగాఁబుచ్చుకొనవలెను, రోజంతయును ఆతిన్నది జీర్ణము చేసికొనుటకే పట్టును. అన్న మఱగించుకొనుటకే మనలోని యావచ్ఛక్తియు వ్యయము చేసినయెడల, తక్కిన కర్తవ్యములఁజేయుట కేమి మిగులును?

వేఁపుడుకూరలు నిజముగా విషపదార్థములవంటివి. మిఠాయి దుకాణము మృత్యుదేవతాభవనము. ఉష్ణదేశములలో నేయిమున్నగు చమురుపదార్థము లెంతతక్కువగా భుజించిన నంతమంచిది. నేతికంటె వెన్న సులభముగా జీర్ణమగును. తెల్లని పిండిలో సారము మిక్కిలి తక్కువగా నుండును. గోదుమ లామట్టున విసరి చేసినపిండి, మంచి యాహారపదార్థము. ఇప్పటికిని పట్టనములకు దూరముగానున్న పల్లెలలో ప్రచారమందున్న పచనపద్ధతి వంగదేశములోఁ గడుఁ బ్రశస్తమైనది. ఏప్రాచీనవంగకవి యిప్పుడు పట్టనములందలి దుకాణములలో విక్రయించు భక్ష్యములను వర్ణించినాఁడు ? ఇవన్నియు వాయవ్యరాష్ట్రములనుండి బంగాళములోనికి క్రొత్తగా దిగుమతియైనవి. ఆదేశములోనైనను ప్రజ లెప్పుడో కాని యవి భుజింపరు. ప్రతిదినము వేఁచిన పదార్థములు దినువాని నెవనిని అట్లైనను నేనెప్పుడు చూడలేదు. మధురలోనుండు మల్లురకు మిఠాయి మున్నగునవి యిష్టమన్న మాట వాస్తవమే, కాని యచిరకాలములో వారి జీర్ణశక్తి తగ్గిపోవును, అప్పుడు జఠరదీపనచూర్ణము లెన్నో మ్రింగవలసివచ్చును.

తినుట కేమియులేక పస్తుచే పరమదరిద్రులు మరణించుచున్నారు. ఆహారముగాఁ గొనుటకుఁ దగని పదార్థములు భుజించుటచే ధనవంతులు మృతినొందుచున్నారు. నోటవైచుకొన్న ప్రతిపదార్థము ఆహార మనిపించుకొనదు. తినినప్పుడు జీర్ణమై రక్తమాంసాదులుగా మారు ఆహార మొక్కటియే నిజమైన యాహారము. వివేచన లేకుండఁ

శక్తికి దొరకిన దెల్ల మింగుటకంటెఁ బస్తుండుట మంచిది. మిఠాయి దుకాణములమీఁది సరకులలో బలకరమగు పదార్థ మొక్కటియు లేదనియే చెప్పవచ్చును. అందలి భక్ష్యము లన్నియు విషసదృశములు. పూర్వము ప్రజ లట్టివి యప్పుడప్పుడుమాత్రమే తినెడువారు; ఇప్పుడు పట్టణములలోనివారు—ముఖ్యముగాఁ బల్లెలనుండివచ్చి పట్టణములలో గాఁపురము చేయువారు—ప్రతిదినమును ఆవిష పదార్థములు తిని యీ విషయమునఁ బావము కట్టుకొనుచున్నారు. అట్టివారు మందాగ్నిరోగమువలన అకాలమరణము నొందుట యేమి యాశ్చర్యము? నీకు ఆఁకలివేసినయెడల, ఈమిఠాయిసరకులు వేఁపుడుసరకులు అన్నియును గంగలోఁ గలిపి యొక డబ్బుపేలాలుకొని తినుము; అవి చౌకగా వచ్చుటయే కాక వానిలో పుష్టికరపదార్థ మెక్కువగా నున్నది. అన్నము, పప్పు, దంపి పొట్టుదీయకుండ గోదుమలు విసరి చేసినపిండితో పులియఁబెట్టకుండఁ జేసినరొట్టెలు, చేఁపలు, కూరగాయలు, పాలు—ఈ యాహారము చాలును. పప్పు దక్షిణహిందూస్థానము వారు చేసినట్లు చేసి, ద్రవముమాత్రమే భుజించి తక్కినవి పశువులకుఁ బడవేయవలెను. చాలినవారు మాంసము భుజింపవచ్చును, కాని దానిలో కాఁకచేయు సంబారు మున్నగు పరిమళద్రవ్యములు విస్తారము వేయకుండ, వాయువ్యరాష్ట్రములవారు తినునట్లు తినవలెను. సంబారపుసరకులు నిజమైన యాహారపదార్థములుగావు, పాడలవాటుచేతనే ప్రజలు వానిని వాడుకొనుచున్నారు, పప్పు బలకరమైన పదార్థమే కాని, దానినిజీర్ణము చేసికొనుట కష్టము. తేఁతబటానిగింజలతో కాఁచినకట్టు జిహ్వకు రుచిగా నుండును, శీఘ్రముగా జీర్ణమగును. పారిసుపట్టణములోనివారికిది మిక్కిలి ప్రియమైనయాహారపదార్థము. బటానిగింజలు తొలుతబాగుగా ఉడికించి గుజ్జుగా ఎనిపి దానిని నీళ్లలోఁగలుపవలెను, తరువాత ఆ నీళ్లను పాలువడిఁగట్టు తీఁగజల్లెడతో వడఁబోయవలెను. అట్లుచేసినయెడల పైపొట్టంతయు విడిపోయి స్వచ్ఛమైన సారముదిగును. వారివారి యిష్టము ననుసరించి యారసమును పసుపు, మిరియము మున్నగు సంబారు దినుసులతో పోగచెదరు; దానిని పిమ్మట పెనములో కాంచె

ము నేయివేసి వేఁచఁగా రుచిమంతమైనట్టియు ఆరోగ్యకరమైనట్టియు బటానిప్పు తయారగును. మాంసభక్షకులు మేఁకతల మెదడుగాని చేపలుగాని కలిపివండి దానికెక్కువ రుచిదీసికొని రావచ్చును.

మన హిందూ దేశములో అతిమూత్రశర్కరామూత్రవ్యాధులంతగా వ్యాపించియుండుటకుఁ గారణము! అజీర్ణరోగమే! అక్కడక్కడ అంతమనఃక్లేశము దానికిఁ గారణమైన నగుఁగాక, సర్వసాధారణముగాఅది అగ్నిమాంద్యము వలననే కలుగుచున్నది. అజీర్ణమునకు, బానకడుపు ప్రధానమైన ప్రత్యక్షచిహ్నము. భోజనమనఁగా గొంతువరకువచ్చునట్లు తెగఁదినుట కాదు; ఎంతవఱకు అఱిగించుకొనఁగలఁడో అంతవఱకు భుజించుటయే యుక్తభోజనము. చిక్కి సన్నగిల్లుటయు లావగుటయుఁగూడ అజీర్ణలక్షణములే. అతిమూత్రలక్షణములలో కొన్ని యగపడినంతమాత్రమున ఇఁకేమి యున్నదని అధైర్యపడకుము. మన దేశములో అవియంత యుపద్రవకరములు గావు. వానికంతగా జడియనక్కఱలేదు. అజీర్ణనివారణార్థ మాహారవిషయమై మాత్రమెక్కువ జాగరూకతతో నుండుము. వీలైనంతవఱకు వెల్లడిగాలి పీల్చుచుండవలెను, దూరముగా షికారుపోవుచు దేహమునకు పరిశ్రమ మీయవలెను. కాలికండలు ఇనుమువలె దృఢముగా నుండవలెను. నీవు కొలువులోనున్న యెడల, శక్యమైనచో, సెలవుపుచ్చుకొని హిమవత్పర్వములందలి బదరికాశ్రమమునకు తీర్థయాత్రపొమ్ము. కొండలెక్కుచు దిగుచు ఆరెండువందలమైళ్ల ప్రయాణము పాదచారివై నీవు చేసినయెడల, అతిమూత్రభూతము నిన్నువదలి యావలికిఁ బాఱిపోవును. ధన్వంతరులను దగ్గఱకు రానీయకుము, వారివలన నీకుఁగలుగు మేలుకంటె కీడెక్కువ; సాధ్యమైనంతవఱకు ఔషధములు పుచ్చుకొనుట మానుము; అవితఱచుగా రోగముకంటె ముందురోగిని చంపివేయును. ప్రతిసంవత్సరము దుర్గాపూజకై సెలవులిచ్చినప్పుడు చేతనైనచో, కట్టనమునుండి నీస్వగ్రామమునకు అంతదూరము నడచి వెళ్ళుము. మన దేశములో, ఏమి పాపమో కాని, ధనవంతులు పరమమాంద్యపరతంత్రతామూర్తులుగాఁ బరిగణింపఁ దగియున్నారు. ఒకరిచే అన్నము

తినిపించుకొనువాఁడును, నడచుట కొఱకరియూత కావలయువాఁడును వ్యాధిగ్రస్తదురవస్థలోఁ బడకమానఁడు. రొట్టె యంతయును నడదేమో యని భయపడుచు భయపడుచు పైపెచ్చు తినువాఁడు బ్రతికియున్నను మృతప్రాయుఁడే! ఒక్కబిగిని 20 మైళ్లదూరము నడవలేని వాఁడు పురుషుఁడా పురుగా? బుద్ధిపూర్వకముగా అనారోగ్యమును అకాలమరణమును ఆహ్వానముచేసి రప్పించుకొనువాని నెవఁడు రక్షింపఁగలఁడు?

పులిరొట్టెకూడ విషమే కనుక, దానినెంతమాత్ర మంటకుము; సారాయికాఁడి కలిపినపిండి చాలహానికరము. పులియఁబెట్టిన పదార్థ మెన్నఁడును భుజింపకుము; మనశాస్త్రము లట్టిపదార్థముల నిషేధించుచున్న వనుమాట మహాముఖ్యవిషయము. పులిసిన మధురపదార్థములను మన శాస్త్రములలో "శుక్తము" లందురు. వానినన్నిటిని నిషేధించినారు, మంచి యారోగ్యకరమగు పెరుఁగుమాత్రము నిషేధింపలేదు, రొట్టె తినవలయునప్పుడు దానిని నిప్పుమీఁద బాగుగాఁగాల్చి మఱి పుచ్చుకొనుము.

అపరిశుద్ధమైన యన్నమును నీరును అన్నివ్యాధులకును మూలకారణములు. అమెరికా వారికి, త్రాగు నీటిని వడియఁగట్టు పిచ్చియొకటి ముమ్మరముగాఁ బట్టినది; దానియందీవలఁ బ్రజలకుండు విశ్వాస మిప్పుడు పోవుచున్నది; విషూచిమహామారి మున్నగు రోగములు గలిగించు సూక్ష్మజీవులీలాముట్టునఁనే నీటితో దిగఁబాఱునుగాని తొలఁగిపోవు; అదిగాక, వడఁబోయు యంత్రము ఆవ్యాధులఁ గలిగించు క్రిములకుఁ గ్రమక్రమముగాఁ బుట్టినిల్లగును. ఈజలశోధనసాధనము కలకత్తాలోఁ బ్రవేశపెట్టిన మొదేండ్లవఱకు విషూచీవ్యాధి యొక్కఁడును గనఁబడలేదని చెప్పుకొన్నారు, కాని యటుపిమ్మట ఆవ్యాధి పట్టనములో యథాపూర్వముగానే యుండెను, ఏలన, ఆజలశోధనయంత్రద్వారముననే విషూచీజీవులు విశేషముగావచ్చి మంచినీళ్లలోఁ బ్రవేశించుచుండెను. ముక్కాలివెదురుచట్టముపైని కుండమీఁద కుండపెట్టి మూఁడుకుండలలో మంచినీళ్ళువడఁబోయు మార్గమన్నిటిలోను మంచి

పూర్వము ; కాని రెండేసిమూఁడేసి రోజులకు వానిలోని యిసుకయును మసిబొగ్గులును మార్చి క్రొత్తవి వేయుచుండుటగాని, నిప్పుమీఁద బాగుగా కాఁచి యవియే మఱల మఱల నుపయోగించుటకాని చేయుచుండవలెను. కలకత్తాప్రాంతమున గంగాతీరస్థగ్రామములలోనివారు పటికముక్క గుడ్డలోఁ బడవేసి జలమును వస్త్రపూతము చేయుదురు ; ఈవడఁబోఁత సర్వోత్కృష్టమైనది ; పటికయణువులు నీటిలోని మట్టి, రోగాంకురములు, మున్నగు కలుషము లన్నిటినికూడఁ గొనిపోయి, కొంతసేపటికి మనటుగా వానితో కుండ యడుగునకు దిగిపోవును. సునాయాసమైన యీపద్ధతి కీదేశజలశోధకసాధనము లన్నిటికంటెను మంచిది, అట్లు వడఁబోసిన నీటిముందర గొట్టములలోనుండి వచ్చు మంచి నీరెందులకును పనికిరాదు. కాఁచినయుదకము కడు క్షేమకరము. పటికవలన కల్మషమంతయు నట్టడుగునకు దిగినపిమ్మట ఆనీరు కాఁచి యుపయోగించుకొనినచో లేశమాత్రమైనను భయముండదు; ఇఁక నీయన్యదేశీయ జలశోధకయంత్రము లన్నియును ఆవలఁ బాఱవేసి హాయిగా నుండవచ్చును. అమెరికాలో త్రాగుటకుపయోగించుకొనునీరు మొట్టమొదట పెద్దయంత్రములతో ఆవిరిక్రిందమార్చి, తరువాత ఆయావిరిని చల్లఁబఱచి మఱల నీరుచేసి, యంత్రాంతరసాహాయ్యమున, ఆవిరిచేసినప్పుడు నీటిలోనుండి యెగిరిపోయిన వాయువ్రజముబదులుగా స్వచ్ఛమైనగాలిని దానిలోఁ బ్రవేశపెట్టుదురు. అట్లు తయారుచేసిన నిర్మలోదకమును ప్రతిగృహమందు నుపయోగపఱచుకొందురు.

మన దేశములోనివారు, కొంచెము ధనవంతులగుటయొడనే, వారిపిల్లలకు నానావిధములైన మధురభక్ష్యములును పేఁపుడుపదార్థములును బెట్టుదురు ; అన్నమును రొట్టెలును మాత్రమే పెట్టి యూరకుండుట పరువుతక్కువ యనుకొందురు కాఁబోలు ! ప్రజల యవివేకము చూడుఁడు! అట్టి యాహారముతోఁ బెరిఁగిన బిడ్డలు వికృతావయవప్రమాణులును, వివేకహీనులు, పనికిమాలిన సోమరులును అస్వతంత్రులును గాక యన్యులెట్లగుదురు ? మంచి బలశాలులై చల్లనిదేశము లో నివసించుచు, పగలును రాత్రియును, చాలుమాలిక లేక

పోటుపడుచుండు ఆంగ్లేయులుసైతము మిఠాయియు వెన్నలో వేఁచిన వస్తువులును అన్న, మిక్కిలి భయపడుదురు. ఇఁక నిప్పులుగురియు ప్రదేశములలో నివసించుచు, ఒకచోటినుండి మఱియొకచోటికి కాలుకదల్పుట కష్టములేని మనమేమి తినుచున్నాము?—నేతిలోనో నూనెలోనో వేఁచిన మిఠాయి మున్నగు పదార్థములు, అన్నియును తైలపక్వములే! వంగదేశములోని గ్రామముల పూర్వపు జమీందారులు, ఇరువదిముప్పదిమైళ్లు కాలినడకయున్న గణనసేయక నిరవశేషముగా నలువదిచేఁపలు దినుట యొక విశేషముగా నెంచక, నూఱేసియేండ్లు బ్రతికెడువారు. ఇప్పుడు వారిబిడ్డలు మనుమలు మునిమనుమలు కలకత్తాకువచ్చి నీటుగా గోఁటుగా నేత్రములకు సులోచనములు తగిలించి, బజారునుండి తెచ్చిన మిఠాయి భక్షించి, అద్దెకుఁబుచ్చుకొన్న గుఱ్ఱపుబండిమీఁదఁగాని యీవీథినుండి యావీథికిఁబోలేక అతిమూత్రవ్యాధియని యడలుచు అల్పాయుష్మంతులై అంతకలోకమున కరుగుచున్నారు! వారి కలకత్తా నాగరకతయంతయు నిట్లు పరిణమించుచున్నది. స్వదేశవిదేశవైద్యులుకూడ వారిని మఱింత త్వరగా చావునకుఁ దెచ్చుచున్నారు. అభిమజ్ఞులు ప్రసర్వజ్ఞులు! ఏవ్యాధియైనను మందులతో మాన్పఁగల మనుకొందురు. కొంచెము కడుపుబ్బిన దనుటతోడనే యేదో యొకమందు పుచ్చుకొనుమని చెప్పుదురు. "మందులకు దూరముగానుండి నాలుగైదుమైళ్లు నడువుఁడు." అనియుపదేశింపవలయునను మాట, యేమిపాపమో కాని! యావైద్యులబుఱ్ఱల కెప్పుడును ఎక్కదు.

అనేకదేశములు, అనేక పాకభేదములు నేను జూచుచున్నాను. బంగాళములోని వంటతీరు మరియెక్కడను లేదు, అది మిక్కిలి ప్రశస్తము. అక్కడివంట యొకసారి భుజించినవాఁడు దానిని మఱల రుచిచూచుటకుఁ బునర్జన్మమెత్తఁ గోరుననుట యతిశయోక్తి గాదు. దంతములున్నప్పుడు దంతముల విలువ యెవరును గణనసేయరు! ఆహారవిషయమున అన్యదేశీయులగు పాశ్చాత్యులను మనమేల యనుకరింపవలెను? ఎంద అట్లు చేయఁగలరు? మనదేశములో ఈభాగమున కర్హా

మైన యాహారము, తూర్పువంగదేశము వారు భుజించునట్టి యాహారమే. అది స్వచ్ఛముగా, చౌకగా శరీరబలారోగ్యకరముగా నుండును. సాధ్యమైనంతవఱ కట్టి యాహారమును దినుటకుఁ బ్రియత్నింపుఁడు. పాశ్చాత్యపచనపద్ధతుల మీారెంత యనుకరించిన నంత పాడగుదురు, అంత యనాగరకులగుదురు. కలకత్తా కాఁపురమువలన ఆహా ! మీాకెంత నాగరకత గలిగినది ! మీారు వన్ని పఱచిన బజారు భక్ష్యజాలమను ప్రాణహానికరమహాజాలపు మోహములోఁబడి, బాంకూరా తన పేలాల సరకంతయు దామోదర నదిలోఁ గలిపివేసినది, తన పప్పంతయు దగ్ధము చేసికొన్నది ; ఢక్కా-విక్రమపురముల ప్రాచీన భోజనపదార్థము లన్నియు భగ్నమైనవి—అనఁగా నవి నవీననాగరకతామహాసముద్రములోఁ బడినవి. ఓ పట్టననివాసులారా! మీారుపాడయి, మిగిలినవారిని మీాభ్రష్టమార్గములోని కీడ్చి, చక్కని నాగరకులమైతిమని చంకలు గొట్టుకొనుచున్నారు! ఇఁక గ్రామనివాసులన్ననో, వివేక హీనులై కలకత్తా యుచ్ఛిష్టమంతయును కడుపులోఁ బడవైచికొని గ్రహణితోను అజీర్ణములోను బాధపడుదురు; ఇంత బాధయుఁ బడుచు ఆవస్తువులు తమకుఁ బడుట లేదని యొప్పుకొనక కలకత్తా గాలిలో చెమ్మయున్నది, అది యుప్పుగాలియని తమ్ము సమర్థించుకొందురు. ఏపాట్లు పడియో ప్రతివిషయములోను వారు పట్టనవాసులగుట తప్పదు!

ఇంతవఱకును ఆహారప్రశస్త్యమునుగూర్చియు నితర సంప్రదాయములఁగూర్చియు సంగ్రహముగాఁ జెప్పితిని. ఇఁకఁ బాశ్చాత్యులు సాధారణముగా భుజించు పదార్థము లేవియో యవి రానురా నెట్లుక్రమక్రమముగా మాఱుచున్నవో—వీనిఁగూర్చి యించుక ముచ్చటించెదను.

సమస్త దేశములలోను, ఏదో యొకవిధమైన ధాన్యము, మొక్కలు, కూరగాయలు—ఇవి బీదల యాహారపదార్థములై యున్నవి ; మత్స్యమాంసములు భోగపదార్థములలోఁ జేరి వ్యంజనద్రవ్యములుగా నుపయోగపడుచున్నవి. మనవంగద్రవిడ కేరళోత్కలదేశములలో వరియన్నము, పప్పు, కూరగాయ లెట్లు ప్రధానాహారపదార్థములోఁ

యట్లే ప్రతిదేశములోను ప్రధానముగాను పుష్కలముగాను పండునై రు పేదవారికి ముఖ్యాహారముగా నుండును, మనము పచ్చడియుపయోగపఱుచుకొనునట్లుమాత్రమే వారప్పుడప్పుడు చేఁపలు మాంసముఉపయోగపఱుచుకొందురు. హిందూదేశముయొక్క యంతరభాగములలోని ధనవంతులు, పులియఁబెట్టకుండ వరిపిండితోను గోధుమపిండితోను చేసిన చప్పరొట్టెలు తిందురు, చౌకగానుండు నితరధాన్యముల పిండితోఁజేసిన రొట్టెలు జనసామాన్యమున కాహారమగును.

హిందూదేశ మందంతటను, మొక్కలు, పప్పుగింజలు, చేఁపలు, మాంసము—ఇవి ప్రజలుతిను చప్పరొట్టెనో వరియన్నమునో రుచిమంతముగాఁ జేయుటకుమాత్రమే యుపయోగపడుచున్నవి, కావుననే సంస్కృతమున వానిని “వ్యంజనము”లందురు. పాంచాలమునందును, రాజపుత్రస్థానమందును, దక్షిణహిందూస్థానమందును రాజులును ధనికులును ప్రతిదినమునను వివిధములైన మాంసములు భుజించుచున్నను, వారికిసైతము ప్రధానాహారపదార్థము రొట్టెయో అన్నమో యైయున్నది. రోజును 1 పౌండుమాంసము తినువాఁడు, దానితోపాటు తప్పక 2 పౌండ్ల రొట్టెలు తినుచున్నాఁడు.

ఇట్లే పశ్చిమఖండములందు దరిద్రప్రదేశములలో వారికిని, ధనవంతములగుప్రదేశములలోని దరిద్రులకును రొట్టెయు బంగాళాదుంపలును ముఖ్యాహారములు ; ఎప్పుడో కాని మాంస ముపయోగపడదు. ఉపయోగపడినను నంజుకొను వ్యంజనద్రవ్యముగా నుపయోగపడును. పోర్చుగల్, ఇటలీ మున్నగు నుష్ణదేశములలో ద్రాక్ష పుష్కలముగా పండును; ద్రాక్షాఫలములనుండి తీసిన రసము చాలఁ జౌకగా దొరకును. ఈద్రాక్షారసము మిక్కిలి పుష్టికరము, విశేషముగాఁ బానము చేసినఁ దప్పమాదకముగాదు. కనుక అదేశములలోని పేదవారు మత్స్యమాంసములకు మాఱుగా శరీరబలమునకై యీద్రాక్షారసము గ్రోలుచుందురు. యూరప్పునకు ఉత్తరమునందుండు రష్యా, స్వీడెన్, నార్వే మొదలగు దేశములలో రైధాన్యపుపిండితోఁ జేసిన రొట్టెలును బంగాళాదుంపలును ఎండఁబెట్టిన చేఁపలును పేదవారి యాహారపదార్థములు.

యూరప్పులోని భాగ్యవంతులును అమెరికాలోని యందఱు ప్రజలును బుచ్చుకొను నాహారము మాత్రమట్టిదిగాదు. మత్స్యమాంసములు ప్రధానాహారపదార్థములు; రొట్టె అన్నము మున్నగువస్తువులు నడుమ నడుమ నంజుకొను వ్యంజనపదార్థములుగా నుపయోగపడుచున్నవి. అమెరికావారు రొట్టె యత్యల్పముగా భుజింతురు; చేఁపలుగాని మాంసముగాని వడ్డించినప్పుడు, వానితో పాటు మఱేమియు వడ్డింపరు; తఱచుగా అవి ఆమట్టుననే రొట్టెగాని అన్నముగాని కలియకుండ—తినివేసెదరు. కాఁబట్టి గడియగడియకు కంచము మాఱుచుండవలెను. పదిరకముల భోజనపదార్థము లున్నచో కంచము పదిసారులు మాఱుచుండవలెను. ఆపద్ధతినే మనము భుజించు నెడల, ఈప్రకారము వడ్డనజరుగవలెను.—మొట్టమొదట చేఁదుకూర వడ్డింతురనుకొందము, ఆపళ్లెముతీసి పిమ్మట పప్పుపెట్టినపళ్లెము తేవలెను, అట్లే తరువాత చేరో, పులుసో, రావలెను, అనంతరము ప్రత్యేకముగా అన్నమో రొట్టెయో మిఠాయియో తీసికొనిరావలెను—ఇట్లు వడ్డించుటవలన లాభమేమనఁగా: వివిధములైన భోజనపదార్థములలోఁ గొంచెము కొంచెము మాత్రమే భుజింతురు. ఏపదార్థమును అమితముగా భుజించుట తటస్థింపదు. ఫ్రెంచివారుదయమున కాఫీతో ఒకటిరెండు రొట్టెముక్కలును వెన్నయును తిందురు. మధ్యాహ్నమున మత్స్యమాంసములు మున్నగునవి కొలఁదిగా భుజింతురు, రాత్రియందు ప్రధానభోజనము కావింతురు. ఇటలీ స్పెయిన్ దేశస్థులు ఫ్రెంచివారివలె భోజనము చేయుదురు. జర్మనీవారు రోజున కైదాఱుసారులు దిట్టముగా తిందురు; ప్రతిభోజనసమయమునందును అంతోయింతో మాంసముకూడ కావలెఁబడును. ఇంగ్లీషువారు రోజు మూఁడుమార్లు భుజింతురు. ఉదయభోజనము కొంచెము తక్కువగానుండును, కాని భోజనమునకు భోజనమునకు నడుమ కాఫీయో టీయో త్రాగుదురు. అమెరికావారు కూడ మూఁడుసారులే భుజింతురు, కాని ప్రతిభోజనము మాంసాతిరేకమై కొంచెముదాత్తముగా నుండును. ఈ దేశము లన్నిటిలోను ప్రధానభోజన మెట్లుండునో చెప్పెదను, భాగ్యవంతులు వంటచేయుటకు ఫ్రెం

చివారినైనఁ బెట్టుకొందురు, లేదా పదార్థములు వారు పచనముచేసిన శైలిన పచనము చేయించుకొందురు. ఆఁకలిరేఁపుటకు ఉప్పులో ఊరవేసిన చేఁపలుగాని, చేఁపగుడ్లుగాని, యేదేని పచ్చడికాని కూరగాయలుగాని తొల్త తిందురు, తరువాత రసపదార్థములు గ్రోలుదురు, తరువాత నవీనభోజననాగరకతాసంప్రదాయప్రకారము ఫలములు రావలెను, తరువాత చేఁపలు, పిమ్మట మాంసపుకూర, తదనంతరము కాల్చిన పెద్ద పలలఖండమును దానితో కొన్ని శాకపదార్థములును, పిమ్మట లేడిమాంసము పిట్టమాంసము మున్నగు వేటమాంసములు, వానివెన్క-ను మిఠాయి మున్నగు మధురభక్ష్యములు. అంతట మనోహరమైన మంచుమీఁగడతో భోజనము పరిసమాప్తమగును. విత్తవంతుల విందులలో పదార్థము మారినపుడెల్ల ద్రాక్షారసము రకముకూడ మాఱుచుండును. వివిధపదార్థములతో, హాక్కు, క్లారెట్టు, మంచు వేసిన షాంపేన్ను మున్నగు వివిధమద్యరసములను పానీయములుగా నిత్తురు. క్రొత్తభోజనపదార్థములతో చట్టిగరిటెలు, కత్తులు, ముండ్లగరిటెలుకూడ క్రొత్తవియుందురు. భోజనానంతరము, పాలుగలపని కాఫీకషాయము, మద్యములు, చిన్న చిన్న పానపాత్రములలోఁ బోసి తెత్తురు, అన్నిటికంటె చివరను పొగచుట్టలు వచ్చును. భోజనపదార్థములతో ఎన్నెన్ని రకముల ద్రాక్షాదిమాధ్వీరసములిచ్చిన, విందుచేసినవాఁడంత భాగ్యవంతుఁడును అంత మర్యాదాశీలుఁడును అని యెంచుకొందురు. అక్కడ ఒక్క విందునకగు ధనమును మన దేశములో సామాన్యధనికుఁడగు సంసారి వ్యయముచేసినయెడల చెడి, పట్టిసన్న్యాసియయిపోవుననుట కేమియు సందేహము లేదు.

ఒక కొయ్యపీఁటపై జాసికపట్టు వేసికొని కూరుచుండి వెనుకఁ జేరఁబడుటకొక పీఁటయుంచుకొని, కొంచెమెత్తుగల దారుపీఠముమీఁద ముందఱ నొక కాంస్యపాత్రముంచుకొని ఆర్యులు పూర్వము దానిలో భోజనము చేసెడివారు. అట్టియాచారమే యిప్పటికిని పాంచాల రాజపుత్రస్థానమహారాష్ట్ర ఘూర్జర దేశములలో సాగుచున్నది. వంగోత్కల త్రిలింగకేరళాది దేశములవారు ముందు లోహపాత్రి పెట్టుటకు దారు

పీఠ ముపయోగింపక వట్టినేలమీఁదనే కంచము పెట్టుకొనియో అరఁటాకు పఱచుకొనియో భుజింతురు. మైసూరుమహారాజుగారు కూడ అట్లే చేయుదురు. భోజనసమయమున మహమ్మదీయులు పెద్ద తెల్ల దుప్పటీపఱచుకొని దానిమీఁదఁ గూరుచుందురు. బర్మాజపానుదేశస్థులు భోజనపాత్రలు భూమిమీఁదనే పెట్టుకొని, హైందవులవలె కటిప్రదేశములు నేలనంటఁ జతికిలఁబడక, మోఁకాళ్లును పాదములును నేల మోపి వానిమీఁద మోఁకరిలఁబడి భోజనముచేయుదురు. చీనాదేశీయులు కుర్చీలపైఁ గూర్చుండి ముందు మేజాబల్ల వైచుకొని దానిమీఁద ఆహారపదార్థములున్న పింగాణులు పెట్టుకొని చిఱుగఱిటెలతోను కత్తిపుడుకలతోను భోజనముచేయుదురు. ప్రాచీనకాలములలో, రోమనులు, గ్రీకులును ముందు మేజాబల్ల పెట్టుకొని చేరఁబడుటకు వీలైన మంచముపై యొఱగికూర్చుండి మనవలె వ్రేళ్లతో భుజించెడువారు; పూర్వకాలపు యూరప్పుదేశస్థులుగూడ కుర్చీలమీఁదగూర్చుండి మేజాలమీఁద వడ్డించుకొని చేతులతోఁ దీసికొని భోజనము చేసెడివారు, చిఱుగంటెలు ముండ్లగఱిటెలు వారికిప్పుడు వచ్చినవి. చీనావారి భోజనపద్ధతిమాత్రము కౌశలముగావలసిన యొకగరిడీవలెఁ గాన్పించును. మన దేశములో తమలపాకు లమ్మువారు రెండు పలుచని పిడియినుపఱేకులు పుచ్చుకొని వానితో చేతిచమత్కృతిచే కత్తెరతోవలె తమ్ములపాకు లెట్లు కత్తిరింతురో, అట్లే చీనాదేశపువారు రెండువ్రేళ్లకు అఱచేతికినడుమను రెండు పుల్లలాడించి వానిని పటుకారువలె నుపయోగపఱచుకొని కూరముక్కలు మున్నగువానిని నోటికందింతురు; అంతేకాక నోటియొద్ద అన్నపుగిన్నె యుంచుకొని ఆరెండుపుల్లలు గలిపి గఱిటెవలెఁబట్టుకొని వానితో, సన్నము నెగురఁగొట్టి డడదడ నోటఁ బడవైచుకొనెదరు.

అన్నిజాతుల మూలపురుషులును అతిప్రాచీనకాలములో చేతికి దొరకినదెల్లను తినెడువారని చెప్పుదురు. పెద్దజంతువును దేనినైనను వారుచంపినప్పుడు దాని నొక్క నెలవఱకు నిలువచేసికొని అది కుళ్లిన పిమ్మటనైనను దానిఁ బాఱవైచెడువారు గారఁట. కాలక్రమమున

నాగరకులై వారు భూమి కృషిచేయుట నేర్చుకొన్నారు. తత్పూర్వ కాలమున వేటవలనఁ బ్రతిదినమును వారి కాహారము దొరకెడిదిగాదు, కనుక అడవిమృగములవలెనే వారును దొరకినరోజున గొంతువఱకు మెక్కి తరువాత వారములో నాలుగైదురోజులు కస్తుండెడివారు. కృషీవలులైనపిదప వారి కాబాధ తప్పిపోయినది, సేద్యమువలన నిత్యము వారి కాహారములభించుచుండెను, కాని పూర్వాచారముమాత్రము పోలేదు. ఆ కాహారముతోపాటు అలవాటుచొప్పున కుళ్లినమాంసమో, అట్టి పదార్థ మేదోయొకటి పుచ్చుకొనెడివారు. ఆదిని కుళ్లికంపుగొట్టు మాంసము అత్యావశ్యకమైన ఆహారపదార్థముగా నుండెను. తరువాత అదియో దానికి మాఱట్టిపదార్థము మఱియొకటియో రుచికై పుచ్చుకొను ఇష్టవస్తువుగా నుపయోగపడుచుండెను. ఎస్కిమోజాతివారు మంచుప్రదేశములందుందురు, అక్కడ ఏవిధమైనపైరును పెరుఁగదు, కావున వారికి మత్స్యమాంసములే నిత్యాహారములు ; అప్పుడప్పుడు ఆఁకలి మందగించినప్పుడు వారు జఠరదీప్తికై కుళ్లినమాంసము కొంచెము తినుచుందురు. ఇప్పటికిని యూరప్పులోనివారు వేటాడిన లేడిమున్నగు వనమృగములను పక్షులను తెచ్చినవెంటనే వండుకొనరు, కొంచెము కుళ్లువాసనగొట్టువఱకు వానిని వ్రేలాడఁగట్టియుంతురు. కలకత్తాలో కుళ్లిన లేడిమాంసము బజారునకుఁ దెచ్చినతోడనే అమ్మకమగును, కుళ్లి కొంచెము కంపుగొట్టినఁగాని కొన్ని చేఁపలు జనుల కిష్టములుగావు. యూరప్పులోని కొన్ని ప్రదేశములందు కంపుగొట్టు జున్ను ప్రజలు మహాప్రియమైనపదార్థముగా నెంతురు. ఆ కాహారములకై తము వెల్లుల్లియో నీరుల్లియో కొంచెము గావలయునందురు; దక్షిణహిందూస్థానపుబ్రాహ్మణుని వంటలో అవి యుండకతప్పదు, కాని మన శాస్త్రములు వానినిగూడ నిషేధించినవి. నీరుల్లి వెల్లుల్లి (లశునద్వయము) పెంపుడుకోడిమాంసము, పందిమాంసము—ఇవి బ్రాహ్మణజాతికి నిషిద్ధపదార్థములు, అవి తినువారు జాతిభ్రష్టులగుదురు. కావున సదాచారులును ఛాందసులును అగు హిందూదేశస్థులు వానిని బరిత్యజించి వానికిబదులుగా ఇంగువ తెచ్చిపెట్టినారు; కాని యింగువ ఉల్లికంపును

ఎక్కువ కంపుగొట్టుపదార్థము ! హిమాలయప్రాంతమందలి ఖాందెసె బ్రాహ్మణులు సరిగా వెల్లుల్లివలె కంపుకొట్టు ఒకవిధమైన యెండుగడ్డి యుపయోగించుకొందురు. ఉపయోగించుకొనిన ఏమి బాధ ? అవి తినఁ గూడదని వేదశాస్త్రములు ప్రత్యేకించి నిషేధించుట లేదే !!

ఒక క్రీస్తుమతముదక్క తక్కినసర్వమతములును—ఇవి తినవచ్చును, ఇవి తినఁగూడదు—అని యాహారవిధులు విధించుచున్నవి. జైనులును బౌద్ధులును మత్స్యమాంసము లెన్నఁడును భోజింపరు. అందు జైనులు భూమికిక్రింద పెరుఁగు! వేళ్లు, దుంపలైనను తినరు; త్రవ్విపెల్లగించుటలో ఏప్రాణిచచ్చునో యని వారిభయము; చీఁకటిపడిన పిమ్మట ఏపురుగు నోటిలోనికిఁ బోవునో యని వారు రాత్రులందు భోజనము చేయరు. పందిమాంసము, పొలుసులేనిచేఁపలు, చీలిన గిట్టలులేని జంతువులమాంసము, నెమరువేయని జంతువులమాంసము—ఇవి యూదులు (Jews) తినరు. మఱియు, మత్స్యమాంసములు వండుచుండఁగా వంటగదిలోనికి పాలుగాని పాలతోఁ జేసిన పదార్థముకాని తెచ్చినయెడల, వారక్కడి వచనపదార్థము లన్నియుఁ బాఱవేతురు; కావుననే మతాభినివేశముగల యూదులు ఇతరజాతులు వండిన యాహారము తినరు. హిందువులవలెనే వారును ఊరకహతమై దేవతానివేదితముగాని మాంసమును భుజింపరు. వంగ పాంచాలదేశములందు దేవతానివేదితమైనమాంసమును మహాప్రసాదమందురు. కావున మహాప్రసాదమైనఁ గాక—అనఁగా యథావిధిగా ముందు దేవునకు సమర్పింపఁబడినఁగాక—యూదులు మాంసముదినరు. అందుచేతనే అనియమముగా ఎక్కడనో యొక్కడ మాంసముకొని యుపయోగించుట హిందువులకువలెనే యూదులకును తప్పు. మహమ్మదీయుల ఆహారనియమములు యూదుల ఆహారనియమములవంటివే, కాని, యంతకఠినములుగావు. మహమ్మదీయులు కూడ భోజనమున మత్స్యమాంసములతో పాలు పుచ్చుకొనరు, కాని, యవిరెండును వంటగదిలోనున్నఁగాని యొకదానినొకటి యంటినఁగాని వారంత బాధకరముగాఁ దలఁపరు. ఆహారవిషయమున హిందువులకును యూదులకును ఎక్కువ సాదృశ్యమున్నది ; అయినను హిందువు

అడవిపందిని తిందురు, యూదులు తినరు. పాంచాలదేశములో హిందువులకును మహమ్మదీయులకును బద్ధవైరముండుటచే, మహమ్మదీయులు చేయునది పట్టుపట్టి హిందువులుచేయుదురు, కనుక అక్కడి హిందువులకు అడవిపందిమాంసము అతిముఖ్యమైన యాహారపదార్థములలో నొకటియైనది. అడవిపందిని వేటాడుటయు, దాని మాంసము తినుటయు రాజపుత్రులకు విహితధర్మప్రాయములైనవి. దక్షిణహిందూస్థానములో బ్రాహ్మణులుతప్పతక్కినజాతులలో ఊరఁబందిమాంసమునైతము తినువాడుక విశేషముగాఁగలదు. హిందువులు అడవికోళ్లను తిందురుగాని పెంపుడుకోళ్లను తినరు (?)

వంగము మొదలు నేపాళమువఱకునుండు దేశములలోను, హిమవత్పర్వతభూములలో కాశ్మీరసీమలవఱకునుండు ప్రదేశములలోను, హిందువులందఱు ఆహారవిషయమై యీయాచారములనే అవలంబించుచున్నారు. ఈప్రదేశములలో నేఁటివఱకుఁగూడ, మనువు చెప్పిన యాహారవిధులే చాలవఱకు ఆచరణములో నున్నవి. కుమాయూను మొదలుకొని కాశ్మీరమువఱకు నుండుప్రజలు-బంగాళము, బేహారు, అలహాబాదు, నేపాళము—వీనిలోనుండు ప్రజలకంటె విశేషముగా వానినిపాటించుచున్నారు. వంగదేశస్థులు కోళ్లనుగాని కోడిగుడ్లనుగాని తినరు, అయినప్పటికి పొట్టిబాతుగుడ్లను నిరాక్షేపముగా భుజింతురు; నేపాళదేశపువారును అట్లేచేయుదురు, కాని కుమాయూను పైనుండువారికి అవికూడ నిషిద్ధములు. కాశ్మీరవాసులు అడవిపొట్టిబాతుగుడ్లు అతిప్రియముగా తిందురుగాని, పెంపుడుపొట్టిబాతుగుడ్లు తినరు. అలహాబాదు ఆవలనుండుప్రదేశములలో—హిమాలయప్రదేశములలోతప్ప—మేఁకమాంసముతిను హిందువులందఱును కోళ్లనుగూడ తిందురు.

ఈ యాహారవిధినిషేధవాక్యములలో పెక్కువాక్యములు ఆరోగ్యసంరక్షణార్థము పుట్టినవి; కాని యీపదార్థ మారోగ్యకరము, ఇదికాదు, అని పరిష్కృతముగాఁ బ్రత్యేకించి చెప్పుటకష్టము. ఊరఁబందులు కోళ్లు, కనఁబడినవెల్లను తినును, అపరిశుద్ధముగా నుండును, కావున వానిమాంసమును నిషేధించినారు. అడవిమృగములు అడవిలో

ఏమితినునో యెవ్వరు చూడరు, కావున వానిమాంసము నిషిద్ధము కా
దన్నారు. అదిగాక, పెంపుడుజంతువులకంటె అడవిజంతువులు ఎక్కువ
యారోగ్యవంతములుగాను తక్కువవ్యాధిగ్రస్తములుగాను ఉండును.
పాలు జీర్ణము చేసికొనుట—ముఖ్యముగా పురిటిరోగముతో బాధపడు
వారికి—మిక్కిలి కష్టము; తొందరగా గిన్నెడుపాలు గుటుక్కున
మ్రింగినందువలన ప్రాణాపాయము తటస్థించినట్లు నిదర్శనములుకూడఁ
గలవు. శిశువులు తల్లిస్తన్యము త్రాగునట్లు పాలు పుచ్చుకొనవలెను.
కొంచెము కొంచెముగాపీల్చి కాని చప్పరించి కాని త్రాగినయెడల, పా
లు సులభముగా జీర్ణమగును, అట్లు త్రాగనిచో జీర్ణము కావు. స్వభావసిద్ధ
ముగా పాలు జీర్ణమగుట కష్టమైనప్పుడు, అవిమాంసముతోఁ బుచ్చు
కొన్నప్పుడు మఱియు అజీర్ణకరమగును; కావున మాంసము పాలును
ఒక్కసారి యేపుచ్చుకొనఁగూడదని యూదులకు కట్టుపాటు చేసినారు.

పొడిచిపొడిచి శిశువును అమితముగా పాలు త్రాగించు పరమా
వివేకురాలగు తల్లి, కొలఁదికాలములోనే, తనయనుఁగుబిడ్డ యొక్క బ్ర
తుకు ఆశ లేదని బొమ్మగొట్టుకొని యేడువవలసివచ్చును. ప్రామాణి
కులగుప్రస్తుతవైద్యశాస్త్రవేత్తలు, పడుచువాఁడైనను ఒకతవ్వెఁడుపాలు
పుచ్చుకొనవలయుననియు అవికూడ కొంచెము కొంచెముగా, సాధ్యమై
నంతసావకాశముగాఁ, బుచ్చుకొనవలయు ననియుఁ జెప్పెదరు. చంటి
పిల్లలకు 'పాలబుడ్ల' తో పాలుకుడిపించుట మంచిది. మన దేశములో
తల్లులు గృహకృత్యములలో మునిఁగియుందురు, ఇఁకపాడి యేడుచు
చున్న శిశువును తొడమీఁదఁ బెట్టుకొని, తఱచుమోఁకాలితో అదఁచి
పట్టి, తానెన్నిపాలు మ్రింగింపఁగలదో అన్నిపాలు చిట్టిగరిఁటెతోఁబో
సి శిశువుచే బలవంతముగా మ్రింగించును. దానివలని ఫలమేమనఁగా-
కారిజము పాడయి అజీర్ణవ్యాధి పట్టుకొని శిశువును ఎదుగనీయదు, ఆ
పాలే ప్రాణహానికరముగాఁ బరిణమించును; ఈయాహారోపద్రవమున
కాఁటిగండముగడచి నిలుచుటకుఁ జాలిన ఆయుర్బలముగల బిడ్డలే వీ
ర్యవంతులై పెరిఁగి పెద్దవారగుదురు. కృతయుగమునాఁటి మన పురిటిపిం
డ్లవాలకము, పుట్టినబిడ్డకు పెట్టుకాఁపుళ్లు, మున్నగు ఉపచారములు

—వీనిఁగూర్చి కొంచెమాలోచింపుఁడు. ఈబాధలన్నియుఁబడి తల్లి యు బిడ్డయు ఈవలఁబడి బ్రితికి మఱల బలారోగ్యములు సంపాదించు కొనఁగలుగుట యత్యాశ్చర్యకరమును కేవల భగవదనుగ్రహసూచక మునుగాదా !

వస్త్రధారణములో నాగరకత.

ప్రతి దేశములోను, మనుష్యుని కిచ్చుగౌరవము, కొంతవఱకు అతఁడు ధరించుదుస్తులనుబట్టి యుండును. "రాబడి తెలిసినఁగాని పెద్ద మనుష్యుఁ డెవఁడో అధమజాతివాఁ డెవఁడో యెట్లు చెప్పఁగలము ?" అని మన వంగదేశములోని జానపదులు వారి గ్రామ్యభాషలో చెప్పు దురు. అంతేకాదు—దుస్తులెట్లు వేసికొనునో చూచినఁగాని పెద్దమ నుష్యుఁడగునో కాఁడోయెట్లు చెప్పఁగలము ?—అనికూడఁ జెప్పనగు ను; ఈవిషయమున ఇంచుమించుగా ప్రపంచమంతయును ఒక్కతీరు గానే యున్నది. బంగాళములో పెద్దమనుష్యులెవ్వరును ఒక్కమొల బట్టతో వీథులలో నడవలేరు. హిందూదేశములోని కొన్నియితరభాగ ములలో తలపాగా పెట్టుకొనకుండ నెవ్వఁడును ఇల్లుదాఁటిపోఁడు. పశ్చిమఖండములో మొట్టమొదటనుండియును ఇట్టివిషయములలో ఫ్రెంచివారు మార్గదర్శకులు—వారెట్లు తిందురో యితరు లట్లుతిందురు, వారెట్టిబట్టలు ధరింతురో యితరు లట్టిబట్టలు కట్టుదురు. యూరప్పు లోని వివిధదేశములవారికి ప్రత్యేకముగా వారివారి వస్త్రములును వస్త్రధారణపద్ధతులును ఉన్నను, ఇప్పటికిని అధికధనమార్జించి "పెద్ద మనుష్యుఁ"డైనవాఁడు వెంటనేస్వదేశవస్త్రపద్ధతులను విసర్జించి వానికి మాఱుగా ఫ్రెంచిపద్ధతుల నవలంబించును. డచ్చి కృషీవలులు సహజ ముగా ధరించు దుస్తులు దాదాపుగా కాబూలుదేశస్థులు ధరించు "పైజామా"లను బోలియుండును, గ్రీకులు చీలమండలవఱకు జీరాడు నిండైనఅంగీలు తొడుగుదురు, ఇంచుమించుగా టిబెట్టువారివలెనే ర ష్యాదేశస్థులు దుస్తులువేసికొందురు,—కాని వీరందఱు "నాగరకులు ను, పెద్దమనుష్యులును" అయిన తత్క్షణమే ఫ్రెంచికోట్లును ఇజార్లును తొడుగుకొందురు. ఇఁక స్త్రీలమాట చెప్పనేయక్కఱలేదు, వారు ధన

వంతులైన వెంటనే తమదుస్తులు ఏతంటాలోపడి పారిసు పట్టణములో చేయించి తెప్పించక తీఱదు. పశ్చిమ దేశములలో అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ—ఇవి మహా ధనవంతములైన దేశములు; ఇందలి జనులందఱును ఫ్రెంచివస్త్రధారణపద్ధతులనే యనుకరింతురు. ఈపద్ధతులు క్రమక్రమముగా యూరప్పులోని ప్రతిభాగమునకుం బ్రాకి యట దృఢముగా నాటుకొనుచున్నవి. యూరప్పంతయును ఫ్రాన్సుయొక్క ప్రతిబింబముగాం గాన్పించును. అయినను ఇప్పుడిప్పుడు పురుషులదుస్తులు పారిసులోకంటె లండనులో బాగుగాం జేయుచున్నారు, కావున మగవాండ్రు వారిదుస్తులు లండనుమాదిరిగా కుట్టించుకొందురు; స్త్రీలు పారిసు సంప్రదాయానుసారముగా వారిదుస్తులను కుట్టించుకొందురు. మహాధనవంతులైనవారు వారిదుస్తులను ఈ రెండుచోట్లనుండియుం దెప్పించుకొందురు. విదేశపుదుస్తులపై అమెరికావారు విశేషముగా దిగుమతిపన్ను వేయుచున్నప్పటికిని, ఆ దేశపుస్త్రీలు వారిదుస్తులను లండను పారిసులనుండి తెప్పించుకొనక మానరు. అమెరికావా రొక్కరే యట్లు చేయంగలరుగాని మఱెవరు చేయంగలరు? ధనముతో నిండి అమెరికాయిప్పుడు కుబేరుని అలకాపట్టణమైనది.

ప్రాచీనులైన ఆర్యులు అంతరీయోత్తరీయములు (దోవతియు, కండువాయును—కట్టుబట్టయు పైబట్టయును) ధరించెడువారు. క్షత్రియులు యుద్ధకాలమున పరాయినిలువుటంగీలు వేసికొనెడువారు, ఇతరసమయములందు దోవతి కండువాలుమాత్రమే వేసికొనెడువారు, తలపాగాకూడ చుట్టుకొని పెట్టుకొనెడువారు. వంగములోందప్ప నితర హిందూదేశమందంతటను ఈయాచారమే యిప్పటికిని గాన్పించుచున్నది. క్రిందిదుస్తులంగూర్చి యంతజాగ్రత్త లేకపోయినను తలకుమాత్రము పాగాయుండకతప్పదు; పూర్వకాలములో అదియే స్త్రీలకును పురుషులకునుగూడ ఆచారము. బౌద్ధులనాండు చెక్కిన శిలావిగ్రహములలో స్త్రీలును పురుషులునుగూడ కౌపీనముమాత్రమే ధరించినట్లు కాన్పించుచున్నది. బుద్ధదేవునితండ్రి రాజు, అయినను ఆయన అట్టిదుస్తుతోనే సింహాసనముపైం గూరుచుండినట్లు కొన్ని విగ్రహములలో ను

న్నది. అట్లే బుద్ధదేవుని తల్లియు నున్నది, కాని యామెకు మాత్రము కాళ్లకును చేతులకును అలంకారములుకూడ నున్నవి—అందఱకును శిరోవేష్టములున్నవి. బౌద్ధచక్రవర్తియగు ధర్మాశోకుని విగ్రహమందతఁడు మృదంగాకారముగనున్న పీఠముపైఁగూరుచుండి, దోవతికట్టుకొని, కండువాకంఠముచుట్టువేసికొని, యెదుట జరుగుచున్న బోగమాట చూచుచున్నట్లున్నది; ఆగణికలకుకూడ కౌనులనుండి క్రిందికి వ్రేలాడుచున్న పొట్టిగుడ్డలుతక్క విశేషముగా దుస్తులేమియు లేవు—కాని ప్రత్యేకముగా స్ఫుటముగా పాగామాత్రము కానిపించుచున్నది, దుస్తులలో ముఖ్యమైనది అది. ఆసభకువచ్చిన పెద్ద రాజకీయోద్యోగులు మాత్రము మంచి యిజారులును నిలువుటంగీలును వేసికొనియున్నారు. నలమహారాజు ప్రచ్ఛన్నుఁడై ఋతుపర్ణుఁడను రాజు కొలువున సారథిగానుండి యొకనాఁడు వాయువేగముతో రథముదోలుచుండెను; అప్పుడు ఋతుపర్ణుని యుత్తరీయము క్రిందఁబడెను; వెనుకకుఁ జూచునంతలో రథము విశేషదూర మేగుటచే దిగి యా యుత్తరీయమును మఱలఁ దెచ్చుకొనుటకు వీలులేకపోయెను. అతఁడుదమయంతీస్వయంవరమునకుఁ జనుచుండెను గాన, ఆలస్యమగునని పైఁబట్టలేకయే పోయియుండవచ్చును. దోవతిగట్టుకొని కండువావేసికొనుట ఆర్యులకు అనాదిగావచ్చుచున్న యాచారము. కనుకనే, మతకర్మాచరణసమయములందు ఇప్పటికిని హిందువులకు దోవతి కండువాలుమాత్రమే వేసికొనుట విహితమై యున్నది.

పూర్వకాలములందు గ్రీకులు రోమనులు దోవతికండువాల వంటిబట్టలే ధరించెడివారు—వెడల్పుగల బట్టయొకటికట్టి అంతకంటె చిన్నదిగానుండు బట్టయొకటి అంగీగా పైని దొడుగుకొనెడువారు. దానిని "టోగా" యనెడువారు, టోగానుండియే చోగా వచ్చియుండవచ్చును. అప్పుడప్పుడు లోపల నొకచొక్కా తొడుగుకొనెడువారు, సమరసమయములందు షరాయియు కోట్లును వేసికొనెడువారు. మంచి పొడుగువెడల్పులుగలిగి చదరముగానుండు వస్త్రమును స్త్రీలు వదులుగాఁబైనితొడుగుకొని ఱొమ్ముక్రిందను నడుముచుట్టును, రెండుచోట్ల

గట్టిగా దానిని బిగించి కట్టుకొనెడువారు. ఆకోక రెండు బట్టచేతులు పొడుగుగా అంటఁగుట్టినట్టుండును. బుజములమీఁదను చేతులపైనిఁ దెఱచుకొనియున్న భాగములను పెద్దగుండుసూదులతో కలియఁగుట్టెడు వారు; హిమాలయోత్తరభాగము లందుండు కొండజాతివారిప్పటికిని అట్టి దుప్పట్లుధరింతురు. ఆకోకపైని నొకకంచువా వేసికొనెడువారు. ఈదుస్తు మిక్కిలి సులభముగాను సుందరముగాను ఉండెడిది.

అతి ప్రాచీనకాలమునుండియు మూర్తిమంతములైన కుట్టుడుదుస్తులు ధరించుచున్నవారు ఈరాను దేశస్థులొక్కరే (పారసీకులు.) అట్టిదుస్తులం కుట్టుకొనుటవారు చీనావారినుండి నేర్చుకొని యుండ వచ్చును. వివిధశరీరభోగవిషయకవస్త్రాది నాగరకతాప్రథమోపదేష్టలు చీనావారు. కురిచీలమీఁదఁ గూరుచుండి, నానావిధోపకరణములతో, మేజామీఁద భోజనపదార్థములు పెట్టుకొని, యెంతకాలమునుండి చీనా వారు భుజించుచున్నారో, కోటు, కుళ్ళాయి, షరాయిమున్నగు సా కారములైన దుస్తులు వారెంతకాలమునుండి వేసికొనుచున్నారో, యెవ రును జెప్పలేరు.

ఈరానుదేశము (పారసీకము) జయించినతోడనే అలెగ్జాండరు తన స్వదేశవస్త్రములగు దోవతియు కంచువాయును వదలిపెట్టి షరా యితొడుగుట మొదలుపెట్టెను. దానిపై గ్రీక్కుసైన్యము కోపించితి రుగఁబడుటకు సిద్ధమయ్యెను. కాని అలెగ్జాండ రొకరికి లొంగువాఁడు కాఁడు గనుక, కేవల స్వాధికారబలముచే షరాయికోటు వేసికొనుట యొకగొప్ప వస్త్రమర్యాదగాఁ జేసెను.

ఉష్ణదేశములలో బట్టలయావశ్యకత ప్రజల కంతగాఁ గానిపిం పదు. మానగోపనముకై యొక్క కౌపీనము చాలును; అన్యములైన దుస్తులన్నియును విశేషముగా అలంకారములుగానేయుపయోగపడును. శీతలదేశములందు జను, లనాగరకదశలో నున్నప్పుడు, అనివార్యము గా జంతుచర్మములు గప్పుకొందురు; వారేక్రమముగా నాగరకులయి తొలుత కంబళులును పిదప షరాయికోటు మున్నగు సాకారములగు కుట్టుడుబట్టలును ఉపయోగపఱుచుకొనుట నేర్చుకొందురు. ఉత్తరయొ

డలిమీఁద నగలుపెట్టుకొని యందముగనుండుట శీతలప్రదేశములలో అసాధ్యము; అట్లుచేయువారు శైత్యముచే మిక్కిలి బాధపడుదురు; కావున అట్టిదేశములవారు తొడవులపై వలపుదుస్తులసొగసు మీఁదికి మార్చితీర్చుకొందురు. మన హిందూదేశములో నగలసొగసెట్లు తఱచు మాఱుచుండునో పశ్చిమదేశములందు వస్త్రధారణవిలాసములు క్షణక్షణమట్లు మాఱుచుండును.

కావుననే, చలిదేశములలో ఆపాదశిరఃపర్యంతము బట్టలుతొడుగుకొనికాని యెవరును ఇతరులయెదుటఁ బడఁగూడదనునది యొకనియమము. లండనులో మర్యాదగల పురుషులుగాని స్త్రీలుగాని సంఘనియమానుసారముగా శరీరమున దుస్తులువేసికొనినఁ దక్క ఇల్లువదలి పైకి రాఁజాలరు. పాశ్చాత్యులలో, స్త్రీలు పరులయెదుట పాదములు పైకగపడనిచ్చుట యమర్యాదాకృత్యము, కాని నృత్యావసరమున ముఖము, భుజములు, శరీరోర్ధ్వభాగమును బయలుపఱుచుటయను చితముగాదు. మన దేశములో స్త్రీ, ముఖముపైకిఁ గనఁబఱుచుట మిక్కిలి లజ్జాకరము, (అందుచేతనే అవగుంఠనధారణకఠిననియమము వచ్చినది) కాని పాదము లగపఱుచుట కానిపనిగాదు. రాజపుత్రస్థానములోను హిమవత్పర్వతప్రదేశములలోను నడుముదక్క ఒడలంతయుఁ గప్పివేసికొందురు.

పశ్చిమదేశములలో పణ్యాంగనలును నర్తకురాండ్రును పురుషుల నాకర్షించుటకై పలుచనిదుస్తులు వేసికొందురు. వారిలో నాట్యమనఁగా, సామాన్యముగా, సంగీతమునకు సరిపడునట్లు చిందులు ద్రొక్కుచు ఆంగికాభినయముతో అవయవప్రకాశనముచేయుటయే. మన దేశములో సత్కులీనలైన సంసారస్త్రీలు సంపూర్ణముగా శరీరాచ్ఛాదనము గావించుట కంతగాఁజూడరు; కాని వేశ్యలు దేహమంతయుఁ గప్పుకొందురు. పశ్చిమఖండవాసినులు పగలంతయుఁ బూర్ణమైన దుస్తులతోనుందురు, కావున అల్పవస్త్రధారణములో ఆకర్షణశక్తి యెక్కువగానుండును. మన సంసారస్త్రీలు సాధారణముగా నెప్పుడును ఇండ్లలోనేయుందురు, ఎప్పుడోకాని సామాన్యముగా వారు విశేషవ

స్త్రధారణము చేయరు; కనుక మనలో అంగపూర్ణాచ్ఛాదనము వలన ఆకర్షణశక్తి యతిశయించును. మలయాళదేశమునఁ స్త్రీలకును పురుషులకునుగూడ కటిప్రదేశము చుట్టుఁ గట్టుబట్టతప్ప మఱియొండుండదు. వంగదేశీయ సంప్రదాయమును దాదాపుగా అట్టియున్నది. పురుషుల యెదుట స్త్రీలు తప్పకుండ మేలుముసుఁగు మొగముమీఁదికి లాగుకొని యొడలు గప్పికొందురు.

చీనా తప్ప తక్కిన సర్వదేశములలోను విపరీతములును దుర్విజ్ఞేయములును అగు మర్యాదావిషయకాభిప్రాయము లనేకములు నాకుఁ గాన్పించినవి——కొన్ని విషయము లతిమాత్రతాదోష యుక్తములై యున్నవి. అసమంజసముగా నగపడు కొన్నిటిలోఁ బ్రజలమనములందు మూలాభిప్రాయ మున్నట్లే కనఁబడదు.

చీనాదేశములో స్త్రీపురుషులందఱును ఎప్పుడు ఆపాదమస్తక పర్యంతము శరీరము దుస్తులతోఁ గప్పికొనియే యుందురు. చీనాప్రజలు కన్ఫ్యూషియస్సు శిష్యులు, బుద్ధమతావలంబులు; వారి సతీప్రవర్తనములు కచ్చితముగను, కడు పరిశుద్ధముగను, గానిపించును, అసభ్యభాషణములాడువానిని, అశ్లీలగ్రంథకర్తను, బూతుబొమ్మలు వేయువానిని, అణుమాత్రమైనను అనుచితగ్రామ్యప్రవర్తన మగపఱచువానిని,—— వెంటనే పట్టుకొని శిక్షింతురు. క్రైస్తవమతబోధకులు బైబిలు గ్రంథమును చీనాభాషలోనికి తర్జుమా చేసిరి. హైందవ పురాణములఁ గొన్నిటి నధఃకరించు వ్రీడాకరములైన ప్రకరణములు కొన్ని బైబిలులో నున్నవి. ఈ యశ్లీలభాగములు చదువుతోడనే చీనావారికి క్రీస్తుమతము మీఁదఁ జాలఁగోపము వచ్చినది; అంతట బైబిలు తమ దేశములో ఎప్పడును వ్యాప్తముగానీయమని వారు గట్టిశపథము చేసికొన్నారు. అంతటితో ఆఁగక, సాయంకాలపు దుస్తులు వేసికొని అరమరలేకుండఁ బురుషులతోఁ గలసిమెలసియుండు క్రీస్తుమతబోధికలు చీనావారికి ఆహ్వానపత్రికలంపఁగా, అమాయకులగు చీనావారందఱు కెంతో యసహ్యపడి——"ఏమి ఘోర మేమి ఘోరము! చదువుటకు బైబిలిచ్చి, మా పడుచుపిల్లలను ఈ యర్థగుప్తాంగలగు మాయలాఁడి మిటారుల వగలకెర

చేసి పాడుచేయుటకు మాకీదిక్కుమాలిన మతమెక్కడనుండి దాపుర మైనది రా బాబు!"—అని దేశమంతయు గగ్గోలుపెట్టినారు. చీనావారికిని క్రైస్తవులకును పడకపోవుటకిదియే కారణము; ద్వేషమేమియు లేకుండ ఇతరమతములను వారు సహనబుద్ధితోఁ జూతురు. ప్రతికూలములైన భాగములు తీసిపాఱవైచి, క్రీస్తుమతోపదేశకులు బైబిలు క్రొత్తగాఁ గూర్చిపిమ్మటఁ బ్రకటించినారఁట, కాని అది, చీనావారు మఱింత యనుమానపడుటకు హేతువైనదిగాని కార్యకారి కాలేదు.

పశ్చిమదేశములలో ఔచితీమర్యాదలఁగూర్చిన యభిప్రాయములు దేశభేదములఁబట్టి భిన్నభిన్నములుగా నుండును. ఆంగ్లేయమర్యాదలును అమెరికనుల మర్యాదలును ఒక్కరీతిగానేయుండును. ఫ్రెంచివారిమర్యాదలు వేఱు, జర్మనుల మర్యాదలు వేఱు. రష్యావారికిని టిబెట్టు వారికిని సమానమైన సంప్రదాయములు చాలఁగానున్నవి. తురుష్కులయాచారములు కేవలము ప్రత్యేకముగానున్నవి. ఇట్లే దేశానుసారముగా ఆచారవ్యవహారములు మాఱుచున్నవి.

ఆ చా ర మ ర్యా ద లు.

యూరప్పువారికిని అమెరికావారికిని మఱుఁగు మనకంటెఎక్కువగా నుండవలెను; దానిని వారత్యావశ్యకముగాఁ జూచుకొందురు. మనము శాకాహారులము, కావున కూరగాయలు మున్నగునవి యిన్ని తిని, ఉష్ణదేశమునం దునికిగలవారమగుటచే నొక్కొక్కసారి యొకటి రెండు పంచపాత్రలచొప్పున నీళ్ళుతఱచు త్రాగుచుందుము. ఉత్తరరాష్ట్రములలో నుండు కాఁపు రెండుపౌండ్లు యవపిష్టముతిని, విశేషదాహ మగుటచే, మాటిమాటికి నూతియొద్దకేగి మంచినీళ్ళు తోడుకొనిత్రాగును. మండువేసఁగిలో మనయిండ్లయెదుట బహిరంగముగా ప్రపలు (చలిపందిళ్ళు) స్థాపించి దగగొన్నవారికి పెదురుబద్దలతో మంచినీళ్ళు పోసి దాహశాంతిగావింతుము. ఈవిధముగాఁ బ్రవర్తించు ప్రజలుచాటునకై చూడరు,చూడఁజాలరు. గోశాలలు గుఱ్ఱపులాయములుఎక్కడ, పులిబోనులు సింహపుబోనులుఎక్కడ? మేఁకకును కుక్కకును సామ్యమెక్కడ? పాశ్చాత్యుల ప్రధానాహారము మాంసము; శీతల ప్రదేశ

ములలోని వారెప్పుడో కాని నీళ్ళే త్రాగరు. గొప్పవారు చిన్నజాగిన్నెలోఁబోసిన ద్రాక్షారసమించుక త్రాగుదురు. ఫ్రెంచివారు మంచినీళ్ళ నసహ్యముగాఁజూతురు. వారిదేశము వేసవిలో మిక్కిలి యుష్ణముగానుండునుగనుక అమెరికనులు మంచినీళ్ళు విశేషముగాఁ బుచ్చుకొందురు. న్యూయార్కు కలకత్తాకంటెను వేఁడిగానుండును. జర్మనులు బీరు సారాయి విశేషముగా త్రాగుదురు కాని భోజనసమయమునందుఁ బుచ్చుకొనరు.

చలిదేశములలో శైత్యము చేపడిసెము సాధారణముగాఁ బట్టునుగాన అక్కడిజనులు తుమ్మకుండ నుండలేరు. అత్యుష్ణమగు మనదేశములో అన్నముతో విశేషముగా జలపానము చేయుదుము గాన త్రేఁపులఁ త్రేనువకుండ మనముండలేము. ఇటమర్యాదాచిత్రి మించుక చిత్తగింపుఁడు! పాశ్చాత్యులు పదిమందికూడి కూరుచున్నచోట త్రేన్పితివేని నీవునిష్కృతిలేని నేరము చేసిన వాఁడవగుదువు, కాని జేబురుమాలు పైకిఁదీసి దానిలోబుఱ్ఱున ముక్కుచీఁదుకొంటివేని వారి కదేమియును అసభ్యకృత్యముగాఁ గానిపింపదు, ఇఁక మనలో అతిథి త్రేన్చి తృప్తినొందినట్లగపడిఁనఁగాని అన్నదాత తృప్తినొందఁడు; అందఱుకలిసి భోజనము చేయుచున్నప్పుడు రెండవపని చేసినచో (జేబురుమాలులో చీఁదినచో) ఏమనుకొందురో తెలియునుగదా!

ఇంగ్లండులోను అమెరికాలోను, నీకజీర్ణబాధ లేమైన నున్నయెడల, వానిఁగూర్చి స్త్రీలయెదుట నెంతమాత్రము ప్రసంగింపఁగూడదు, స్త్రీ వృద్ధురాలైనను నీకు కృతపరిచయురాలైనను అది తప్పుగాదు. ఫ్రెంచివారిట్టి విషయముల నంతగా సరకుసేయరు. జర్మనులు వాని నెంతమాత్రమును లక్ష్యపెట్టరు.

ఆంగ్లేయులును అమెరికనులును స్త్రీలసమ్ముఖమున మాటలాడునపుడు అతిజాగ్రత్తతో మాటలాడుదురు. 'కాలు' అను మాటకూడ నోటినుండి జాఱఁగూడదు. ఫ్రెంచివారు మనవలె నేస్వేచ్ఛగాఁ బ్రసంగింతురు. జర్మనులు రష్యనులు ఎవరియెదుటనైనను సరే మోటుమాటలుగూడ మాటాడుదురు.

వివాహపూర్వము, కన్యావరుల కామసమాచారములు యథేచ్ఛముగా తండ్రులయెదుటను తల్లులయెదుటను తోఁబుట్టువుల యెదుటను దీసికొనివచ్చి ప్రసంగింతురు. కొమారితయొక్క ప్రియుని (కాఁబోవు పెండ్లికొడుకుఁ) గూర్చి తండ్రి యనేకప్రశ్నలు వేసి కూఁతుతోఁ బలువిధములైన పరిహాసవచనములాడును. అట్టియవసరములందు ఫ్రెంచికన్యసిగ్గుచే శిరమువంచుకొనును, ఆంగ్లేయకన్యయు లజ్జపడును, కాని అమెరికాపడుచు అతనిముఖముముందరనే బుద్ధిచమత్కారముతోఁ దిరుగఁజాలునవైన పరిహాసవచనములాడును. చుంబనాలింగనములుకూడ అంతయామోహవశార్హములైన తప్పుపనులుగావు; నలుగురు కలిసికొన్నప్పుడు వానిఁగూర్చి బహిరంగముగాఁ బ్రసంగింపవచ్చును, మనదేశములో పెద్దలగు బంధువులయెదుట అట్టికామవ్యాపార సంబంధములైన మాటలు ప్రకాశముగా ఆడఁగూడదుసరిగదా, సూచనగానైనఁ దేఁ గూడదు.

పాశ్చాత్యులిప్పుడు బహుధనవంతులై యున్నారు. వేసికొను దుస్తు పరిశుభ్రముగాను సరిగా వస్త్రమర్యాద ననుసరించియు నుండినఁగాని యెవనిని పెద్దమనుష్యునిగా నెంచరు, నలుగురలోనికి రానీయరు. పెద్దమనుష్యుఁడనిపించుకొనఁగోరువాఁడు ప్రతిదినము తనగళబంధమును (మెడపట్టీయును) లోపలిచొక్కాయును రెండు మూఁడు మాఱ్లు మార్చుచుండవలెను, దరిద్రులట్లు చేయలేరని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. పైదుస్తులపై మఱకలుండఁగూడదు, ఒక్క ముడుతయైనను గానిపింపఁగూడదు, ఎంత ఉక్కపెట్టుచున్నను చేజోడు వేసికొనియే పైకిఁబోవలెను, అట్లుచేయనిచో వీథులధూళియు మురికియుఁ జేతులపైఁబడును; మురికిచేతులతో కాంతాకరగ్రహణసంచాలనములు గావించుట కడునమర్యాదాకృత్యము. గొప్పవారియెదుట ఉమియువానిఁగాని పుక్కిలించువానిఁగాని పండ్లు కుట్టుకొనువానిఁగాని చండాలునిగాఁ బరిగణించి పరిత్యజింతురు.

సర్గ (సృష్టి) శక్తిని స్త్రీదేవతగా భావింతురుగదా! ఆశక్త్యుపాసనము పాశ్చాత్యులధర్మము. అది మనదేశములో వామాచారులు స్త్రీలఁ బూజించునట్లుండును.

"గీ॥ వామపార్శ్వంబు నందొక్క వామనయన !
కుడిదెసను మదిరాపూర్ణ కుంభ ! మెదుట
వ్యంజనోపేతసుకవోష్ణ వల ! మహో ! యొ
ఱుకపడునె యోగికేనిఁ దాంత్రికమతంబు?"

అని తాంత్రికు లందురు గదా ! సర్వసామాన్యముగా బహిరంగముగా జనులాచరించునది యీశక్తిపూజయే ! దేవతను తల్లిగా భావించి యుపాసించుటయుఁ బెక్కుచోట్లఁ గాన్పించుచున్నది. యూరప్పునందలి మతము రోమన్కాథొలిక్కుమతమనియో చెప్పవచ్చును ; ప్రొటెస్టెంటు మతప్రభావము విశేషముగాఁ గానరాదు. రోమన్కాథొలిక్కుమతములో జిహోవా, జీజస్సు, మూర్తిత్రయము—ఇవన్నియు అప్రధానములు, దివ్వటీముందటిదీపములు సమస్తపూజలనందు నది జీజస్ శిశువును చేతులలోఁ బెట్టుకొనియుండు జనని! చక్రవర్తి, సేనాధిపతి, చేత జెండాపట్టుకొనియుండు సిపాయి, చుక్కానుద్రిప్పి యోడనడిపించు నావికుఁడు, చింపిగుడ్డలు కట్టుకొను జాలరివాఁడు, వీథులలో బికిర మెత్తుకొను బిచ్చగాఁడు—అందఱు అమ్మా ! తల్లీ ! యని ఆక్రందనము చేయుదురు. దివ్యరాజభవనములనుండి, దేవాలయములనుండి, దిక్కుమాలిన గుడిసెలనుండి, శతసహస్రస్థలములనుండి, శతసహస్రకంఠములు, శతసహస్రవిధములుగా—అమ్మా ! తల్లీ ! జననీ !—యని యఱచుచుండును. అహర్నిశము, అన్నిచోట్ల "ఆవెమరీయా"—మేరీమాతకు మంగళము, మేరీతల్లికి నమస్కారము—అను శుభధ్వానము లే శ్రోత్రములఁ బడును.

తరువాతిది కాంతారాధానము. పైనిజెప్పిన శక్తిపూజ కామవ్యామోహకృత్యముగాదు. కాశి, కాళీఘట్టము, మున్నగుపుణ్యస్థలములందు మనవారు గావించు కుమారీభర్తృమతీపూజలు (కన్యాపూజయును మగఁడు బ్రతికియున్న సాధ్వియొక్క పూజయును) ఎట్టివో అదియును అట్టిదే. అది వట్టిభావనారూపమైన మానసికారాధనము గాదు. కేవలప్రత్యక్షప్రతిమార్చన, మన శక్తిపూజ కొన్ని పవిత్రస్థలములందును కొన్ని కాలములందును మాత్రమే జరుగునుగాని, వారిశక్తిపూజ

సర్వత్ర సర్వదా రోజులకొలంది, వారములకొలంది, ఏండ్లకొలంది జరుగును. స్త్రీలస్థితి—వారి దుస్తులు, ఉచితాసనములు, భోజనము, వారి సుఖములు, వాంఛితములు—ముఖ్యముగా నెంచుకొందురు ; సమస్త విషయములందును స్త్రీకి అగ్రస్థానమిచ్చి ఆమెను గౌరవింతురు. అభిజాతలనియే కాదు, యువతులును సుందరులును అనియే కాదు, స్త్రీజాతి వారినందఱను—పరిచితలైనను సరే, అపరిచితలైనను సరే—ప్రజలు పూజింతురు. మహామ్మదీయమతస్థులును, అరబ్బీమిశ్రజాతివారును అగు "మూరులు" స్పెయినుదేశము జయించి దానిని ఎనిమిదివందల సంవత్సరములు పరిపాలించినారు; అప్పుడు వారీపాశ్చాత్యనాగరకతా బీజములును, ఈ శక్తిపూజాబీజములును ప్రప్రథమమున యూరప్పులో నాటినారు. కాలక్రమమున ఈ శక్తిపూజ మఱచినందువలన, మూరులు స్వకీయ యశోవిద్యానాగరకతాప్రభావోన్నతపదభ్రష్టులై చెల్లాచెదరయిపోయి ఆఫ్రికాలో ఎవ్వరు నెఱుఁగని యొక మూలనుండుట తటస్థించినది; వారి నాగరకతాబలములుపోయి యూరప్పువారిలో సంక్రమించినవి. జగన్మాత మూరులనువదలి ప్రేమరసభరితములగు తన దరహాసములను క్రైస్తవులపైఁ బ్రసరింపఁజేసి, వారి నాశీర్వదించి, వారిగృహములను తన దయాచంద్రికలచే శోభిల్లఁజేసినది.

ఫ్రాన్సు—పారిస్సు.

ఈ యూరప్పనఁగా నేది ? ఏషియా ఆఫ్రికా అమెరికాలలో నుండు ప్రజలు—నల్లవారు, గోధుమరంగు చామనచాయవారు, పసుపుపచ్చనివారు, ఎఱ్ఱరంగువారు—వీరందఱు వారికి వినమ్రులై పాదాక్రాంతులై యేలపడియున్నారు ? ఈ కలియుగములో వారే అద్వితీయమును అప్రతిఘటమును అయిన యధికార మేలచలాయించుచున్నారు ? పాశ్చాత్యౌన్నత్యమున కంతకును ఆదికారణమైన ఫ్రాన్సును తెలిసికొని తద్ద్వారమున యూరప్పు తెలిసికొనవలెను. జగత్తునేలు సర్వాధికారి యూరప్పుఖండము, అట్టి యూరప్పుఖండములో పారిస్సు ప్రధానస్థానము. ఈపారిస్సే, సమస్తపాశ్చాత్యనాగరకతకును జన్మభూమి, కేంద్రస్థానము. పాశ్చాత్యనీతిసంబంధమైనదికాని పాశ్చాత్యాచారసంబం

ధమైనది కాని ప్రత్యభిప్రాయమును—మంచిదైనను సరే, చెడ్డదైనను సరే, జ్ఞానతేజస్సంభవమైనను సరే, అజ్ఞానాంధకారభవమైనను సరే—పారిస్సులో ప్రభవించి పరిపాకదశకు వచ్చుచున్నది. ఈ పారిస్పట్టనము మహాసముద్రము—అందు ముత్తెములు పగడములు మున్నగు ననేకా మూల్యరత్నములును ఉండును, నక్రగ్రాహాదిక్రూరవారిచరములును ఉండును. యూరప్పున కంతకును ఫ్రాన్సుదేశము, క్రియాకేంద్రస్థానము—కర్మక్షేత్రము. దేశము చిన్నదైనను మహా మనోహరముగా నుండును ; అంత శీతలముగాను ఉండదు, అంత యుష్ణముగాను ఉండదు ; భూమి యతిసారవంతము ; గాలి అంత చెమ్మగాను ఉండదు, శీతలము పొడిగాను ఉండదు; ఆకాశము నిర్మలముగా నుండును, సూర్యకాంతి చూచుటకు సుందరముగా నుండును. ఓకు చెట్లు ఎల్మ్ చెట్లు పుష్కలముగాఁ గానిపించును; పచ్చికబయళ్లు పరమసుందరముగా నుండును ; నదీపర్వతములు చిన్నవి ; కొలములు వాగులు చిత్తాహ్లాదకరములు. చీనాలోని కొన్ని ప్రదేశములు తప్ప ఫ్రాన్సువంటి సుందరమైన దేశము మఱియొక్కటి ప్రపంచములో నే నెక్కడను జూడలేదు. నీటిపైని ఏమి సౌందర్యకళాప్రసారము ! భూప్రదేశము లెంత చిత్తాకర్షకములు ! గాలి యెంత యానందోన్మాదజనకము ! ఆకాశ మెంత యానందపారవశ్యోత్పాదకము ! అచ్చటి సృష్టినైసర్గికరామణీయక మెంత చిత్తరంజకము! ఆహా! అచటి జను లెట్టిసౌందర్యానందపరాయణులు! అచ్చటి ధనికులు దరిద్రులు, యువకులు వృద్ధులు, వారివారి యిండ్లు గదులు, వీధులు, పొలములు, ఉద్యానవనములు, ఆరామమార్గములు, ఎంత యలంక్రియా నైపుణ్యముతో ఎంత శుభ్రముగా ఎంత సుందరముగా ఉంచుకొందురు! ఇంతయేల? దేశమంతయు దివ్యముగాఁ జిత్రింపఁబడిన యొక చిత్తరువువలెఁ గానిపించును. జపాను దేశమునందుఁ దక్కనట్టి ప్రకృతిసౌందర్యానుభవాభిలాషయుఁ గళానిపుణతయు నే నెక్కడను జూడలేదు. దివ్యభవనములందు, నందనవనములఁబోలు వనములందు, తోఁటలందు, దొడ్డులందు, పంటపొలములందు—అన్నిచోట్లను, అన్నిటియందును వారి సౌందర్యాపాదనప్రయత్నములును, కళాలంక్రి

యూరప్రయత్నము లును విస్ఫుటముగాఁ గానిపించును ; ఆ ప్రయత్నములు సఫలతఁ గూడఁ జెందును.

ఆదినుండియు ఫ్రాన్సు దేశము — గాలులకు, రోమనులకు, ఫ్రాంకులకు, ఇతరజాతులకు — రణరంగమై యున్నది. రోమనురాష్ట్రము నశించినతరువాత ఫ్రాంకులు యూరప్పుపై నిరంకుశాధికారమును సంపాదించినారు. వారిప్రభువైన షార్లమేనుగారు ఖడ్గబలముచే క్రైస్తవమతమును యూరప్పులోఁ బ్రవేశపెట్టినారు ఈ ఫ్రాంకులవలననే యూరప్పు సంగతి ఏషియాలోఁ దెలిసినది. ఇప్పటికిని మనము యూరపియనులను ఫరంగులనుచున్నాము.

పాశ్చాత్యనాగరతాప్రవాహమునకుఁ బ్రథమోత్పత్తిస్థానమగు ప్రాచీనగ్రీసుదేశము తన యత్యుచ్ఛదశనుండి యధఃపతితమై యుక్కాడు విస్మృతావస్థలోఁబడిపోయినది; కిరాతజాతులువచ్చి పైఁబడుటచే మహావిపులమైన రోమనురాజ్యము ముక్కముక్కలై పోయినది ; యూరప్పు అంధకారమగ్నమైనది. అట్టి యవసరమున నంతవఱకును అప్రసిద్ధులై ఏషియాలోనుండు అరబ్బీలను అనాగరజాతివారు బయలుదేఱినారు. ఈ యరబ్బీ ఉప్పెన ప్రపంచముపైఁబడి యందలి నానాభాగములం దతిశీఘ్రముగా వ్యాపించినది. బలశాలులగు పారసీకులు అరబ్బీలకు పాదాక్రాంతులై మహమ్మదీయమతముగైకొనవలసివచ్చినది; దానివలన ముసల్మానుమతముకూడ క్రొత్తరూపము నొందినది; అరబ్బీలమతమును పారసీకుల నాగరకతయును గలిసియేకమైనవి.

అరబ్బీల చేతికత్తి సాహాయ్యమున, పారసీకనాగరకత ప్రబలి నల్దెసలను వ్యాపించినది. ఆపారసీకనాగరకత ప్రాచీనగ్రీసునుండియును ప్రాచీనహిందూదేశమునుండియును గొని తేఁబడినది. ప్రాక్పశ్చిమముల నుండి ముసల్మానుసేనలు తెరలు తెరలుగావచ్చి యూరప్పుమీఁద అప్రతిహతాటోపప్రతాపములతోఁ బడినవి, నాగరకతాజ్ఞానతేజస్సుకూడ వానితో వచ్చి, మృగప్రాయులైయున్న యూరపియనుల అజ్ఞానమూఢతానిబిడాంధకారమును విరియఁగొట్ట మొదలుపెట్టినది. ప్రాఁతగ్రీసుసంబంధమైనవిజ్ఞానము, విద్యలు, కళలు, ఇటలీలోఁ బ్రవేశించి, వసుప్రా

యులగు జనుల వశులఁ జేసికొని, ప్రపంచమునకంతకుఁ బ్రధానపట్టనమై నను శవసదృశముగానున్న రోమునగరమునకు జీవనాడి తిరుగరప్పించుటలో సంజీవనౌషధములుగాఁ బనిచేసినవి. మఱలవచ్చిన యీప్రాణ నాడి, ఫ్లోరెన్సుపట్టనములో మహాబలవత్తరముగాఁ గొట్టుకొనినది—ప్రాఁతబహుగుణఇటలీనవీనజీవలక్షణము లగపఱచుటకుఁ బ్రారంభించి నది. దీనినే విద్యాపునరుజ్జీవనమందురు ఇది యిటలీకిమాత్రమే పున ర్జన్మముగాని తక్కిన యూరప్పునకంతకును తొలిపుట్టుకయే. అక్బరు, జహాంగీరు, షాజహానుమున్నగు మొగలుచక్రవర్తులు హిందూదేశము లో వారిప్రబలరాజ్యమును స్థిరముగాస్థాపించినప్పుడు—అనఁగా క్రీస్తు శకము పదియాఱవశతాబ్దిలో—యూరప్పుజన్మించినదని చెప్పవచ్చును.

ఈ విద్యాపునరుద్ధారసమయాహ్వానమునకు ముసలి యిటలీ లేచి 'ఊ' అని యుత్తరమిచ్చి, ఆవలిప్రక్కకుఁదిరిగి మఱల గుఱకపెట్టి గాఢనిద్రపోయినది. అనేక కారణములచే ఆతఱిని హిందూదేశమునకుఁ గూడఁ గొంచెము కదలిక కలిగినది. అక్బరుపరిపాలనము మొదలు కొని మూఁడుతరములవఱకు హిందూదేశములో విద్యాజ్ఞానకళలు వి శేషగౌరవము నందెను; కాని హిందూజాతికూడ మిక్కిలి ప్రాచీనమైనజాతి ; కావున అదికూడ ఏకారణముననో ఇటలీవలెనే మఱల గాఢ నిద్రలోఁ బడిపోయినది.

యూరప్పుఖండములో ఇటలీలోని యీజ్ఞానపునరుజ్జీవనము దోర్బణము, నవయువబలవజ్జాతివారగు ఫ్రాంకులను గట్టిగాఁ దాఁకి నది. అన్నిచోట్లనుండియువచ్చి యీనాగరకతాప్రవాహము ఫ్లోరెన్సు పట్టనములోఁ గలసికొని క్రొత్తరూపముఁదాల్చినది, కానిదుర్బలమైన యిటలీకి యంత యుద్దండనవీనజ్ఞాన తేజస్సు గ్రహించి భరించుటకుఁ జాలిన యంతశ్శక్తి లేకపోయెను హిందూదేశమువలెనే పునః ప్రాణోపేతమైన యీ విద్యాతరంగమంతటితో అక్కడనే యడఁగి యంతరించిపోవలసినదే, కాని యూరప్పు చేసికొన్న పుణ్యముచేత, క్రొత్తఫ్రాంకుజాతివారు పరమోత్సాహముతో ఆశక్తిప్రవాహము నందుకొని, తరుణరక్తబలదర్పసాహసములచే దమ జాతియనాకారా

జపమును దానిపైఁబడవేసి ప్రయాణము చేయుంచిరి ; అంతట క్రమక్రమముగా ఆయభివృద్ధిప్రవాహము బలవిస్తృతులలో బలిసి బహుముఖమై పాఱఁజొచ్చినది. యూరప్పులోని యితరజాతులవారు క్రొత్తక్రొత్తకాలువలు త్రవ్వకొని ఆయుష్పోషకమైన ప్రవాహజీవనమును అత్యభిలాషతోఁ దమతమ దేశములకుఁ గొంపోయి తమ జాతీయజీవశోణితముకూడ నందుఁగలిపి దాని వేగపరిమాణములు మఱింత హెచ్చుచేసిరి. ఆమహాతరంగము అదను కుదిరినప్పుడు హిందూదేశతీరములపైఁబడి, జపానుతీరమువఱకు వ్యాపించినది; ఆపెట్టులోఁ గ్రుంకి జపాను పునర్జీవితమైనది ; ఏష్యాలో అభినవశక్తి నార్జించుకొన్న జాతి జపానుజాతి.

గంగకు గోముఖియుత్పత్తిస్థానమైనట్లు యూరప్పు నాగరకతకంతకు పారిసు జన్మస్థానము. ఈ బ్రహ్మాండమైన ప్రధానపట్టనము చూచుటకు భూలోకస్వర్గముగా నుండును, ఎప్పుడు కలకలలాడుచుండును—సదానందనగరి. అక్కడి భోగములు, అక్కడి మహోత్సవములు, అక్కడి యుల్లాసములు లండనులోఁగాని బర్లినులోఁగాని మఱెక్కడఁగాని లేవు. లండనులోను న్యూయార్కులోను కావలసినంతధనమున్నదను మాట నిజమే, బర్లినులో విద్యావివేకములున్నవి, కాని ఆఫ్రెంచిభూమియందును ఆఫ్రెంచివారి నైసర్గికప్రకృతియందు ఎచ్చటను గానరావు. ఇతరస్థలములందుఁ బుష్కలమైన ధనముండిన నుండుఁగాక! పెద్దవిద్యాభిజ్ఞానములుండిన నుండుఁగాక ! ప్రకృతిరామణీయక మున్నను నుండుఁగాక ! ఏఁడి ? ఆమనుష్యుఁడేఁడి ? అద్భుతస్వభావముగల ఫ్రెంచివారు ప్రాచీనగ్రీక్కుల యవతారములు, పూర్వగ్రీక్కులుమరణించి మఱల ఫ్రెంచివారుగా జన్మించినారని చెప్పవచ్చును—నిత్యానందోత్సాహభరితచిత్తులు, కిలకిలలాడుచు కుఱ్ఱతనపుఁజేఁతలు చేయుదురు. కాని యేపనిచేయవలసివచ్చినప్పుడైనను సరే, దృఢనిశ్చయులై యభినివేశముతోఁ దత్కార్యనిర్వాహమునకు సంసిద్ధులై యుందురు. విఘ్ననిరోధము లెంతమాత్రము తటస్థించినను వెంటనే యధైర్యపడుదురు ; కాని యా యధైర్యము ఆయొక్కక్షణమునసే యుం

డును. తరువాతిక్షణమున ముఖములు మఱల నూత్నాశావిశ్వాసకాంతులతోఁ బ్రకాశించుచుండును—ఫ్రెంచివారి ప్రకృతి యిట్టిది.

యూరప్పునందలి విశ్వవిద్యాలయములన్నిటికి పారిసు విశ్వవిద్యాలయము మేలుబంతి. ప్రపంచములోని ప్రకృతిశాస్త్రసంఘములన్నియును ఫ్రెంచిప్రకృతిశాస్త్రసంఘమునకనుకరణములు. వలసపోయి పరదేశములలో రాజ్యస్థాపనముచేయుటకు, పారిసు ప్రథమోపదేశకురాలు. అన్నిభాషలలోను వాడుకొను సంగ్రామకళాసంబంధమైనపదములు ఇప్పటికిని విశేషముగా ఫ్రెంచిపదములు. ఫ్రెంచిగ్రంథముల శైలీశయ్యాసరణులు సమస్తమైన యూరపియనుభాషలవారును అనుకరించుచున్నారు. సర్వప్రకృతిశాస్త్రములకు సర్వతత్త్వశాస్త్రములకు సమస్తకళలకు పారిసు పుట్టినిల్లు, జ్ఞానరత్నములగని. ఫ్రెంచివారు నగరవాసులైనట్లు, వారితోఁ బోల్చినప్పుడు ఇతరజాతులందఱు పల్లెయూళ్లవాండ్రైనట్లు, సర్వత్ర సర్వవిషయములందు జరుగుచుండు ఫ్రెంచిపద్ధతుల యనుకరణమే చాటుచున్నది. శాస్త్రములందుఁగాని కళలందుఁగాని సాంఘికవిషయములందుఁగాని మొదటఁ గ్రొత్తత్రోవలు త్రొక్కువారెప్పుడును ఫ్రెంచివారు. తరువాత ఇరువదియైదేండ్లకో నేఁబది సంవత్సరములకో జర్మనులును,ఆంగ్లేయులును తదితరజాతివారును వానిననుకరింతురు. ఇట్టిఫ్రెంచినాగరకత స్కాట్లండులోఁ బ్రవేశించినది. స్కాట్లండురాజు ఇంగ్లండు ప్రభువుకూడ నైనప్పుడు,యీ ఫ్రెంచినాగరకతలేచి ఇంగ్లండు ప్రజలలో నొక నూత్న ప్రబోధము కలిగించినది. స్కాట్లండు సంబంధులైన యీష్ట్యూఅర్టువంశపు రాజులపరిపాలనమందే యింగ్లండులో రాజపరిషత్తు (రోయల్సొసైటీ) మున్నగు విద్యాసంఘములు స్థాపింపఁబడినవి.

ఫ్రాన్సుదేశము స్వతంత్రతకు నివాసస్థానము. పారిసుపట్టనము నుండి ప్రజాశక్తి బ్రహ్మాండముగాఁ బ్రబలి బయలుదేఱివెళ్ళి యూరప్పును పునాదులంటఁగదల్చి గజగజలాడించినది. అప్పటినుండియు యూరప్పు వర్చస్సుపూర్తిగామాఱి క్రొత్తయూరప్పును జేసినది. "స్వతంత్రతా సమానతా సహోదరభావములు" అనుమాటకిప్పుడు ఫ్రా

ముస్సులో వినరావు. ఇప్పుడు ఫ్రాన్సుయొక్క యభిప్రాయప్రయోజనములన్యములై యున్నవి; ఫ్రాన్సులో జరిగిన సమూలపరివర్తనపు సంకల్పములు ఇంకను యూరప్పులోని యితరజాతులలోఁ బనిచేయుచున్నవి.

"పారిసుపట్టనము ప్రపంచముయొక్క కేంద్రస్థానము. ఏజాతి జాతీయజీవనాభివృద్ధియైనను పారిసుపట్టనముతో అది స్థిరముగాఁ గలుగఁ జేసికొనఁగలుగు సంబంధముఁబట్టి యుండును." అని మొన్న మొన్న నేయొకానొక ప్రసిద్ధాంగ్లేయప్రకృతిశాస్త్రవేత్త నాతోఁ జెప్పినాఁడు. అది కొంచె మతిశయోక్తియైనప్పటికిని, యెవరేని ప్రపంచమున కొకక్రొత్తయభిప్రాయము వ్యక్తపఱుపఁదలచుకొనునెడల, దానిని వ్యాపింపఁజేయుటకుఁ దగినస్థానమల్ల పారిసుపట్టనమే యన్నమాటమాత్రము నిర్వివాదాంశము. ఎవరుచెప్పిన దానినైనను పారిసుపట్టనప్రజలలు యూఁపి మంచిదనినయెడల, శేషించిన యూరప్పంతయును తప్పకుండ ఆవాక్కులే ప్రతిధ్వానముచేయును. శిల్పకారుఁడు గానిండు, చిత్రకారుఁడు కానిండు, గాయకుఁడు గానిండు, నర్తకుఁడు గానిండు, అన్యకళానిపుణుఁ డెవఁడైనఁగానిండు—తొల్తొల్త పారిసులో పేరుసంపాదించుకొనఁగలిగెనేని, యితరదేశములలో ప్రఖ్యాతిసమ్మానములు వడయుట అతిసులభము.

పారిస్సు పరమ ఘోరమైన పట్టనమనియు, భూలోక నరకమనియు—దానిదోషములఁ బ్రకటించు వాక్యములే మనదేశములో వినుచున్నాము. ఇది కొంద ఱాంగ్లేయుల యభిప్రాయము. ఇతరదేశస్థులగు విత్తవంతులదృష్టిని విషయానందములుతప్ప ఇహలోక జీవనమందన్యానందములు సాధ్యములుగావు గాన, అట్టివారికి పారిసు దుర్నీతికి దుర్భోగములకు ఉనికిపట్టుగాఁ గన్పట్టుట సహజము.

లండను, బర్లిను, వియన్నా, న్యూయార్కు మున్నగు పాశ్చాత్యమహాపట్టనములన్నియును ఆవిషయమున నొక్కతీరుగా నేయుండును. ఉన్న భేదమిది—ఇతర దేశములలో భోగసాధనములు సర్వసామాన్యమైన పామరసాధనములు, నాగరకపట్టనమైనపారిస్సులో పరమానహ్యమైన ముఱికికికూడ బంగారు మొలాము చేయుదురు. ఈవిషయమున,

రసికజనమనోహరములగు పారిసు భోగములను ఇతరపట్టణములందలి గ్రామ్యసుఖములతోఁ బోల్చుట, పీవనవలె పింఛమువిప్పి యాడు నెమిలి నృత్యమును, బురదగుంటలోఁబడి దొర్లుపంది పొరలాటతోఁ బోల్చినట్లేయుండును.

సుఖజీవనము చేయవలయునను సంకల్పము—భోగవాంఛ—యీ ప్రపంచములో ఏజాతికి లేదు ? లేకున్న ధనవంతులైన ప్రజలు అన్ని పట్టణములువదలి పరుగుపరుగున పారిసుపట్టణమున కేల పోవలయును? రాజులును చక్రవర్తులును మారుపేర్లుపెట్టుకొని పారిసునగరమునకు వచ్చి ప్రచ్ఛన్నవేషముతోనుండి యచటిసకలవిధ యానందసాగరావర్తములో హాయిగా స్నానముచేసి యేల సుఖపడుచున్నారు ? అట్టివాంఛలన్ని దేశములవారికి నున్నవి, ఆవాంఛాసిద్ధికై యందఱు యథాశక్తి ప్రయత్నముచేయుదురుగాని ప్రయత్నలోపమించుకైన నుండదు. ఇకనున్న భేదమేమనఁగా—ఫ్రెంచివారి ప్రపంచసుఖానుభవము నొక పరిపూర్ణమైనకళగాఁ గావించుకొన్నారు, ఎట్లుసుఖపడవలెనో వారే యెఱుఁగుదురు, ఐహికానందానుభవని శ్రేణికిఁ బరమావధియగు అత్యున్నతతమ సోపానముమీఁద వారున్నారు.

అయినప్పటికిని, పామరనృత్యవినోదములు విదేశీయులకొఱకే విశేషముగా వినియోగపడుచున్నవి. ఫ్రెంచివారు మహాజాగరూకులైనవారు. నిరర్థకముగా వారెన్నఁడును ధనము వ్యయముచేయరు. అట్టి భోగములన్నియు ఒక్క భోజనముతో ధనవంతుని దరిద్రునిగావించి పాడుచేయఁగల విందులిడు అమితవ్యయకారకములగు భోజనభవనములు—వివేకములేని విదేశవిత్తవంతునకే కాని యితరులకుఁగావు. ఫ్రెంచివారు రసికాగ్రగణ్యులు, వినయసంపన్నులు, మర్యాదావంతులు; వేషభాషాప్రసంగప్రవర్తనములు మిక్కిలి నాజూకుగాను అతిమనోహరముగాను ఉండును; అన్యథ నాకర్షణవిద్యలో అతిప్రవీణులు, డబ్బులాగి లోలోపల నవ్వుకొందురు.

మఱియొక సంగతి మనము జ్ఞప్తిలో నుంచుకొనవలసియున్నది. ఏజాతివారైనను అమెరికనులతోను ఆంగ్లేయులతోను జర్మనులతోను

కలసిమెలసి యుండవచ్చును. వారిసంఘముల యేర్పాటు లట్టున్నవి కావున అందరిగుణదోషములు, గుట్టుమట్లు, పరదేశి సులభముగా శీఘ్రముగాఁ దెలిసికొనఁ గలఁడు. కొన్నాళ్ళపరిచయము కలుగఁగానే "వచ్చి మాయింటిలోఁ గొంతకాలముండుఁ"డని అమెరికను లన్యదేశీయుని ఆహ్వానము చేయుదురు, జర్మనులును అట్లే చేయుదురు, మఱికొంత మెఱుఁగుపరిచయము గలిగినపిమ్మట ఆంగ్లేయులును అట్లే గావింతురు, కాని ఫ్రెంచివారట్లుచేయరు; నీతో నెంతో గాఢమైన చిరకాలపరిచయమును మైత్రియును ఉండినఁగాని వచ్చి తనయింటఁ దన కుటుంబముతోఁ గలసియుండుమని ఫ్రెంచివాఁడు నిన్నెప్పుడునుపిలువఁడు. పరదేశి కట్టియవకాశమే కలిగి ఫ్రెంచికుటుంబపుస్థితిగతులు స్వయముగాఁ గనిపట్టుటకుఁ జాలినంత తెలిసియున్న యెడల, నతని యభిప్రాయము సాధారణముగా ఫ్రెంచివారినిఁగూర్చి తా వినునభిప్రాయముకంటె కేవలము భిన్నముగా నుండును. కలకత్తాలో పామరజనులుండు ఏమూలనో చూచి మన జాతీయస్వభావమునుగూర్చి పరదేశస్థుఁడు తనయభిప్రాయము చెప్పుట మూఢకృత్యము కాదా? పారిసువిషయమైన యభిప్రాయములును అట్టివే! మనదేశములోవలెనే ఫ్రాన్సుదేశములో అవివాహితస్త్రీలను అతిజాగ్రత్తతో కనుపెట్టి కాపాడుకొందురు; నలుగురతోను కలసిమెలసి స్వేచ్ఛగా నారుండుటకువీలు లేదు; వివాహమైనపిదపనే తమభర్తలతోఁగలసి వారట్లుచేయవచ్చును. మనలోవలెనే వారిలోను పెండ్లిమాటలు మాటలాడి సంబంధనిశ్చయము చేయువారు తలిదండ్రులు, ఫ్రెంచివారెప్పుడును ఉల్లాసోత్సాహములతో నుండుప్రజలు. కావున పూజాసమయములందును వివాహసమయములందునుమనముభోగముమేళములు పెట్టుకొనునట్లు వారు పెద్దపెద్ద వేడుకసమయములందు నాట్యవృత్తిచే జీవించువారిచే నాట్యములాడించుకొందురు; అట్టినర్తకులు లేనియుత్సవము అసంపూర్ణోత్సవముగా నెంచుకొందురు. పొగమంచు టిరులలముకొనియుండుదేశములలో నివసించుచు నిత్యవ్యాకులచిత్తులైయుండు ఆంగ్లేయులా నాట్యములుచూచి మొగములు నిడుపుగా సాఁగఁదీసికొని—యిండ్లలో అట్టినృత్యము లనుచితములు—అని యూసి

పోసికొందురు; కాని వాటక శాలలలో అవి మంచివే ! వారినాట్యములు మనకన్నులకు అయుక్తములుగా నగపడవచ్చునని యిటుల జెప్పకతప్పదు. వానికలవాటుపడిన వారికన్నులకుమాత్రి మవియట్లు కానిపించవు. నాట్యసమయమందు వడుచులు మెడబుజము లగపడునట్లు దుస్తులు వేసికొనవచ్చును, అదితప్పుగాదు; ఆంగ్లేయులును అమెరికనులును అట్టి నాట్యములకు వెళ్లుటకేమియు సందేహింపరు, కాని యింటికివచ్చిన తరువాత ఫ్రెంచియాచారములను దూషించుటమాత్రము మానరు !

ఇంక స్త్రీ పాతివ్రిత్యవిషయకమైన యభిప్రాయము సర్వత్రి యొక్కరీతిగనే యున్నది. ఆపాతివ్రిత్యపథమునుండి స్త్రీ లేశమాత్రము తొలంగి సంచరించినను, అది వారికి మహాపదప్రకరము; పురుషులెంతకక్కుతితిపడినను, అది యంత గణనసేయరు. ఈవిషయమున నితరులకంటె ఫ్రెంచిపురుషుండు నిజముగా ఎక్కువస్వేచ్ఛాసంచారి, ధనవంతులగు నితరదేశీయులవలెనే వారేమనుకొందురో వీరేమనుకొందురో యని భయపడడు. సాధారణముగా యూరప్పులో పెక్కురు మగవారు కొంచెము స్వైరవిహార మంత తప్పుగా నెంచరు, అవివాహితపురుషులుగూడ నట్లే సంచరింతురు. స్త్రీలనుజూచి సిగ్గువడు వడుచువిద్యార్థిత లిదండ్రులు, అది కొడుకులోని యొకలోపముగా—ఆడంగిలక్షణముగా—నెంతురు. పాశ్చాత్యులలో అత్యావశ్యకమైన పురుషలక్షణము ధైర్యము. సుగుణమని యర్థమిచ్చు వారిభాషలోని 'వర్ట్యూ' (Virtue) అనుపదమును మన 'వీరత్వ' పదమును ఒక్కటే. "వర్ట్యూ" పదవ్యుత్పత్తినిబట్టి పురుషునిలో వారేగుణ ముత్తమగుణమందురో తెలిసికొనవచ్చును. వారిలోగూడ స్త్రీలకు ప్రధానతమమైన సద్గుణముపాతివ్రిత్యమే. ఏకపురుషుడనేకభార్యలను జేసికొనుట, యేకస్త్రీ యేకకాలమున అనేకులను భర్తలుగా జేసికొనుటంత సంఘమునకు హానికరముగాదు, ఏలనగా, బహుపతిత్వము వలన క్రమక్రమముగా జాతి క్షీణదశకువచ్చును. అందువలననే, సర్వదేశములవారును స్త్రీపాతివ్రిత్యసంరక్షణవిషయమునన తిజాగరూకులై యుందురు. ఈనతిపాతివ్రిత్యగోపనోద్యమవ్యాజమున బ్రకృతికాంత

తన ప్రయోజనము నెఱవేర్చుకొనుచున్నది. ప్రజాసంవృద్ధిగావించుట
ప్రకృతిధర్మము; స్త్రీపాతివ్రత్యము దానికి సహకారియగుచున్నది.
కావునఁ బ్రతిదేశీయులును పురుషపరిశుద్ధతకంటె స్త్రీపవిత్రతను గా
పాడుకొనుటయందెక్కువ యాసక్తులై తన్మూలమున నిజప్రయోజన
ము నెఱవేర్చుకొనుటయందుఁ బ్రకృతికాంతకుఁ బరమమిత్రులును స
హాయులును అగుచున్నారు.

ఒక్కొక్కజాతి జీవనమున కొక్కొక్కనీతిప్రధానలక్ష్యము—
ఒక్కొక్క పరమపురుషార్థమైనధర్మము—ఉన్నది, ఆప్రయోజనము
దృష్టియందుంచుకొనియే యాజాతి యాచారవ్యవహారములలోని మం
చిచెడ్డ లాలోచింపవలెను; ఈయంశము మీామనసు నంటునట్లునొక్కి
చెప్పు నుద్దేశముతోనే పైసంగతు లంత విస్తరించివ్రాసినాను. పాశ్చా
త్యదృష్టితోఁ బాశ్చాత్యులను బరికింపవలెను. వారిని మనము మన
కన్నులతోఁ జూచుటయు, మనలను వారు వారికన్నులతోఁ జూచుట
యు—ఈరెండును తప్పులే. మన జీవితప్రయోజనమువారి జీవితప్ర
యోజనమునకుఁ గేవలము విరుద్ధము. విద్యార్థికి సాంప్రదాయిక సం
స్కృతపదము బ్రహ్మచారి, కామజిత్తు (జితేంద్రియుఁడు) అను సం
స్కృతశబ్దము దానికిఁ దుల్యార్థకమైనశబ్దము. మనజీవయాత్రకు గమ్య
స్థానము మోక్షము. బ్రహ్మచర్యము—పూర్ణమైన యింద్రియనిగ్రహ
ము—లేకుండ, ఆగమ్యస్థానము చేరుటయెట్లు? కనుకనే విద్యార్థ్యవస్థ
లో మన బాలురకును యువకులకును బ్రహ్మచర్య మవశ్య కర్తవ్య
మైన నియమముగా విధించినారు. పాశ్చాత్యజీవనప్రయోజనము భోగ
ము. కావున మనకువలె వారికి కఠినబ్రహ్మచర్య మంత యవశ్యాచర
ణీయమైన నియమముగాదు.

ఇఁక మఱల మన పారిసుపట్టనమునకు వత్తము. నవీనపారిసు
పట్టనమునకు సాటియైనపట్టనము ప్రపంచములో మఱియొకటిలేదు.
ప్రాచీనపారిసునకును ప్రస్తుతపారిసునకును హస్తిమశకాంతరము గల
దు. వంకరటింకరగానుండు వీథులతోను సందులతోను, సందులలో
ఎదుటియిండ్లను కలుపుటకు అక్కడక్కడ పైనిగట్టిన అర్ధచంద్రాకార

పుటిటికకట్టులతోను, గోడలప్రక్క నేయుండు కూపములతోను, కాశీ కాపట్టణములో వంగదేశీయులుండు భాగమెట్లుండునో ప్రాఁత పారిసు అట్లుండెడిది. వెనుక జరిగిన ప్రదర్శనములో ప్రాఁత పారిసు నమూనా (ప్రతిమ) యొకటిచేసి చూపినారు. ఆప్రాఁతపారిసునగరము ఇప్పుడు పూర్తిగా రూపుమాసిపోయినది; పట్టణములో యుద్ధసంక్షోభాద్యుపద్రవములు సంభవించినపుడెల్ల నందేదో యొకభాగము నేలమట్టమూనఁ గూలి ధ్వస్తమగుచుండెడిది; అట్లు క్రమక్రమముగా అంతరించిన ప్రాఁత పారిస్సునకుమాఱుగా విస్తీర్ణమైనట్టియు పరిశుభ్రమైనట్టియుక్రొత్తపారిస్సు బయలుదేఱినది.

నవీనపారిసునగరము దాదాపంతయుమూఁడవనెపోలియనుగారి సృష్టియని చెప్పవచ్చును. పూర్వపు ఏకాధిపత్యము పడిపోయినప్పుడే పట్టనపుమార్పు ప్రారంభమైనది; మూఁడవనెపోలియను ఆమార్పు పూర్తిచేసినాఁడు, ఫ్రెంచిపరిపాలనాపద్ధతిలోఁ బరిపూర్ణమైనమార్పు గలుగకముందు తద్దేశనిరంకుశప్రభువులవలనఁ బ్రజ లెంతబాధపడినారో ఫ్రెంచిదేశచరిత్ర చదివినవానికిఁ జెప్పనక్కఱలేదు. బహుజనమారణముచేసి రక్తప్రవాహములు గావించి, కేవలాయుధబలపరాక్రమములచే మూఁడవనెపోలియను తన్ను చక్రవర్తిగాఁ బ్రకటించుకొనినాఁడు. ఫ్రాన్సులోజరిగిన ప్రథమపరివర్తనము నాఁటినుండియును ఫ్రెంచిప్రజలు సర్వదాచపలచిత్తులును రాజ్యవిప్లవకారకులును అగుచుండిరి. కనుక మూఁడవనెపోలియనుచక్రవర్తి, సంతతచంచలచిత్తులగు జనులకు చేతినిండపనికల్పించి వారిని సంతోషపెట్టి తృప్తాత్ములుగను శాంతులుగను జేయుటకై యెప్పుడును బ్రహ్మాండమైన క్రొత్త క్రొత్తరాజవీథులు, బాటలు, కట్టలు, గట్లు దుర్గనగరద్వారములు, నాటకశాలలు, ఇతరమైన యనేకశిల్పనిర్మాణములు వారిచే వేయించి కట్టించి చేయించెడివాఁడు, ప్రాఁతపారిస్సులో జ్ఞాపకచిహ్నములుగా నుండు భవనాదులనట్టేపెట్టి క్రొత్త విట్టివి కట్టించుచుండెను. అందువలనఁ బట్టనమంతయు సరళముగాను విశాలముగను ఉండు క్రొత్తరాజమార్గములతోను, ప్రాఁతవి బాగుచేసినందువలననో క్రొత్తవి కట్టినందు

వెలననో బయలుదేఱిన దివ్యభవనములతోను, వ్యాపించియుండుటయే కాక, ప్రాకారాదిరక్షణనిర్మాణశ్రేణిచేఁ బట్టనవిస్తృతి రెట్టియయ్యెను. చక్కనిప్రదేశములును, ఉభయపార్శ్వములందు వృక్షపంక్తులుగల విశాలమైన బాటలును, బయలువెడలెను, "షాంజెలీజే" అనుమహారాజపథము పునర్నిర్మితమయ్యెను. ఇట్టిరాజమార్గము పారిసులోఁదప్పఁ బ్రపంచమున మఱియొకచోట లేదు. నడుమను ఈప్రక్కనుఆప్రక్కనుగూడ వృక్షశ్రేణులతో విరాజిల్లుచుండుటకు వీలైనంత విశాలముగా ఆబాటయున్నది. అదియొకచోట చుట్టుదిరిగి పట్టనపశ్చిమముఖము నావరించుకొనియున్నది. ఆప్రదేశమునకు "ప్లేసిడిలా కాంకర్డు" అనిపేరు; ఈ ప్రదేశముచుట్టును, స్త్రీరూపములతో, ఫ్రాన్సులోని యెనిమిది ప్రధానపట్టనముల విగ్రహములున్నవి. అందొకటి "స్ట్రాస్బర్గు" యొక్క ప్రతిమ 1872వ॥ సంవత్సరమున జరిగినయుద్ధముతరువాత, ఈప్రదేశమును ఫ్రెంచివారిదగ్గఱనుండి జర్మనులు బలాత్కారముగా లాగుకొన్నారు. దాని నష్టమువలనఁ గలిగిన దుఃఖమునుండి ఫ్రెంచివారింకను విముక్తులుగాలేదు; ఆమృతపురీమతల్లిని దలఁచుకొని యామె స్మారకచిహ్నమైన యావిగ్రహముపైఁ బూలుచల్లి పూలదండలువేసి యిప్పటికిని ప్రజలామె నారాధించుచున్నారు. మృతబంధువులసమాధులకుఁ బుష్పమాలలర్పించునట్లు ఎప్పుడో యొకవ్యాడు ఆవిగ్రహముమెడలో విరిసరులు వేయుదురు.

ఢిల్లియందలి "చందినీచౌక్కు" ఒకానొకవ్యాపు ఈ "ప్లేసిడిలా కాంకర్డు" వలెనే యుండియుండవచ్చునని నాకుఁ దోఁచుచున్నది. ఆబయలక్కడక్కడ జయస్తంభములతోను, విలువంపుగాఁ గట్టఁబడిన విజయానందసూచకతోరణద్వారములతోను, శిల్పకళానైపుణ్య మగపడుచు పెద్దపెద్ద స్త్రీపురుషజనసింహాదివిగ్రహములతోను అలంకృతమైయున్నది.

మహావీరుఁడైన నెపోలియన్బోనపార్టు స్మారకచిహ్నముగా "వెన్డోమ్ము" అనుచోట ట్రేజనుగారి ంబమునుబోలు మహాజయస్తంభమొకటి నిల్పినారు. 1200 పిరంగులు కరఁగింపఁగావచ్చిన లోహము

తో ఆ స్తంభము చేసినారు, దానిపైని నెపోలియన్బోనపార్టు విగ్రహ
మున్నది, ప్రక్కలను అతని యధికారములోని యుద్ధవిజయవృత్తాంత
ములు చెక్కఁబడియున్నవి. 1830 వ సంవత్సరపు జూలైమాసములో
జరిగిన పరిపాలనాపరివర్తనముయొక్క జ్ఞాపకచిహ్నముగా-ప్లేస్‌డిలాబాస్టి
ల్లు—అనుచోట "జూలై" స్తంభమొకటి స్థాపితమైయున్నది; ఇచ్చట నీ
పూర్వపు బాస్టిల్లు దుర్గముండెడిది, దానిని తరువాత రాజద్రోహుల
నుంచు కారాగృహముగా నుపయోగపఱిచెడువారు రాజాగ్రహ పా
త్రులైనవారిని బట్టుకొని యిట బంధించెడివారు. అపూర్వపురోజుల
లో, విచారణ గిచారణ ఏమియు లేకుండఁగనే, రాజు తన మొహారు
గుర్తియొక బంధనాధికారపత్రము (లెట్టర్డికాషే) జారీచేసెడువాఁడు,
అంతట, ఆపత్రమునకు బలికానున్నవాఁడు దేశోపకారకృత్యము
లేమేనిచేసినాఁడా ? వాఁడునిజముగా దోషియగునా కాఁడా ? రాజున
కంతకోపమువచ్చుటకు వాఁడుచేసిన తప్పిదమేమి ?—అను పరిశీలన
మిసుమంతయు లేకుండఁగనే, వానినిబట్టుకొని బాస్టిల్లులో వెంటనే
పడవేసెడువారు. రాజుగారి కిష్టురాండ్రైన విలాసవతుల కెవనిమీఁద
నైన విరోధమున్నయెడల, వారు రాజునడిగి వానిపై బంధనాధి
కారపత్రికయొకటి పుచ్చుకొని తత్క్షణము పాప! మానిరపరాధుని
నిష్కారణముగా బాస్టిల్కారాబద్ధుని జేయించెడువారు. ఆచెఱలోఁ
బడిన దురదృష్టవంతులలో విముక్తులయి మఱల బైటఁబడినవారు మి
క్కిలి తక్కువమంది తరువాత ఆహింసాక్రౌర్యదౌర్జన్యములు సహిం
పలేక, దేశీయులందఱును ఏకీభవించి "సర్వజనులకు స్వాతంత్ర్యముండ
వలెను! అందఱు సమానులే కాని, యొకఁడెక్కువ యొకఁడు తక్కువ
కాఁడు!" అని యఱచుచు తిరుగఁబడి చెలరేఁగినప్పుడు, పారిస్పురవా
సులందఱు రోషోన్మాదవివశులైపోయి దొమ్మిగా రాజుపైని రాణిపైని
బడిరి. ఆమూఁకచేసిన మొదటిపని యేదనఁగా—ప్రజానీకమునకు
పీడాపరిత్యక్తమూర్తియై పరఁగుచున్న బాస్టిల్లు నేలమట్టమునకుఁ గూలఁ
గొట్టి యాస్థానముననే విందులతోను ఆటలతోను పాటలతోను ఆరా
త్రియంతయుఁ గడపుట. రాజుగారు పాఱిపోవుటకుఁ బ్రయత్నించిరి.

కాని ప్రజలెట్లో ఆయననుబట్టుకొని, రాజుగారి మామగారగు ఆస్ట్రియా చక్రవర్తిగారు, అల్లునకు సహాయముగా సైనికుల నంపుచున్నారని వినుటచేఁ గ్రోధాంధులై ఆయనను రాణిగారినిగూడఁ జంపివేసిరి. స్వాతంత్ర్యసమభావములనుపేర ఫ్రెంచిజాతికంతకుఁ బెద్ద పిచ్చియెత్తెను—ఫ్రాన్సుదేశములోఁ బ్రజలే పరిపాలకులైరి—చేతికందిన గొప్పవారిని, కులీనులనందఱను, జనులు చంపివేసిరి; అభిజాతులలో ననేకులు తమబిరుదులను గౌరవపదవులను బరిత్యజించి ప్రజాపక్షములోఁ బ్రవేశించిరి; అట్లు చేయుటయేకాక—జనులారా! మేలుకొనుఁడు! ప్రభువులందఱు ప్రజాపీడాకరులు గనుక వారిని జంపుఁడు! అందఱు సమానమైనహక్కుల ననుభవించుచు యథేచ్ఛముగావర్తింపుఁడు!—అని ప్రపంచములోని యితరదేశీయులనుగూడఁ బురికొల్పుచుండిరి. కనుక, ఆప్రజలరాజద్వేషాగ్ని తమ దేశములకుఁగూడఁ బ్రాఁకి తమ సింహాసనములఁగూడ దగ్ధముచేయునేమో యని యూరప్పుదేశముల రాజులందఱు భయకంపితులై, ఆసంక్షోభము నడఁచివేయుటకుఁ గృతనిశ్చయులై, నలువైపులనుండివచ్చి ఫ్రాన్సుపైఁబడిరి. ఇఁక ఫ్రెంచిప్రజాపరిపాలననాయకు లేమిచేసిరనఁగా-మనజన్మభూమి మహోపద్రవములో నున్నది, అందఱును రండు! రండు!—అని చాటించినారు. ఆప్రకటనాగ్నిజ్వాలలు ప్రాకిఫ్రాన్సు నలుదెసలలముకొనెను. తరుణవయస్కులు, వృద్ధులు, స్త్రీపురుషులు, దరిద్రులు, ధనవంతులు, అధికులు, అల్పులు,—అందఱు (La Marseillaise—లామార్సెయెజ్) అను వీరావేశకరమగు ఫ్రెంచిజాతీయసమరగీతము పాడుచు పైకివచ్చినారు—ఆఘోరమైన శీతబాధలో, చింపులుగట్టుకొని, కాళ్లకుజోళ్లు లేక, అల్పహస్తులతో, ఫ్రాన్సులోని పేదలందఱు భుజములమీఁదతుపాకులుపెట్టుకొని బయలుదేఱినారు—"పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతాం" అన్నట్లు వారందఱు దుష్టులదండించి తమకొంపలుకాపాడుకొనుటకైముందఱికివచ్చి యూరప్పునందలిసర్వపరదేశీయ మహాసైనికసంహతిని సాహసించి మార్కొనినారు. యూరప్పంతయు నొకటియైవచ్చినను, ఈ ఫ్రెంచిమూఁకలడాక కాఁగలేకపోయెను.

ఫ్రెంచి సేనాముఖమందు నాయకుఁడుగా నొక శూరుఁడు నిలఁబడియుండెను; అతనియంగుళీతర్జనమునకు యూరప్ప్రపంచము అదలి వడఁకఁజొచ్చెను; అతఁడే నెపోలియన్బోనపార్టు. అతఁడు తన ఖడ్గధారతోను, సన్నితోను, స్వాతంత్ర్యసమత్వసహోదరభావములను, అస్థిమజ్జాగతముగునట్లు యూరప్పుశరీరములోఁ బ్రవేశపెట్టెను—అతని త్రివర్ణపతాకయూతిరున దిగ్విజయమందెను. నెపోలియను ఫ్రెంచిచక్రవర్తియై ఫ్రెంచిరాజ్యస్థిరస్థాపనమహాకార్యమును నిర్విఘ్నముగా నెఱవేర్చుకొనెను.

తన యనంతరము తన సింహాసనమెక్కు వారసు తనకు లేఁడని, కొంతకాలముతరువాత, తన కష్టసుఖములకయి, తన యదృష్టదేవతయు అర్ధాంగలక్ష్మియునైన జోసెఫీన్ చక్రవర్తినిగారిని విడిచిపెట్టి ఆస్ట్రియాచక్రవర్తి కూఁతును నెపోలియను వివాహమాడెను. జోసెఫీన్‌గారిని పరిత్యజించుతోడనే యతని భాగ్యచక్రము ప్రతికూలముగాఁ దిరుగనారంభించెను, రష్యాదండయాత్రలో నతనిసేన మార్గమందలి మంచుగడ్డలకు నిలువలేక యందు మడిసిపోయెను. ఈసందుకనిపట్టి, యూరప్పులోని నెపోలియనుప్రతిపక్షులు అతనిని పదభ్రష్టుని జేసి, స్వరాజ్యమునుండి వెళ్లఁగొట్టి, యొకద్వీపమునకుఁ బంపివేసి, తత్పూర్వరాజవంశస్థుఁడగు నొకని సింహాసనముపైఁ గూరుచుండఁబెట్టిరి. పేటుపడిన సింహామువలెనున్న నెపోలియను ఆద్వీపమునుండి తప్పించుకొనివచ్చి యెట్లో ఫ్రాన్సులో మఱలఁ బ్రత్యక్షమయ్యెను. ఫ్రాన్సులోని యూవజ్జనులును అత్యుత్సాహముతోఁ గూడి మఱల నతనిపక్షమున మూఁగిరి; అప్పుడు పరిపాలించుచున్న క్రొత్తరాజు పలాయితుఁడయ్యెను; కాని నెపోలియను అదృష్టము నిలువలేదు, దానికి శాశ్వతమైన భంగము సంభవించెను, తిరిగి పూర్వాదృష్టదశకు అతఁడు రాఁజాలకపోయెను. మఱల యూరప్పు దేశములన్నియును ఏకీభవించి "వాటర్లూ" యుద్ధములో అతనిని ఓడించెను. నెపోలియను ఒక యాంగ్లేయుయుద్ధనౌకపైకి వెళ్ళి లోఁబడెను. ఇంగ్లీషువారు అతనిని స్వదేశమునుండి వెళ్లఁగొట్టి దూరముగానున్న సెంటుహెలీనాద్వీపములో యావజ్జీవము కారాబద్ధునిగాఁ బెట్టినారు. మఱలఁ బూర్వపు ఫ్రెంచిరాజకుటుంబములో

నివాఁడగు నొకనిని రాజుగాఁ జేసిరి; కాని ప్రాఁతయేకాధిపత్యము క్రిందఁ బ్రజలకు శాంతిసుఖములు లేకపోఁబట్టి, కొన్నాళ్లతరువాత ఫ్రెంచివారు తిరుగఁబడి, రాజును రాజకుటుంబమును తఱిమివైచి, ప్రజాప్రభుత్వమునే పునస్థ్సాపితముచేసిరి. కాలక్రమమున, మహావీరుఁడగు నెపోలియను సోదరపుత్రుఁడొకఁడు ప్రజలకు మిక్కిలి యిష్టుఁడయి, కుట్రలనేకములు పన్ని తన్నుచక్రవర్తిగాఁ బ్రకటించుకొనెను. అతఁడే మూఁడవ నెపోలియను. కొంతకాలమువఱకు అతనిపరిపాలనము బలపరాక్రమవంతమైయే యుండెను; కాని జర్మనులతో యుద్ధముచేసి యతఁడు పరాజితుఁడై సింహాసనభ్రష్టుఁ డయ్యెను. అంతటమఱల ఫ్రాన్సుదేశము ప్రజాపరిపాలితరాజ్యమయి యిప్పటికిని అట్లేయున్నది.

సూక్ష్మములనుండి స్థూలములును అల్పములనుండి అధికములును క్రమావిష్కృతములై కలుగునను పరిణామవాదము హిందూదేశములో దాదాపుగా అన్నిమతములకు మూలాధారమైన పునాదియని చెప్పవచ్చును. ఆవాదమిప్పటికి యూరప్పువారి భౌతికశాస్త్రములలోఁ బ్రవేశించినది. కేవలము పరస్పరభిన్నములైన పదార్థములచే సమస్తప్రపంచము సృష్టమైనదనిహిందూమతమువక్కఁదక్కినమతములవారి యభిప్రాయము. భగవంతుఁడు, ప్రకృతి, మనుష్యుఁడు—ఈమూఁడు తత్త్వములును, ఒకదాని నొకటియంటకుండఁ, బ్రత్యేకముగా నున్నవఁట. అట్లే మృగములు, పక్షులు, క్రిమికీటకాదులు, చెట్లు, శిలలు, లోహములు మున్నగునవి—వేనికవి వేఱువేఱుగా నున్నవఁట; మొట్టమొదట భగవంతుఁడు వానిని సృష్టించినప్పుడే వేఱువేఱుగా సృష్టించినాఁడఁట.

నానాత్వములో ఏకత్వముఁగనుఁగొని, ప్రత్యక్షముగా భిన్నములై కానిపించు పదార్థములు పరమార్థదృష్టిచే నొక్కటియే యని రూఢిపఱుచుట విద్యయొక్క ప్రయోజనము. ఏయన్యోన్యసంబంధము వలన మనుష్యుఁ డీయైక్యమును గనిపట్టునో దానికే నైసర్గికధర్మమని యును ప్రకృతి నియమమనియును జెప్పుదురు.

మన విద్య, మన తెలివి, మనయూహలు—అన్నియును పారమా

ర్థికలత్త్వములు గలవనియు, మతప్రధానములై మతమందు వ్యక్తీకరింపఁబడునవనియు నే నింతకుముందు చెప్పినాను. పశ్చిమ దేశములలో అవి బాహ్యవ్యక్తి గలవియై, స్థూలప్రపంచవిషయములందును సంఘువిషయములందును స్ఫుటముగాఁ బ్రకాశితములగును. ప్రాచీనహిందూ దేశములోని మేధావంతులు ఆలోచించి యాలోచించి—భేదభావము పొరపాటనియు, భిన్నభిన్నముగా నగపడువానికన్నిటికిఁ బరస్పరసంబంధము గలదనియు, తరుగుల్మమృగమనుష్యదేవతాత్మకమును బ్రహ్మమయమును అగు ఈ ప్రపంచమందంతటను ఏకత్వమే వ్యాపించియున్నదనియు—చివరకుఁ దెలిసికొనినారు. ఏతద్భావనాపరమావధినంటినయద్వైతి—సర్వము బ్రహ్మమే! అన్నియు బ్రహ్మవ్యక్తి భేదములే!—అని చాటినాఁడు. ఆధ్యాత్మికాధిభౌతిక ప్రపంచములు రెండును వాస్తవముగా ఒకటియే, దానిపేరు బ్రహ్మము, వస్తుభేదజ్ఞానము వట్టి భ్రమ—దీనినే మాయయనియు అవిద్యయనియుఁ జెప్పుదురు. ఇది తెలిసికొనుటయే సర్వవిద్యాధిగమనమునకును సర్వశాస్త్రపఠనమునకును ఫలము.

హిందూ దేశముమాట యిట ఎత్తుకొనకుండ విడిచిపెట్టెదము. ఇప్పు డన్యదేశీయుల కీసంగతి యెటుకపడనిచో, వారు పండితులనియెట్లుచెప్పఁగలము? అయినను పాశ్చాత్యవిద్వాంసులలో పెక్కురు ప్రకృతిశాస్త్రమూలమున ఈపరమసిద్ధాంతమును ఇప్పుడు గ్రహించుచున్నారు. కాని ఆయొక్కటియును పెక్కురూపము లెట్లయ్యెనో—వారికిని దెలియదు, మనకును దెలియదు! పరిమితమైన మనబుద్ధికి ఆవిషయము గోచరింపదని మనము సమాధానము చెప్పెదము, వారును అట్లే చెప్పినారు. అయిననేమి? ఆయేకపదార్థము చెందినమార్పులు, అది తాల్చుచున్న వివిధజాతివ్యక్తిరూపములు—ఇవి గ్రహింపశక్యములే; తద్విషయకమైన విచారణయే శాస్త్రమనఁబడును.

పశ్చిమఖండమందిప్పుడు దరిదాపుగా అందఱును పరిణామవాదులే. చిన్నజంతువులు క్రమక్రమముగామాఱి పెద్దవియై, పెద్దజంతువు లొకప్పుడు క్షీణించి చిక్కి చిన్నవియై కొన్నాళ్లకుఁ జచ్చిపోవు

ను— అట్లే మానవుఁ డొక్కసారియే యాకస్మికముగా నాగరకుఁడై పుట్టలేదు ; ఈరోజులలో, దీనికివ్యతిరిక్తమైన సిద్ధాంత మెవరేని చెప్పినఁ శాస్త్రజ్ఞులలో వివేకవంతుఁ డెవ్వఁడును నమ్మఁడు ; దానికిముఖ్య కారణమేమన— కొన్ని శతాబ్దములక్రిందటివఱకు వారిపూర్వులు మృగప్రాయులైయున్నట్లు నిదర్శనములున్నవి, ఆయనాగరకస్థితినుండి అత్యద్భుతమైన స్వల్పకాలములో, వారు గొప్పమార్పునొందినారు. కావున మనుష్యజాతులన్నియును అట్లే క్రమాభివృద్ధి నొందకతప్పదు, అట్లనాగరకస్థితినుండి నాగరకస్థితికి వచ్చుచున్నవి— అని వారు చెప్పుదురు.

ఆదిమమానవులు కఱ్ఱతోను ఱాతితోను జేసిన కొఱముట్లతోఁ బని చేసికొనుచు, తోళ్లతోను ఆకులతోను శరీరముకప్పుకొనుచు, కొండగుహాలలోనో, పక్షిగూండ్లవలె పూరితోను ఆకులతోనుగప్పిన యిండ్లలోనో, నివసించుచు ఏదోయొకరీతిని కాలము గడపుకొనువారు. సర్వదేశములందును భూమిత్రవ్వి యందుదొరకిన ప్రాచీనవస్తువులఁ బరీక్షింపఁగా ఈసంగతి ధ్రువపడుచున్నది ; అదియుఁగాక యిప్పటికిని అక్కడక్కడఁ గొన్ని ప్రదేశములందు ఆదిమానాగరకస్థితిలోనున్న మనుష్యులు కానిపించుచున్నారు. కాలక్రమమున మనుష్యులు తగరము రాగి మున్నగు మృదులోహముల యుపయోగము నెఱిఁగి వానిఁ గరగించిగృహోపకరణములును యుద్ధోపకరణములగు ఆయుధములను జేయుట యెట్లో కనుఁగొనినారు. ప్రాచీనగ్రీకులును, బాబిలోనియనులును, ఇజిప్షియనులును, చిరకాలము— ఇతరులకంటె నాగరకులై గ్రంథములు వ్రాయుచు వెండిబంగారముల వాడుకొనుచున్నప్పుడుసైతము— ఇనుముయొక్క యుపయోగములు తెలియకుండనే యుండిరి. ఆకాలములలో, నూత్నప్రపంచమనఁబడు అమెరికాలో అనాదిగానుండు మెక్సికనులు, పెరూవియనులు, మాయులు, తదితరులు, ఎక్కువనాగరకులుగానుండి పెద్దపెద్ద దేవాలయములు కట్టుకొనుచుండిరి ; వెండిబంగారములు, సర్వసామాన్యముగా వారుపయోగించుకొనుచుండిరి. (వారికున్న వెండిబంగారములపై యాశచేతనే స్పానియర్డులు వెళ్లి వారిని నాశముచేయుట తటస్థించినది.) వారు చెకుముకిఱాతిపనిముట్లతో

ఎంతో శ్రమపడి కావలసినవస్తువులు చేసికొనుచుండెడువారు — అంతే కాని, యినుము పేరైనను వారికిఁ దెలియదు.

ఆదిమావస్థలో మనుష్యుఁడు విల్లమ్ములతో మృగములనుగొట్టి వలలతోఁ జేపలనుబట్టి వానినాహారముగాఁగొని జీవించెడువాఁడు. క్రమముగా భూమి సేద్యముచేసికొనుటయు పశువులను గాచుకొనుటయు నేర్చుకొన్నాఁడు. వన్యమృగములను మచ్చికపఱచుకొని వానిచేఁ దనపనులు చేయించుకొనుచుండెను, ఆవశ్యకమైనప్పుడు ఆహారముగా భుజించుటకుఁగూడ వానిని బెంచుకొనుచుండెను. ఆవులు, గుఱ్ఱములు, పందులు, ఏనుఁగులు, ఒంటెలు, మేఁకలు, గొఱ్ఱెలు, కోళ్లు మున్నగు పక్షులు, ఇతరజంతువులు — వీని నిట్లే మనుష్యుఁడు మచ్చికచేసికొన్నాఁడు. శునకము మనుజుని ప్రథమ స్నేహితుఁడు.

కొన్నాళ్లకు మనుష్యుఁడు కృషీవలుఁడై జీవించుట సంభవించినది. పండ్లు, దుంపలు, మొక్కలు, కూరగాయలు, ధాన్యములు — మానుషాహారములగు నివన్నియుఁ దత్పూర్వము వానియంతట అవి యడవులలోఁ బెరిఁగినప్పటికంటె మనుష్యవ్యవసాయమువలనఁ జాలఁగా మాఱిపోయినవి. కృషిచేతను వన్యఫలములు పెద్దవియును రుచిమంతములును అయినవి ; అడవిగడ్డి యింపైన వరిపంటగా మాఱినది. సృష్టిలో స్వాభావికముగా నొకరిప్రయత్నమక్కఱలేకుండ, నిత్యము మార్పులు జరుగుచునే యున్నవి. దేశకాలాదిపరిస్థితులవలనఁ గలిగిన పరిణామములచే క్రొత్తక్రొత్త చెట్లు, మొక్కలు, ఓషధులు, పక్షులు, మృగములు నిరంతరము సృష్టములగుచున్నవి. మనుష్యోత్పత్తికిఁ బూర్వము కొంచెముకొంచెముగా మందమందముగాఁ బ్రకృతియే యుద్భిజ్జములను జంతువులను మార్చుచుండెను ; మనుష్యపాత్ర మీజగన్నాటకరంగమునఁ బ్రవేశించినతరువాత, ఆమార్పు లతివేగముగా జరుగుచున్నవి. మానవుఁ డొకదేశపుచెట్లను జంతువులను మఱియొకదేశమునకుఁ గొనిపోయి అంటుగట్టి జాతిసంకరముగావించి నానావిధములైన నవీనవృక్షములను నవీనజంతువులను సృష్టిలోనికిఁ దీసికొనివచ్చుచున్నాఁడు.

ప్రప్రథమదశలో వివాహమనునది లేదు. వివాహసంబంధము

క్రమముగా కాలాంతరమున వచ్చినది. అతిపూర్వకాలములో అన్ని జాతులలోను మాతృత్వమే ప్రధానముగా గణింపఁబడియెడిది, పితృత్వవిషయమున అంత స్థిరనిర్ణయము లేదు. తల్లి పేరే బిడ్డలకుఁ బెట్టుచువారు. పిల్లలను తల్లులే పెంచవలెను గనుక సొత్తంతయు స్త్రీల చేతులలోనే యుండెడిది, కాలక్రమమున స్త్రీసహితముగా సొత్తంతయుఁ బురుషుల చేతిలోనికి వచ్చినది. "ఈ ధనధాన్యములు నావి, నేను కష్టపడి దోఁచి తెచ్చినాను, నేను కష్టపడి పొలము దున్ని పండించినాను, ఇవి నావి కావని చెప్పి యెవఁడైన వీనిలో పాలుగొనుటకు వచ్చెనేని, వానితో దెబ్బలాడక మానను." అట్లే—"ఈ స్త్రీలందఱు కేవలము నా సొత్తు; వారిపై నాకుండు హక్కునకు ఎవఁడైన భంగము కలుగఁజేసి అన్యాయాక్రమణము చేయఁదలఁచెనేని వానితోఁ బోరాడెదను." అని మగవాఁడు చెప్పనారంభించెను. అంతటఁ బ్రస్తుతపు వివాహపద్ధతి బయలుదేఱెను. బానిసవాండ్రు పశువులవలెనే, స్త్రీలును మగవాని సొత్తయిపోయిరి. ఒకతెగలోని పురుషులు మఱియొకతెగలోని స్త్రీలను పెండ్లిచేసికొనుచుండిరి—ఇది ప్రాచీనవివాహాచారము. అప్పుడైనను స్త్రీలను బలాత్కారముగాఁ గొనిపోవుచుండిరి. కొంతకాలమట్లు జరిగినపిదప, బలవంతముగా వధువుల నపహరించు ఆచారము వదలిపెట్టి, ఉభయపక్షముల యన్యోన్యాంగీకారముతోనే పెండ్లి నిశ్చయించుకొనుట కారంభించిరి. కాని గతించిన ప్రత్యాచారము అంతయో యింతయో తన చిహ్నము లోకములో శాశ్వతముగా దిగవిడిచి మఱిపోవును, ఇప్పటికిని పెండ్లిండ్లలోఁ బెండ్లికొడుకును నవ్వులాటకుఁ దఱుముకొనిపోవు ఆచారము ప్రతిదేశములోను గలదు (తెలుఁగుదేశములో దీనిని దొంగవేలిమి యందురు.) వంగదేశములోను యూరప్పులోను పిడికెళ్లతో బియ్యము పుచ్చుకొని పెండ్లికుమారునిపై నువ్వుదురు, ఉత్తరహిందూస్థానములో పెండ్లికుమార్తె చెలికత్తెలు పెండ్లికొడుకుపక్షము వారిని తిట్టి దూషింతురు.

ప్రజాసంఘము లేర్పడుట కారంభించెను, దేశములఁబట్టి వానిలో భేదము లేర్పడెను. సముద్రతీరమున నివసించువారు సముద్రములో

చేఁపలు పట్టుకొనియు, బయళ్లపై నివసించువారు భూమి దున్నుకొని పండించుకొనియు బ్రతుకుచుండిరి. పర్వతీయులు పెద్దపెద్ద గొఱ్ఱెమందలును, ఎడారులలోనుండువారు మేఁకలను ఒంటెలను గాచుకొనుచుండిరి. ఇతరులడవులలోనుండి వేఁటాడుకొని జీవించెడువారు. పల్లపుప్రదేశములలోనుండువారు వ్యవసాయము బాగుగా నభ్యసించి సుఖజీవనము చేయుచుండిరి; విద్యావ్యాసంగమునకును బుద్ధివ్యాసంగమునకును గావలయు వ్యవధానముండుటచే వారంతకంతకు నాగరకతాభివృద్ధి నొందుచుండిరి. కాని నాగరకత యధికమైనకొలఁది శరీరములు దుర్బలములగుచుండెను. ఎప్పుడును బైటఁదిరిగి వ్యాయామకర్కశులై మాంసమే ప్రధానాహారపదార్థముగాఁ గలవారి శరీరతత్త్వమునకును, నిరంతర మిండ్లలోనివసించి ధాన్యశాకములే తఱచు ఆహారముగాఁ గొను ఇతరుల శరీరతత్త్వమునకునుగలభేద మంతకంత కధికమగుచుండెను. వేఁటకాఁడు, గొఱ్ఱెకాపరి, జాలరివాఁడును తమదినములు వచ్చినప్పుడెల్ల దొంగలో ఓడదొంగలోనై పల్లపుప్రదేశముల వారిపై బడి దోఁచుకొనుచుండిరి. బయళ్లపై నివసించుప్రజలు అన్యోన్యసంరక్షణార్థము ఆత్మసంరక్షణార్థము పెద్దపెద్దసంఘములుగా నేకీభవించిరి; అట్లేర్పడిన సంఘములే చిన్నచిన్న రాజ్యములైనవి.

దేవతలు (సురలు) ధాన్యశాకాహారులు, నాగరకులు, పల్లెలలోను పట్టణములలోను కోటలలోను వసియించి నేఁతబట్టలుధరించెడువారు. అసురులు గుట్టలమీఁదనో కొండలమీఁదనో అరణ్యప్రదేశములందో, సముద్రతీరమందో యుండెడువారు; అడవిజంతువులను గొట్టుకొనితినియో, కాననకందమూలఫలములు త్రవ్వుకొని కోసికొనితినియో, ఇవియును ఆవులును గొఱ్ఱెలును దేవతలకిచ్చి వానికిబదులుగా వారినుండి తెచ్చుకొనిన ధాన్యాదులుతినియో, జీవించెడువారు; వన్యమృగముల చర్మములు వస్త్రములుగా ధరించుకొనెడువారు. దేవతలు దుర్బలశరీరులు, కాయకష్టముల కోర్వలేకపోయెడువారు. అసురులు దృఢగాత్రులు, ఎన్నియభోజనములైనను ఎన్నికష్టములైనను భరింపసమర్థులుగా నుండెడువారు (ఈవ్యాసము నందంతటను దేవాసురశబ్దములు

గీతలో నుపయోగింపఁబడినట్లు—అనఁగా దైవలక్షణ ప్రధానజాతి
వారు ఆసురలక్షణప్రధాన జాతివారు అనునర్థములందు—ఉపయో
గింపఁబడినవి—(శ్రీమద్భగవద్గీత—16 వ అధ్యాయముచూడుఁడు.)

అసురులకు అన్నము తక్కువయైనప్పుడు పర్వతములనుండియో
సముద్రతీరమునుండియో వెలువడివచ్చి పట్టణములు పల్లెలు కొల్ల
పెట్టెడువారు. ఒక్కొక్కప్పుడువారు ధనధాన్యములకై దేవతలపైఁ
బడెడువారు; దేవతలధిక సంఖ్యాకులుగాఁగూడ యసురుల నెదిరింప
లేనప్పుడెల్లఁ దప్పకుండ వారిచేతులలోఁబడి మడిసెడువారు. కాని, దే
వతలెక్కువబుద్ధి బలముగలవారుగనుక శత్రుమారక యుద్ధసాధనము
లనేకములుకల్పింపఁ బ్రారంభించినారు. బ్రహ్మాస్త్రము, గారుడాస్త్ర
ము, వైష్ణవాస్త్రము, శైవాస్త్రము—అద్భుతశక్తి మంత్రములగు ఈ
యాయుధములన్నియు దేవతలవే. అసురులు సామాన్యసాధనముల
తోనే యుద్ధముచేసెడువారుగాని, మహాబలశాలులు. వారు పలుమా
రు దేవతల నోడించినారు, ఓడించిననేమి? కృషికవ్యాపారము నేర్చుకొ
నుటకుఁగాని నాగరకులగుటకుఁగాని విద్యావ్యాసంగముచేసి బుద్ధి నభి
వృద్ధిపఱచుకొనుటకుఁగాని వారుశ్రద్ధవహించి ప్రయత్నింపలేదు. జ
యించిన అసురులు స్వర్గములో పరాజితులైన దేవతలపై పరిపాలన
చేయఁబ్రయత్నించినపుడెల్ల తప్పకుండదేవతలు మహత్తరమైన తమ
బుద్ధికుశలతాబలము లుపయోగించి యేదోయొక కపటోపాయముచే
శీఘ్రకాలములో అసురులనుమోసపుచ్చి తమకు దాసులుగాఁ జేసికొ
నెడువారు. ఇతరసమయములందు అసురులు, కొల్లగొన్న పిదప వారి
స్థానములకుఁ దిరుగఁబోయెడువారు. ఐకమత్యముతో దేవతలు కలిసి
యెదుర్కొనిరేని అసురులనువారి అడవులకో కొండలకో సముద్రతీర
రమునకో తఱిమివేసెడువారు. ఇరువాఁగులును కాలక్రమమునసంఖ్య
లోను బలములోను అధికములయ్యెను. కోట్లకొలఁది దేవతలుకూడిరి,
కోట్లకొలఁది అసురులుకూడిరి. రెండుపక్షములవారికి అనేక ఘోరయుద్ధ
ములుజరిగెను; దెబ్బలాటలతోపాటు అన్యోన్యసంపర్కములుకూడఁగలి
గెను. ఈభిన్నజాతుల సమ్మేళనమువలన మనప్రస్తుతప్రజాసంఘములు

మన ప్రస్తుతాచారవ్యవహారమర్యాదలు బయలుదేఱినవి. క్రొత్త క్రొత్త బుద్ధులును క్రొత్త క్రొత్త యభిప్రాయములును అంకురించినవి; క్రొత్త క్రొత్త విద్యలయొక్కయు శాస్త్రములయొక్కయు వ్యాసంగము జరిగినది. ఒకజాతిమనుష్యులు, చేతినేర్పుచేతనో బుద్ధికౌశలమువలననో ఉపయోగకరములును సుఖదాయకములును అగుపదార్థములు చేయనారంభించినారు; ఇంకొకజాతివారు తత్సంరక్షణకృత్యము తమపైని వైచుకొనిరి; అందఱును సాటాబేరముగా ఆసరకులను ఇచ్చిపుచ్చుకొనుట మొదలుపెట్టిరి. కొందఱు గడుసువారు ఆసరకుల నొకచోటనుండి మఱియొకచోటికిఁ గొనిపోదుమని చెప్పి, ఆశ్రమకుఁ బ్రతిఫలమనుమిషమీఁద, వచ్చులాభములో నత్యధికమైనభాగము తామే యనుభవించుచుండిరి. ఒకఁడు వ్యవసాయముచేసి పండించుచుండెను, రెండవవాఁడు, పండినపంటను చోరభయములేకుండఁగా పాడుచుండెను, మూఁడవవాఁడు దానిని స్థలాంతరమునకుఁ దీసికొనిపోవుచుండెను, నాలుగవవాఁడు ఆసరకును గొనుచుండెను. పంటకాఁపునకు వచ్చులాభము దాదాపుగా ఏమియు లేదనియే చెప్పవచ్చును, సస్యసంరక్షకుఁడు బలవంతముగాఁ దనకు సాధ్యమైనంతలాభమును సంగ్రహించుకొని పోవుచుండెను; వస్తువులను సంతకును బజారునకును గొనిపోయి యమ్మువణిజునకు అతివిశేషముగా లాభమువచ్చుచుండెను, వస్తువులుకొని యుపయోగించుకొనువాఁడు మాత్రము వానికిఁ దగనివెలయిచ్చి యతివ్యయభారముచే బాధనొందుచుండెను; ఆసంరక్షకుఁడే రాజు, వస్తువులనొకప్రదేశమునుండి మఱియొకప్రదేశమునకుఁ గొనిపోవువాఁడే వర్తకుఁడు. ఈయిరువురునుగూడ సస్యాదివస్తూత్పత్తి కారకులగువారు—అయినప్పటికిని కృషికుని శ్రమవలనఁగలిగిన ఫలములో దాదాపుగా సంతయు వారేపుచ్చుకొనిబలిసి బహుభోగులగుచుండిరి. పాపము! సరకులన్నియుఁ బాటుపడిపండించినకాఁపు తఱచుగాఁ దిండిలేక అన్నమో రామచంద్రా! యని యేడువవలసి వచ్చుచుండెను.

కాలముగడచినకొలఁది స్థితిగతులు మఱింతచిక్కులలోఁ బడెను. ప్రజాసంఘాతము లపరిమితముగాఁ బెరిఁగెను. ఈ చిక్కులవలనుండి

మన ప్రస్తుత మిశ్రప్రజాసంఘము బయలుదేఱినది. గతించిన పూర్వప్రకృతిపూర్తిగా నశించక బంకవలెఁ బట్టుకొనియుండును. పూర్వజన్మములందు గోత్రాలు కాచుకొనియో చేఁపలు పట్టుకొనియో అట్టి మఱియొకవృత్తిచేతనో జీవించినవారు వారి తరువాతి నాగరకజన్మములలోఁగూడ దొంగతనమో, ఓడదొంగతనమో, అట్టిదుర్వృత్తి మఱియొకటియో యవలంబించెదువారు. వేటాడుకొనుట కడవులు లేవు, మందలుగాచుకొనుటకు సమీపమున గుట్టలు కొండలు లేవు—ఏ కారణముననో నాగరకతామర్యాదలుగల నరసంఘములోఁ బుట్టినాఁడు, వేటకుఁగాని, చేఁపలు పట్టుకొనుటకుఁగాని, పశువుల మేపుకొనుటకుఁగాని చాలినంత యవకాశము లేదు—స్వభావబలముచేత, పూర్వజన్మవాసనాబలముచేత, వాఁడు అనివార్యముగా దొంగయో దోఁపిడికాఁడో యగుచున్నాఁడు; అంతకంటె అన్యమేమి చేయఁగలఁడు? పౌరాణికను ప్రసిద్ధిపడసినవారును, ప్రాతఃకాల ప్రజాపఠనీయ నామములవారునగు అహల్య, తార, మందోదరి, కుంతి, ద్రౌపది—వీరిసంతతివారైన వనితారత్నములు, ఇష్టమైనను, ఏకకాలమందు, అనేక పతులను గట్టుకొనుటకిఁక అవకాశము లేదు, కావున వారు స్వైరిణులైనారు. ఈకారణముచేతను ఇట్టి యితరకారణములచేతను, భిన్నజాతిస్వభావులగువారు—పరమనాగరకులు పశుప్రాయులు, దేవప్రకృతితోజన్మించినవారు అసురస్వభావముతోఁ బుట్టినవారు—వీరందఱు, నానాలోహములు కరఁగించిపోసినట్లు, కలిసియేకమై ప్రస్తుత ప్రజాసంఘమైనారు. అందుచేతనే, ప్రతిప్రజాసంఘములోను, సాధునారాయణ చోరనారాయణాది వివిధరూపములతో విలాసముగాఁ బరమాత్ముఁడు క్రీడించుచుండుట మనము చూచుచున్నాము. సంఘములో దైవలక్షణసంపన్నులెక్కువగానున్నారో అసురలక్షణములుగలవా రెక్కువగానున్నారోచూచి యాసంఘముయొక్క యోగ్యతాయోగ్యతలు సమష్టిమీఁద నిర్ణయించెదువారు.

ఏషియానాగరకతయంతయుఁ దొల్దొల్ల బయళ్లమీఁదను మహానదులచెంతను సారవంతములగు భూములమీఁదను—గంగ, యాంగి

ట్కెన్నయాంగు, యుఫ్రేటిజు, నదులతీరములందు—బయలు దేఱినది. ఈ నాగరకతలన్నిటికి మూలకారణమైన పునాది సేద్యము ; వీని యన్నిటిలోను దైవస్వభావము ప్రబలమై ప్రధానమై కానిపించుచున్నది. యూరప్పునాగరకతలో ముఖ్యాతిశయముళ్ళవియు పర్వతప్రదేశములలోనో సముద్రతీరములందో యుత్పన్నమైనది—దొంగతనము, ఓడదొంగతనము, ఈనాగరకతకు మూలాధారములు, అసురప్రకృతి యతిశయించి యిందు ప్రధానముగాఁ గాన్పించుచున్నది.

ప్రస్తుతకాలములో సాధ్యమైనంతవఱకు నూహించిచూడఁగా, ఏషియాఖండమధ్యభాగమును, అరేబియా యెడారులును అసురుల నివాసస్థానమై యుండినట్లు తోఁచుచున్నది. అసురసంతతివారగు, ఈ గొఱ్ఱెకాపరులును వేఁటరులును తమ దుర్గమస్థానములనుండి వెలువడి సంఘీభవించి తండాలుతండాలుగావచ్చి దేవతలపైఁబడి ప్రపంచమందంతటను చెల్లాచెదరై పోవునట్లు వారిని దఱిమివేసినారు.

యూరప్పుఖండములో అతిప్రాచీనులైన ఆదినునివాసు లొక తెగవారున్నమాట వాస్తవము. వారు పర్వతగుహాలలోఁ గాఁపురముండెడువారు. వారిలోఁ గొంచెము బుద్ధిమంతులు నీటిలో లోఁతులేని ప్రదేశములందు గుంజ్జలుపాఁతి వానిపై మంచెయిండ్లుకట్టుకొని యుండెడువారు. చెకుముకిఱాతితోఁజేసిన బాణములు, ఈఁటెలు, కత్తులు, గండగొడ్డండ్లు ఉపయోగపఱుచుకొని వారు వానితో అన్నిపనులు చక్కఁబెట్టుకొనెడువారు.

క్రమక్రమముగా ఏషియాజాతులు యూరప్పులోఁ జొరఁబడిన తరువాతఁ గొన్నిభాగములు కొంచెము నాగరకములైనవి. రష్యాలో నొకానొక తెగవారు మాటలాడుభాష దక్షిణహిందూస్థానపుభాషలను బోలియుండును.

కాని, యేషియామైనరునుండి నాగరకతజాతివారు వచ్చి యూరప్పునకు సమీపముగానుండు ప్రదేశములు జయించి యత్యుత్కృష్టమైన నాగరకత నెలకొల్పువఱకు, ఎవ్వరోతప్ప యూరప్పులో దాదాపుగా నందఱు యథాపూర్వముగా మృగతుల్యులుగానే యుండిరి.

ఏషియామైనరునుండివచ్చిన యీనాగరకులను మనము యవనులందుము, యూరోపువారు వారిని గ్రీకులందురు.

కొంతకాలముతరువాత, ఇటలీలో, రోమనులను మోటుతెగవారు నాగరకులగు ఇట్రుస్కనులను జయించి వారి విద్యావివేకవిశేషములను స్వీకరించి, నశించిన పరాజితప్రజానాగరకతకు బదులుగాఁ బ్రత్యేకలక్షణములుగల వారి నాగరకత స్థాపించినారు. క్రమక్రమముగా రోమనులు నల్దెసల యుద్ధము గావించి జయమునొందిరి. యూరప్పులో నైరృతవిదిగ్భాగములనున్న అనాగరకజాతులన్నియును రోమనుల యాధిపత్యముక్రిందికి వచ్చెను; ఉత్తరమందు అడవులలోనుండు అనాగరకులుమాత్రము స్వతంత్రులుగా నుండిరి. ఏమయినను, కాలవశమునఁ గొన్నాళ్ళకు రోమనులు విత్తవిషయభోగములకు దాసులై నిజబలపరాక్రమములు గోల్పోయిరి; ఆతఱిని ఏషియా తన యసురసేనను యూరప్పుమీఁదికి విడిచిపెట్టెను. ఆయసురధాటి కాఁగలేక యూరప్పు టుత్తరదిశయందుండు అనాగరకులు వారి యిండ్లువాకిళ్ళు విడిచివచ్చి రోమను రాజ్యముపైఁబడిరి, రోమము ధ్వస్తమయ్యెను. ఈ ఏషియా దండయాత్రాకాలమున, యూరప్పులోని యనాగరకజాతులవారితోను పరిశిష్టులైన రోమనులతోను గ్రీకులతోను సమ్మిళితమైనయొక క్రొత్తసంకరజాతి యుద్భవించెను. ఇది యిట్లుండ, ఆకాలమున రోమనులు జయించి స్థానభ్రష్టులనుజేసిన యూదులు చెల్లచెదరై యూరప్పునందంతటను వ్యాపించిరి, వారితో వారి నూతనమతమైన క్రిస్టియానిటీకూడ యూరప్పులో వ్యాపించెను. వివిధమతాభిప్రాయవిశిష్టములైన యీనానాజాతులు, నానావిధములైన యీ యసురుల తండాలు మహామాయాదేవిమూసలోఁబడి సంతతాన్యోన్యకలహతీవ్రాగ్నిసంతప్తములై కరఁగి యేకమై యూరప్పులోని ప్రస్తుత ప్రజాసంఘముగాఁ బరిణమించినవి. ఈ ప్రకారముగా అత్యనాగరకమై పశుప్రాయమైన యొక యూరపియన్జాతి సృష్టమైనది. హిందువుల నలుపు మొదలుకొని యత్యుత్తరప్రదేశస్థుల పాల తెలుపువఱకు నానాశరీరచ్ఛాయలు గలవా రందున్నారు; నల్లవెండ్రుకలవారు, ఎఱ్ఱవెం

డ్రుకలవారు, తెల్ల వెండ్రుకలవారు, కపిలవర్ణపు వెండ్రుకలవారు, అందున్నారు; నీలిరంగుకన్నులవారు, నల్లకన్నులవారు, బూడిదరంగు కన్నులవారు అందున్నారు; హిందువుల చక్కని ముఖవర్చస్సు కనుముక్కుతీరుగలవారును, చీనావారి బల్లపఱపుముఖముగలవారును అందున్నారు. కొంతకాలము వారొండొరులతోఁ బోరాడుచుండిరి; ఉత్తరదేశస్థులు ఓడదొంగలై వారికంటె నాగరకజాతులపైఁబడి వారిని హింసించి చంపుచుండెడువారు. ఈమధ్యకాలములో, క్రైస్తవమతశాఖల రెంటికిని అధిపతులగు ఇటలీలోని పోప్పుగారును కాన్స్టాంటినోపిలులోని (పేట్రియర్కు) ప్రధానమతగురువుగారును, మెల్లఁగా రాజకార్యసంబంధముకలుగఁజేసికొని యీ యనాగరకసంఘముల రాజులపైని, రాణులపైని, ప్రజలపైని తమ యధికారము చలాయింపసాగినారు.

ఇఁకను ఆవల అరేబియా యెడారులలో మహమ్మదీయమతము బయలుదేఱినది. అనాగరకులగు అరబ్బులు ఒక మహాజ్ఞాని మతోపదేశములవలన ఆవేశమెత్తినవారై ప్రతిఘటింపరాని బలపరాక్రమములతోఁ బ్రపంచముమీఁదఁ బడిరి. అడ్డులేని యీ మహాప్రవాహము తూర్పునుండియు పడమటనుండియుఁగూడ వచ్చి యూరప్పులోఁ బ్రవేశించెను, దానితోఁగూడ హిందూదేశముయొక్కయు ప్రాచీనగ్రీస్సుయొక్కయు విద్యానాగరకతలు యూరప్పులోనికి వచ్చెను.

మధ్యేషియాలో సెల్జుక్టార్టారులను నొక యసురజాతివారు మహమ్మదీయమతము స్వీకరించి యేషియాలో ఏషియామైనరును ఇతరదేశములను జయించిరి. అరబ్బులు హిందూదేశము జయించుటకు నానాప్రయత్నములు చేసిరిగాని యన్నియు విఫలములయ్యెను. ప్రపంచమంతయును ముంచి మ్రింగివైచిన మహమ్మదీయ విజయోత్తుంగతరంగము హిందూదేశమునకు మాత్రము వెనుదీయవలసివచ్చెను. ఒక్కసారి సింధుదేశమును వారాక్రమించిరిగాని దానిని నిలుపుకోలేకపోయినారు, అటుపిమ్మట మఱియేప్రయత్నమును జేయలేదు.

కాని కొన్ని శతాబ్దులపిమ్మట, తురుష్కులును ఇతరటార్టార

జాతివారును బౌద్ధమతమువదలి మహమ్మదీయులైనప్పుడు, వారుహిం
దువులను పారసీకులను అరబ్బులను జయించి, వారినందఱను వశపఱచు
కొనిరి. హిందూ దేశమును జయించిన మహమ్మదీయులలో ఒక్కఁడును
అరబ్బీగాని పారసీకుఁడుగాని కాఁడు, వారందఱు తురుష్కులును టార్టా
రులును. దండెత్తివచ్చిన మహమ్మదీయుల నందఱను రాజపుత్రస్థాన
ములో 'తురుష్క'లందురు, చారిత్రదృష్టిని అది సత్యమైనమాట.
రాజపుత్రస్థానములో చారణులు "తురక లతిబలవంతులు" అని పాడు
దురు ; అదియు యథార్థమే. కుత్బుద్దీను మొదలుకొని మొగలు
చక్రవర్తులవఱకు—అందఱుటార్టారులే. వారిజాతియు టిబెట్టువారి
జాతియు ఒక్కటే ; కాని మహమ్మదీయులై హిందువులతోను పారసీ
కులతోను పరస్పరవివాహములు చేసికొని వారి గుండ్రని బల్లపఱపు
ముఖములు మార్చుకొన్నారు, ఇదియే యున్న భేదము. ప్రాచీనాసుర
జాతిసంతతివారు వీరే. నేఁడుకూడ వారు కాబూలు, పర్షియా, అరేబి
యా, కాన్స్టాంటినోపిలు సింహాసనముల నధిరోహించి పరిపాలన చేయు
చున్నారు ; గాంధారులు (కాండహారుదేశీయులు) ను పారసీకులును
నేఁటికిఁగూడ తురుష్కులకు దాసులై పడియున్నారు. అతివిపులమైన
చీనారాజ్యముసైతము మంచూరియా టార్టారుల పాదములకడఁ బడి
యున్నది, ఈమంచువులుమాత్రము తమ మతము పరిత్యజించి మహ
మ్మదీయమతము స్వీకరింపలేదు ; వీరు 'మహాలామా'గారి మతశిష్యు
లు. ఈ యసురు లెన్నఁడును విద్యాకోసముగాని విశేషాభివృద్ధికొఱకుఁ
గాని యెంతమాత్రమును జూడలేదు ; వారెఱిఁగిన యొక్కవిద్యయు
యుద్ధము. వీరి రక్తసంపర్కము లేకుండ యుద్ధశూరత్వము విశేషముగా
నుండఁజాలదు. యూరప్పున కుత్తరమునసుండు రణశూరులు పరాక్ర
మవంతులు నగు ప్రజలలో—ముఖ్యముగా రష్యావారిలో—ఈటార్టా
రురక్తమే కానవచ్చుచున్నది ; రష్యావారి రక్తనాళములలోఁ బ్రవ
హించు రక్తములో ముప్పాతిక టార్టారురక్తమే. ఈ దేవాసురయుద్ధ
మింతటితో నంతరింపదు, ఇఁక ముందుకూడ నెంతో కాలము సాగను
న్నది. దేవత లసురకన్యలను పెండ్లాడుచుందురు, అసురులు దేవకన్య

లను అపహరించుచుండురు—బలవత్తరములైన సంకరజాతుల ప్రాదుర్భావమున కిది ప్రధానకారణము.

అరేబియా కాలిఫు సింహాసనమును టార్టారులు ఆక్రమించుకొని క్రైస్తవులకు మహాపుణ్యతీర్థయాత్రాస్థానమగు జెరూసలెమ్‌పట్టణమును ఇతరస్థలములును బట్టుకొని, ఆమహాపవిత్రసమాధిని దర్శింపనీయక అనేక క్రైస్తవులను జంపివేసిరి. క్రీస్తుమతశాఖాధ్యక్షులు రోషోన్మదావిష్టులై యూరప్ఖండంతటనుండు తమ మూఢశిష్యుల నందఱను రేపి తన్మూలమునఁ బ్రభువులను బ్రజలనుగూడఁ గ్రోధోద్రిక్తులఁ గావించిరి. అంతట జెరూసలెమ్మును మ్లేచ్ఛుల యాక్రమణమునుండి తొలఁగించి రక్షించుటకు యూరప్పులోని యనాగరిక ప్రజలు కట్టలు కట్టుకొని ఏషియామైనరువైపు పరుగెత్తి యందుఁ జొరఁబడిరి. వారిలో పెక్కు రన్యోన్యకలహములచే నొకరి గొంతుక యొకరు గోసికొనిరి, కొందఱు వ్యాధిగ్రస్తులై మరణించిరి, శేషించినవారు మహమ్మదీయులచే మారితులైరి. అయినప్పటికి, తమవారిని మహమ్మదీయులు చంపినవెంటనే, ఆ యనాగరకులత్యాగ్రహయుక్తులై యాటవికజనుల ముష్కరహారముతో మఱల గుంపులుగుంపులుగా వచ్చిరి. స్వజనులను దోఁచుకొనుటకుఁగాని, వేఱొక మంచియాహారము దొరకనప్పుడు మహమ్మదీయుల భక్షించుటకుఁగాని వారి కేమియుఁ గొంకుజంకులు లేకపోయెను. ఆంగ్లేయరాజగు రిచెర్డుగారికి మహమ్మదీయుల మాంసముపై మనసన్నమాట లోకవిదితమే.

అనాగరకులకును నాగరకులకును జరుగు సంగ్రామములలో సాధారణముగాఁ బర్యవసాన మెట్లుండునో యిక్కడఁ బ్రాప్తించిన ఫలముగూడ నట్లేయుండెను. జెరూసలెమ్మును తదితరస్థలములును స్వాధీనములుగా లేదుగాని యూరప్పునకుమాత్రము నాగరకతాలాభము గలిగెను. తోళ్లు కప్పుకొని పచ్చిమాంసము తిని మృగప్రాయులుగానుండు ఆంగ్లేయులును, ఫ్రెంచివారును, జర్మనులును, ఇతరజాతులును ఏషియాయొక్క నాగరకతామహాత్త్వము స్వయముగాఁ గనులారఁ

జూచుట తటస్థించినది. ఇటలీలోను ఇతర దేశములలోను నుండు మన నాగజాతివారివంటి యొకవిధమైన క్రైస్తవసైనికులు తత్త్వశాస్త్ర మధిగమింపఁ బ్రారంభించిరి. వారిలో నొక శాఖవారగు 'టెంప్లరు' లను క్రైస్తవసన్యాసిసైనికులు నిరూఢాద్వైతవేదాంతులయి క్రీస్తు మతము నధిక్షేపించినారు. వారు విశేషముగా ధన మార్జించుటచే, యూరప్పులోని రాజులు, పోప్పుగారి యుత్తరువులపైని మతరక్షణ వ్యాజమున, వారిని దోఁచుకొని చంపి నిర్మూలము గావించినారు.

ఇది యిట్లుండ, ఆమూల, మూరులను నొకమహమ్మదీయజాతి వారు స్పెయినుదేశములో నాగరకరాజ్యము స్థాపించి వివిధ విద్యాశాఖావ్యాసంగముచేసి యూరప్పులోఁ బ్రథమ విశ్వవిద్యాలయమును బ్రతిష్ఠించినారు. నానా దేశములనుండి—ఇటలీనుండి, ఫ్రాన్సునుండి దూరస్థమగు ఇంగ్లండునుండి సైతము—విద్యార్థులువచ్చి మూఁగెడు వారు, రాజకుటుంబములలోని బిడ్డలుకూడ సమరవిద్యయును సత్సంప్రదాయనాగరకతా మర్యాదలును నేర్చుకొనుట కటకు వచ్చెడువారు. నూత్న పద్ధతిని ఇండ్లు, దేవాలయములు, ఇతర మహామందిరములు నిర్మింప మొదలుపెట్టిరి.

అయిన నేమి ? యూరప్పంతయును క్రమక్రమముగా నొక మహాసేనాశిబిరముగా మారిపోయెను—ఇప్పటికిఁగూడ నట్లేయున్నది. మహమ్మదీయులు రాజ్య మేదేని జయించినప్పుడు, వారి రాజు అందధిక భాగము తనకుంచుకొని తక్కిన భాగము తన సేనానాయకులకుఁ బంచిపెట్టెడువాఁడు, వారు రాజునకు పన్ను చెల్లింపనక్కఱలేదు కప్పము గట్టనక్కఱలేదు, ఆవశ్యకమైనప్పుడు ఎంతోకొంత నిర్ణీతసంఖ్యగల సేనమాత్రము సేకరించి పంపుచుండవలెను. ఈయేర్పాటువలన ఎప్పుడు స్థిరముగా నొక సైన్యము సిద్ధముచేసిపెట్టుకొను బాధ తప్పిపోయినది; కావలసినప్పుడు బలవత్సైన్య మొకటికూడి యుద్ధసమయములందుమాత్రమే రాజునకుఁ బనిచేసెడిది. ఈ భావముతోఁగూడిన పద్ధతియే కొంతవఱ కిప్పటికిని రాజపుత్రస్థానములో నున్నది. దానిని మహమ్మదీయులు పశ్చిమఖండమునకుఁ గొనిపోయినారు, యూరపీయ

నులు మహమ్మదీయులనుండి దానిని గ్రహించినారు. కాని వీరికి వారికి భేదమున్నది. మహమ్మదీయపద్ధతిప్రకారము—రాజు, అతనికి యుద్ధ సమయమందు సేనలు సమకూర్చి సహాయము కావలయు సేనాధిపతి బృందము, వారి సేనలు అటుండఁగా—మిగిలిన యావజ్జనులు సాధారణప్రకృతివర్గముగా నుండి యుద్ధసమయములందు నిరుపద్రవముగా శాంతముగా నుండెడువారు. ఇఁక యూరప్పులోనో, రాజును దత్సహాయ సేనాధిపతివర్గమును ఒకపక్షముగానుండి యావత్ప్రకృతిజనవర్గమును దమకు దాసులుగాఁ జేసికొనినారు. ప్రతివాఁడును సహాయసేనానాయకుని సంరక్షణములో అతని దాసుఁడుగా నుండవలసినచ్చెను, అట్లుండినచో ఆతనిని బ్రతుకనిచ్చుట; రా! యని యాజ్ఞయైనతత్క్షణమే వచ్చి యుద్ధముచేయుటకు అతఁడెప్పుడును సంసిద్ధుఁడై యుండవలెను.

నాగరకతాభివృద్ధి, నాగరకతాభివృద్ధి—అని యూరప్పువారు ఊరకే రజ్జులుగొట్టుదురే! దాని యర్థమేమి? అయోగ్యసాధనములైనను మంచివే యని చెప్పి—అనఁగాఁ గార్యమైనఁజాలు, గార్యకారులైన సాధనము లన్నియును ఉచితములే యని—నిర్విఘ్నముగా అభీష్టములను నెఱవేర్చుకొనుట. దానిఁబట్టి యొకానొకప్పుడు చోరకృత్యములు, అనృతము, ఉరిదీసి చంపుట—యివి యుక్తములుగానే కానిపించును. కావలికాంక్షగ్రాక్సు కూడవచ్చుచున్న మహమ్మదీయులు ఆఁకటిబాధచేఁ గొంచెము రొట్టె దొంగిలించినందులకు స్టాన్లీదొరగారు వారిని కొరడాతోఁ గొట్టుట నిర్దోషమని యది నిరూపించుచున్నది. యూరపియనులు కాలిడినచోట్ల నెల్ల వెంటనే తత్ప్రదేశాదిమనివాసుల సమూలనాశనము జరుగుననుమాట సత్యమనుటకు దేశచరిత్రలే ప్రత్యక్షనిదర్శనములు. "నేనువచ్చి యాక్రమించుకొనవలెనని యున్నది గనుక నీవిటనుండి లేచిపొమ్ము"—ఇదియూరపియనుధర్మశాస్త్రసారము ఈనీతిని అదినడపి యంగీకరించి యామోదించుచున్నది. ఈ 'నాగరకతాభివృద్ధి, ప్రభావమువలననే లండనులో దంపతుల యన్యోన్యద్రోహమును, పారిసులో నిరాధారులైన భార్యను బిడ్డలను విడిచి పాఱిపోయి మగవాఁడు ఆత్మహత్య గావించుకొనుటయు, ఘోరపాట్లుగాను,

ప్రమాదములుగాను పరిగణింపఁబడుచున్నవి, కాని నేరములుగాను పాపములుగాను ఎన్నఁబడుచుండుట లేదు.

ఇస్లాము నాగరకత వేగముగా వ్యాపించిన మొదటి మూఁడు శతాబ్దులలోను, క్రిస్టియానిటీయొక్క మొదటి మూఁడువందల యేండ్ల లోను, స్థితిగతులెట్లున్నవో పోల్చి చూచుకొనుము. మొదటి మూఁడు వందలసంవత్సరములలోను క్రిస్టియానిటీమాట ప్రపంచ మెఱుఁగనే యెఱుఁగదు. కాన్స్టాంటైనుగారి ఖడ్గబలముచే క్రైస్తవమతమున కతని రాజ్యములో తావు దొరకినప్పటినుండియైనను, క్రిస్టియానిటీ, వైహికధర్మవ్యాపనమునకుఁ గాని యాముష్మికధర్మవ్యాపనమునకుఁ గాని యేవిధముగా సహాయమైనది? భూగోళము చరగ్రహమని నిర్ధారణ చేయుటకుఁ దొలుసారి ప్రయత్నించిన యూరపియన్పండితునకు క్రైస్తవమత మేమి బహుమతియీయఁజూచినది? ఏప్రకృతిశాస్త్రవేత్తను క్రైస్తవమతము సమ్మానించి సంతోషించి సంతోషపెట్టినది? క్రైస్తవమతగ్రంథజాలము ధర్మశాస్త్రమునకుఁగాని దండశాస్త్రమునకుఁ గాని వాణిజ్యవ్యవహారనీతులకుఁగాని కళలకుఁగాని యేమైన ననుకూలముగా నున్నదా? క్రైస్తవమతసంఘ మిప్పటికైనను అపవిత్రీకృతగ్రంథవ్యాపనమున కంగీకరింపదే! ప్రస్తుతకాలపు ప్రకృతిశాస్త్రములును ప్రస్తుతకాలపు విద్యలును లోఁతుగాఁ దెలిసినవాఁడింకను, త్రికరణశుద్ధుఁడైన క్రైస్తవుఁడుగా నుండుట, సాధ్యమగునా? బైబిలులోని నవీనశాసనము (న్యూటెస్టమెంటు) లోఎక్కడను ప్రకాశితముగాఁగాని గూఢముగాఁగాని యేశాస్త్రమును ఏకళను అభినుతించు వాక్యమొకటియు లేదు. ఇది యిట్లుండ ఖురానులోనో, దానికనుబంధముగానుండి మహమ్మదుగారి ఉపదేశవాక్యము లని పారంపర్యముగాఁ జెప్పఁబడుచుండు హదిత్తు (సన్నా) లోనో, ప్రత్యక్షముగానో సూచనగానో, సమ్మతింపఁబడి ప్రోత్సాహపఱుపఁబడని శాస్త్రముగాని కళగాని లేదని చెప్పవచ్చును. యూరప్పులోని మహా బుద్ధిశాలులు—వాల్టేర్, డార్విన్, బూక్నర్, ఫ్లామూరీయన్, విక్టర్హ్యూగో, ఇంక నట్టివారగ్రేసరులు—క్రిస్టియన్మతబోధకులచే ఇప్పటికిని దూషింపఁబడుచు

న్నారు, పరమచ్ఛాందసక్రైస్తవబృందముయొక్క నిందలపాలగుచున్నారు. "దీర్ఘదర్శియుఁ బ్రవక్తయుఁ నగు మహమ్మదుగారియందుమాత్రము వారికి విశ్వాసము లేదుగాని, వారును భగవంతుఁ డున్నాఁడని నమ్మువారే" యని యిస్లాముమత మనుచున్నది. మతములు ప్రపంచాభివృద్ధికి సహకారులుగానున్నవా? ప్రతిబంధకములుగా నున్నవా? అనువిషయముఁన ఈరెండుమతముల గుణాగుణములను బాగుగా పరీక్షచేసి చూచినయెడల, నేయేచోట్ల ఇస్లాముమతము ప్రవేశించినదో ఆయాప్రదేశములయం దనాదిగానుండు పూర్వనివాసులను, ఆమతము కాపాడినదనియును, ఆజాతులవారును, వారి భాషయును, వారి జాతీయధర్మములును, నేఁటివఱకు నిలిచి యున్నవనియును, విస్పష్టముగాఁ గానిపించును.

క్రైస్తవయానిటీ యట్టి ఘనకార్యము చేసినట్లు నిదర్శన మెక్కడ నున్నది? స్పెయినులోని అరబ్బీలును, అమెరికాయందలి ఆదిమనివాసులును ఏరీ! పాపము! ఇప్పు డెక్కడ నున్నారు? యూరప్పులోని యూదులను క్రిస్టియను లెట్లాదరించుచున్నారు? వైద్యశాలాది ధర్మనిర్మాణములుతప్ప యూరప్పులోని కార్యేతరమేదియును క్రీస్తుబోధనముల కనుకూలముగా లేదు. యూరప్పు ఎంత యభివృద్ధినందినను, ఆ యభివృద్ధియంతయును క్రీస్తుబోధనములకు విరుద్ధముగాఁ బ్రవర్తించినందువలనను క్రిస్టియానిటీకి ద్రోహముచేసినందువలనను గలిగినది కాని అన్యథాకలుగ లేదు. క్రిస్టియానిటీకి యూరప్పులోఁ బూర్వమున్న సర్వాధికార మిప్పుడుకూడ నున్నయెడల, మతాపరాధుల విమర్శించు మహాసభ (Inquisition.) మఱల బయలుదేఱి పాశ్చరు, కోకు మున్నగు ప్రస్తుత ప్రకృతిశాస్త్రవిశారదులను దహనముచేయుటకుఁ గావలయు నగ్నిని ప్రజ్వలింపఁజేసియుండును! స్తంభములకు విఱిచికట్టి నెప్పుంటించి డార్విసుగారిని ఆయన శిష్యకోటిని ఈపాటికి దగ్ధముచేసియుండును! ప్రస్తుతకాలపు యూరప్పులో క్రిస్టియానిటీ వేఱు, నాగరకత వేఱు, తన ప్రాచీన శత్రువైన క్రిస్టియానిటీని జంపి, క్రైస్తవమతబోధకపురోహితబృందమునెల్ల నణఁగఁద్రొక్కి ప్రస్తుతము వారిచేతు

లాలోనుండు విద్యాలయములు మున్నగు లోకోపకారకధర్మకార్యస్థానములను వారినుండి లాగుకొని తన వశము చేసికొనవలెనని నాగరకతాదేవి నడుము కట్టుకొని సిద్ధముగానున్నది. మూఢులైన పామరజనుల ప్రాపువలన క్రిస్టియానిటీ తన బ్రతుకింకను సాగించుకొనుచున్నదిగాని లేనియెడల నొక నిమిషమైనను జీవింపలేక యీపాటికి నిర్మూలమై పోవలసినదే! ఏలనఁ బట్టనవాసులగు దరిద్రులు, ఇప్పటికిని క్రైస్తవమతగురువులకుఁ జన్మశత్రువులై యున్నారు. ఇఁక ఇస్లాము సంగతి యెత్తుకొందము. మహమ్మదీయుల దేశములలో ఏర్పాటులన్నియును స్థిరముగా ఇస్లాము మతముమీఁద ఆధారపడియున్నవి; తన్మతబోధకులు రాజకీయోద్యోగు లందఱిచేతను అధిక గౌరవము నందుచున్నారు; ఇతర మతబోధకులుకూడ గౌరవింపఁబడుచున్నారు.

యూరప్పువారి నాగరకతను ఒకబట్టతోఁ బోల్పవచ్చును. ఆవటునిర్మాణ మీక్రిందిసాధనములతోఁ గావింపఁబడినది. సముద్రప్రాంతమందలి యొక విశాలపర్వతాకీర్ణ సమశీతోష్ణప్రదేశమను మగ్గములోఁ బెట్టి యాబట్ట నేసినారు; నానాజాతిసమ్మేళనమువలనఁ గలిగిన బలపరాక్రమవంతమైన యొక సంకరజాతి యాబట్టకాధారమైన దూది; స్వరక్షణమునకును స్వమతరక్షణమునకును గావించు యుద్ధము పడుగు (నిడుపునేఁత); కత్తి చేతఁబట్టువాఁడు ఘనుఁడు, అట్లు చేయనివాఁడు స్వాతంత్ర్యమును గోల్పోయి పరాధీనుఁడై మఱియొక యోధుని సంరక్షణమువలన బ్రతుకును. వాణిజ్యము దానిపేక (అడ్డనేఁత). ఈ నాగరకతకు సాధనము కత్తి, దానికి సహాయములు దేహబలమనోధైర్యములు, దానియుద్దేశము ఇటను అటను భోగము(సుఖానుభవము).

ఇఁక మనస్థితి యెట్లున్నదో చూతము. ఆర్యులు శాంతిప్రియులు, కృషికులు,—భూమి దున్నుకొని బ్రతుకువారు—; నెమ్మదిగా వారు కుటుంబపోషణము చేసికోఁగలిగిన యెడల వారికది చాలును, తృప్తాత్ములై హాయిగా నుందురు. అట్టి జీవనము చేయువారికిఁ గావలసినంత తెలివియుండును. ఆలోచనశీలురును నాగరకులును అగుటకు ఎక్కువ యవకాశముండును. మన జనకమహారాజు స్వహస్తము

లతో నాఁగలిపట్టుకొని యున్నవాఁడు; ఆయనయే ఆకాలమందలి తత్త్వవేత్తలలో అగ్రగణ్యుఁడుకూడ నయ్యెను. మనలో ఆదినుండియు ఋషులు మునులు యోగులు పుట్టుచునే యున్నారు; ప్రపంచమంతయు వట్టి భ్రాంతియని వారు మొట్టమొదటనుండియు ఎఱుఁగుదురు. నీయిష్టము వచ్చినట్లు దెబ్బలాడుము! దోఁచుకొనుము! నీకుఁ గావలయుసుఖము కేవల శాంతిలో నున్నదిగాని మఱొకయెడ లేదు! శాంతి, శరీరసుఖ త్యాగమువలన లభించునుగాని అన్యథా లభింపదు! శరీరపుష్టివలన నిజమైన సౌఖ్యము దొరకదు, అది విద్యావ్యాసంగమువలన మనోబుద్ధుల నభివృద్ధిచేసికొని ప్రజ్ఞానియగుటవలననే దొరకును! వ్యవసాయమునకై అడవిపొళ్ళు కొట్టి బాగుచేసికొన్న వారిమహానుభావులే!

అడవికొట్టి తెఱపిచేసికొనినచోట్ల హోమకుండములు త్రివ్వి వేదికలు కట్టుకొన్నారు. భరతవర్షముయొక్క నిర్మలాకాశముమీఁదికి యజ్ఞసంబంధమైన పవిత్రహోమధూమములు ఎగురుచుండెడివి; ఆప్రశాంతప్రదేశములు వేదమంత్రములతో మాఱుమ్రోఁగుచుండెడివి— పశువులు ఇతరమృగములును నిరపాయముగా నిర్భయముగాఁ బచ్చిక మేయుచుండెడివి. సరస్వతీధర్మదేవతల చరణసరోజములకడనే సేవ చేయుటకు ఖడ్గము నియోగింపఁబడెను. ధర్మసంరక్షణమును పశుప్రజాపోషణమునే ఖడ్గముయొక్క విహితకృత్యములు. అపాయములోనుండు దుర్బలులను కాపాడినవాఁడే శూరుఁడు—క్షత్రియుఁడు. సర్వరక్షకమైన ధర్మమే అసిలాంగలములపై నధికారము చేయుచుండెను. ధర్మదేవతయే రాజాధిరాజు; ఎప్పుడును—యావత్ప్రపంచము నిద్రించుచున్నప్పుడుసైతము—అతఁడు మేలుకొనియుండెను. ధర్మదేవత పరిపాలించి రక్షించుకాలములో నందఱును స్వేచ్ఛాసుఖ మనుభవించుచుండిరి.

ఆర్యు లెక్కడనుండియో పరదేశమునుండివచ్చి హిందూదేశముపైబడి తదాదిమనివాసులను నిర్మూలనముచేసి వారిభూములను లాగుకొని యటఁ గాఁపుర మేర్పఱచుకొన్నారని యూరపియన్పండితులేమేమో చెప్పుదురు! అవన్నియు అవివేకసంభావణములు! కేవ

లాసంగతప్రలాపములు! మన దేశపు విద్యావంతులుకూడ దాని కంత కును తలలూఁపి తథాస్తు! అనుట వింతలలో వింత! అంతటితో నూర కుండక, ఆఘోరమైన అనృతము లన్నియు మన పసిబిడ్డలకు బోధించు టకంటె నికృష్టతరమైన కృత్యము మఱేదియు లేదు!

నేను వట్టి మూఢుఁడను; పాండితీసంపన్నుఁడననివప్రజ్ఞలుపల్కి ప్రజలను మోసముచేయను; కాని నాకున్న యల్పజ్ఞానముతోనే, పారిసులో జరిగిన మహాసభలో, అట్టియభిప్రాయములు తప్పని దృఢముగా స్పష్టముగాఁ జెప్పినాను. ఈవిషయమై మన పండితులతోనుపాశ్చాత్య పండితులతోను—అనేకులతో—ప్రసంగించుచున్నాను; అవకాశము చూచుకొని యీఅపసిద్ధాంతమునకు సవివరణముగా అనేకాక్షేపణము లగపఱుపఁగలనని నాకు ధైర్యమున్నది. "మీరు చదువుకొన్నవారు; దయచేసి మీవేదములను, మీశాస్త్రములను, మీయితర ప్రాచీనగ్రంథములను గాలించి చదివి స్వయముగా స్వతంత్రమైన సిద్ధాంతములు చేసికొనుఁడు" ఇదియే మీకును మనపండితులకును నేఁజేసికొనుమనవి.

అవకాశము కలిగినప్పుడెల్ల యూరపియనులు పరదేశములలో అనాదిగా నివసించువారి నందఱను సమూలముగాఁ బరమపదమునకుఁ బంపించి, వారిభూములమీఁద సుఖముగాఁ గాఁపురము చేయుదురు, కావున ఆర్యజాతివారుకూడ అట్లేచేసి యుండవలెనని యూహింతురు. దేశములో ఇంటిపట్టుననేయుండి కలిగియున్న దానితోఁ గాలక్షేపము చేయుఁజూచు పాశ్చాత్యులను వట్టి అప్రయోజకులఁగాను పనికిమాలిన నిర్భాగ్యులఁగాను ఎంచెదరు, కనుక చంపి, దోఁచుకొని, పరుల భూధనములు లపహరించి, తిని, తెగబలియుట యెట్లో యని తలపోయుచు, అడవిమృగములవలె వారు ప్రపంచమంతయుఁ దిమ్మరుటతప్పదు— అందుచేత ఆర్యులుకూడ అట్లే చేసియుందురని సిద్ధాంతపఱుచుచున్నారు !! నాయనలారా ! అట్లు చేసినట్లు నిదర్శనము లెక్కడ ? వట్టి యూహాలా ? ఉజ్జాయింపు లెక్కలా ? అటైనచో, మీతలయఁ దోఁకయులేని విపరీతపు టూహాలను మీకడుపులోనే పెట్టుకొని యుంచుకొనుఁడు! పైకి వెళ్ళఁగ్రక్కకుఁడు!

ఆర్యులు అన్యదేశమునుండివచ్చి హిందూదేశములోఁ బ్రవేశించిరని యేవేదములో నేసూక్తములోనున్నది? పశుప్రాయులుగానుండు ప్రాచీనదేశస్థులను ఆర్యులు పరిమార్చిరను ఊహ మీకెట్లుకలిగినది? అట్టియూహ కాధారమేమి? అట్టి యసంగతప్రసంగములవలన మీకు వచ్చు లాభమేమి? మీరామాయణపుఁ జదువంతయును చట్టుబండలై పోయినది, దానిలోనుండి యీవిచిత్రవిపరీతకథ యేలకల్పించెదరు?

రండు, రామాయణమునకేరండు! రామాయణమనఁగా నేమి? మృగతుల్యులుగా దక్షిణహిందూస్థానములో మొట్టమొదటనుండియు నున్న జాతులవారిని ఆర్యులు జయించుటయా? సరే! అట్లేకానిండు! శ్రీరామచంద్రమూర్తి నాగరకుఁడైన ఆర్యజాతిప్రభువు. అతఁ డెవనితోడ దెబ్బలాడెను? లంకాధిపతియగు రావణునితో! రావణుని నాగరకతయు లంకానాగరకతయు, రాముని నాగరకతకంటెనుఅయోధ్యానాగరకతకంటెను కొంచె మెక్కువగాని తక్కువగాదని రామాయణమించుక చదివినవారికైనను స్పష్టము కాఁగలదు. ఇఁకను ఈవానరులును ఇతర దక్షిణహిందూస్థానజాతులవారును ఎప్పుడు జయింపఁబడినారు? జయింపఁబడుట యట్లుండఁగా, వారందఱు శ్రీరాములవారి స్నేహితులే! ఆయనకుసాహాయ్యము చేసినవారే! రామచంద్రమూర్తి ఏవాలిరాజ్యమును స్వాధీనము చేసికొన్నాఁడో, యేగుహుని రాజ్యముకొట్టి కలుపుకొన్నాఁడో చెప్పఁడు నాయనలారా!

అయినప్పటికి అక్కడక్కడ ఆర్యులకును ఆదిమనివాసులకును యుద్ధములు జరిగియుండవచ్చును. రాక్షసారణ్యములలో కపటమును ఒకఁడో యిద్దఱో హోమాగ్ని యెదుటఁ గనులుమూసికొని ధ్యానము చేయుచున్నట్లు నటించుచు, రాక్షసు లెప్పుడువచ్చి తమమీఁద రాలును ఎముకముక్కలును విసరుదురని యెదురుచూచుచుండవచ్చును. కోరినట్లు జరిగినతత్క్షణమే మూలుగుచు కూనరాగములు పెట్టుచు వారు రాజులయొద్దకుఁ బోయియుండవచ్చును. అంతట రాజులు కవచధారులై ఖడ్గాదిసాధనములతో తీవ్రజవనాశ్వములపై నెక్కివచ్చియుండవచ్చును. ఆదిమనివాసులైన రాక్షసులు శూలతోను అమ్ములతోను

ఎంత కాలము యుద్ధములో నిలువఁగలరు? రాజులు వారిని జంపిరో తఱిమినైచిరో తమతమ రాజధానులకుఁ దిరుగఁ బోయియుండవచ్చును. సరే! యివన్నియు సంభవించియుండవచ్చును, కాని దానిఁబట్టి, ఆర్యులు వారిభూము లాక్రమించి యుపహరించినారని యెట్లు నిర్ధారణ చేయఁగలరు ? ఆమాట రామాయణములో ఎచ్చటనున్నది?

నుంచి వెడల్పుగలిగి నౌకాప్రయాణమున కనుకూలములైన నదులతో విశాలమై, ఉష్ణమై, మెరకపల్లములులేక మట్టమైయున్న దేశము, మన ఆర్యనాగరకతావస్త్రమునకు మగ్గము. మహానాగరకులు, అర్ధనాగరకులు, అనాగరకులు (దాదాపుగా అందఱు ఆర్యులే) కలిసిన ప్రజాసంఘము ఆవస్త్రమునకు ముఖ్యాధారమైన దూది. వర్ణాశ్రమాచారములు (బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రవర్ణములు—బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్యాసాశ్రమములు) దానిపడుగు. ప్రకృతిసామాన్యధర్మములగు స్పర్ధ, అహమహమిక, మున్నగువానిని నిర్జించుటయే దానిపేక.

ఓ ! నాయూరపియనుమిత్రులారా ! మీరువచ్చి బాగుచేసిన దేశ మేది? యని మిమ్ముడుగనిచ్చెదరా ! మీకు దుర్బలజాతు లగపడినచోటులనెల్ల వానిని వేళ్లతోఁగూడ పీఁకి పాఱవేసి నాశనము చేసినారని చెప్పవచ్చును. వారి భూములమీఁదికిఁబోయి మీరు పాదుకొన్నారు, వారిని శాశ్వతముగా ఆవలికి సాగనంపినారు. మీ అమెరికా, మీ ఆస్ట్రేలియా, న్యూజీలండు, మీ పసిఫి క్మహాసముద్రద్వీపములు, దక్షిణాఫ్రికా—వీనిచరిత్రలు కొంచెము సెలవిచ్చెదరా ? ఆయాదేశములందలి యాదిమనివాసు లిప్పుడెక్కడనున్నారు? వారందఱు నశించినవారు, అడవిమృగముల నంతరింపఁజేసినట్లు మీరు వారిని నిశ్శేషముగాఁ జంపివేసినారు. మీరట్లుచేయుటకు సమర్థులుగానిచోట్ల—అట్టిప్రదేశములందుమాత్రమే—ఇతరజాతు లింకను జీవించియున్నవి.

హిందూదేశమట్లెన్నఁడును జేయలేదు. ఆర్యులు దయామయులు, అత్యుదారపురుషులు, వారిహృదయములు పారావారమువలె

నపారములు, వారిప్రజ్ఞాబుద్ధు లమానుషములు; బుద్బదప్రాయములై, పైకి ఇంపుగా నగపడినను యథార్థముగా రాక్షసకృత్యములైయుండు, ఈదుష్టసంకల్పములకు వారు వారియంతరంగములలో నెన్నఁడును తావీయలేదు. ఓ ! నాస్వదేశీయులైన వివేకహీనులారా ! ఆర్యులు అదిమనివాసుల దేశమాక్రమించి యందుఁ గాఁపుర ముండుటకై వారినందఱను సంహరించివేసినయెడల, ఈ వర్ణాశ్రమాచారనియమములుండునా ?

యూరప్పువారియుద్దేశము, ఆత్మజీవనార్థమన్యు లందఱను అంతరింపఁజేయుట. ఆర్యులయుద్దేశము శ్రేయోభివృద్ధిగావించి, ఉద్ధరించి, యందఱను తమంతవారిని, తమకంటె ఎక్కువవారినిగూడఁ, జేయుట. యూరపియనుల నాగరతకు సాధనము కత్తి. ఆర్యనాగరకతా సాధనము వివిధవర్ణవిభాగము. ఈవర్ణవిభాగనిబంధనము నాగరకతా సౌధమునకు నిశ్రేణివంటిది; దానివలన అందఱును—ఎవరి విద్యావివేకపరిపాకముల కనుగుణమైన యున్నతపదములకు వా రెక్కుచు—నిరంతరాభివృద్ధి నొందఁగలరు. యూరప్పులో—బలవంతునకు జయము, బలహీనునకు మరణము—ఇది సర్వత్ర కానిపించునది. భరతభూమిని ఆయలంజేసిన ప్రతి సాంఘికనియమమును దుర్బలుల సంరక్షించుటకై యుద్దేశింపఁబడినది.

సంపూర్ణము.





# తప్పుల పట్టిక.

| పుట | పేరా | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ఠిక ii | 2 | 5 | ఆఘహో | ఆమహో |
| ii | 3 | 2 | బట్టలో | బట్టలలో |
| 6 | 1 | 17 | గదలవ | గదల్వ |
| 6 | 1 | 19 | దేశములో | దేశములో |
| 7 | 1 | 4 | అథోగతి | అధోగతి |
| 10 | 2 | 4 | క్రియార్ధ | క్రియార్థ |
| 10 | 2 | 5 | తదర్ధానాం | తదర్థానాం |
| 10 | 2 | 7 | నిష్ప్రియా | నిష్ప్రియో |
| 11 | 2 | 7 | యుండును | యుండును. |
| 12 | 5 శ్లో | 2 | త్యక్త్వ | త్యక్త్వా |
| 12 | 6 | 2 | నీచమైన | నీచమైన |
| 12 | 7 | 1 | త్రిష్ఠ | తిష్ఠ |
| 12 | | 1 | దేశస్తుండు | దేశస్థుండు |
| Ft note | | | | |
| డిటో | | 3 | తత్త్యములు | తత్త్వములు |
| డిటో | | 5 | ఉన్నవి | ఉన్నవి. |
| 14 | 1 | 2 | ములతోఁ | ములతోఁ |
| 14 | 1 | 8 | అయాన | ఆయన |
| 14 | 1 | 15 | పిఠిక | పీఠిక |
| 14 | 1 | 17 | నుండెను. | నుండెను |
| 15 | 2 | 9 | అని | ఆని |
| 17 | 1 | 5 | అందు | అందు |
| 17 | 2 | 2 | శాద్ధ | శాద్ధ |
| 17 | 3 | 5 | లత్కృము | లక్ష్యము |
| 17 | 3 | 7 | సమర్ధ | సమర్థ |
| 19 | 1 | 7 | దారా | ధారా |
| 20 | 1 | 5 | ఓక్క | ఒక్క |
| 20 | 1 | 6 | ముఖ్యోశ్జదేశ | ముఖ్యోద్దేశ |
| 20 | 3 | 3 | కీపరిక్కృతి | పరిష్కృతి |
| 20 | 3 | 3 | రాజయ | రాజకీయ |
| 20 | 3 | 9 | పైన | పైని |
| 21 | 2 | 2 | సమావము | సమానము |

| పొరట. | పేరా | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 21 | 2 | 4 | కులీసులు | కులీసుల |
| 21 | 2 | 6 | విథేయ | విధేయ |
| 21 | 3 | 4 | పరమార్థము• | పరమార్థము, |
| 22 | 1 | 1 | నిర్ణిరోధనము | నిర్ణిరోధము |
| 22 | 1 | 8 | మైదేహా | మైనదేహా |
| 22 | 2 | 4 | యున్వది | యున్నది |
| 22 | 2 | 5 | దానిన్ని | దానిని |
| 23 | 1 | 4 | అసత్య | అపత్య |
| 23 | 1 | 11 | అనేకా | అనేకా |
| 23 | 1 | 12 | ప్రిస్తుత | ప్రిస్తుత |
| 23 | 1 | 18 | దెళ్ళ | దెబ్బ |
| 25 | 1 | 15 | ఇతరునుంచుకొని, దో | ఇతరులనుదోంచుకొని, |
| 25 | 1 | 20 | మనో | మనో |
| 25 | 1 | 25 | సమ్మర్థము | సమ్మర్దము |
| 26 | 2 | 2 | మనుష్య, | మనుష్యం |
| 26 | 2 | 8 | ందామంతటందాచే | ందమంతటందాచే |
| 26 | 2 | 18 | లోకులు | లోకులు |
| 27 | 1 | 8 | స్వాస | శ్వాస |
| 28 | 3 | 1 | శరీరములో | శరీరములో |
| 28 | 5 | 8 | నిశ్సందే | నిస్సంశే |
| 28 | 5 | 8 | ధుృవ | ధృవ |
| 28 | 6 | 8 | ఖానులు | ఖానులు |
| 29 | 1 | 10 | భావ | భాగ |
| 29 | 1 | 11 | కాగ | కావ |
| 29 | 1 | 22 | పుట్లిన | పుట్టిన |
| 29 | 1 | 24 | చున్నారు | చున్నారు. |
| 30 | 1 | 1 | నాగరలకు | నాగరకులగు |
| 30 | 2 | 11 | తో | తో |
| 30 | 2 | 15 | సంగతులు | ఈసంగతులు |
| 30 | 2 | 15 | వలెను. ఈ | వలెను. |
| 31 | 1 | 8 | స్త్రీపురుషులు | స్త్రీపురుషులు |
| 31 | 1 | 7 | దుస్థుల | దుస్తుల |

| పుట. | పేరా | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 31 | 2 | 15 | యేండ్లు శాగానే | యేండ్లు రాఁగానే |
| 31 | 2 | 16 | బుద్ధి | బుద్ధి |
| 32 | 1 | 5 | పాథారణ | పాధారణ |
| 32 | 1 | 18 | ఆది | అది |
| 32 | 1 | 13 | ప్రిఉత్తరము | ప్రత్యుత్తరము |
| 32 | 2 | 3 | ఎక్కడ | ఎక్కడ |
| 32 | 2 | 9 | భాధ | బాధ |
| 32 | 2 | 10 | దర్శన | దర్శన |
| 32 | 2 | 10 | బార | భార |
| 32 | 2 | 11 | థారణ | ధారణ |
| 33 | 1 | 15 | ఇవ్వ | ఇవ్వు |
| 33 | 1 | 22 | శ్రిద్థ | శ్రద్ధ |
| 34 | 1 | 2 | గట్టించు | గుట్టించు |
| 34 | 1 | 8 | శేవకు | సేవకు |
| 34 | 1 | 9 | ఆయమ్మిత్రు | అయమ్మిత్రు |
| 34 | 1 | 10 | ఆఫ్రీకా | ఆఫ్రికా |
| 34 | 1 | 10 | ఆస్ట్రియా | ఆస్ట్రేలియా |
| 34 | 1 | 13 | పట్టణ | పట్టన |
| 34 | 1 | 18 | సాథారణ | సాధారణ |
| 34 | 1 | 21 | ఖేదము | భేదము |
| 34 | 1 | 22 | ఆమెరి | అమెరి |
| 34 | 2 | 2 | బట్టలను | బట్టలును |
| 35 | 1 | 15 | యావశార | యావకార |
| 35 | 1 | 16 | ఆమె | అమె |
| 36 | 1 | 14 | న్యాయము | స్వయము |
| 36 | 2 | 1 | దెహా | దేహా |
| 37 | 1 | 8 | కై | కై |
| 37 | 2 | 6 | నోకపూ | నోకపూఁ |
| 38 | 1 | 8 | ప్రిసిద్ధి | ప్రసిద్ధి |
| 38 | 1 | 21 | యిండ్లలోను | యిండ్లలోను |
| 39 | 1 | 4 | వరన | వరుస |
| 40 | 3 | 11 | మనోరధుల | మనోరథుల |

| పుట. | పేరా | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 41 | 1 | 6 | లెదు | లేదు |
| 41 | 2 | 13 | పరశీదేయుల | పరదేశీయుల |
| 42 | 1 | 1 | మనల | మన |
| 42 | 2 | 6 | థూళి | ధూళి |
| 42 | 2 | 7 | వస్సు | వస్తు |
| 43 | 1 | 7 | స్పుటము | స్ఫుటము |
| 43 | 1 | 10 | షితోఁ | క్షితోఁ |
| 43 | 2 | 1 | విథాన | విధాన |
| 44 | 1 | 11 | వపుకరు | వపుకవు |
| 44 | 1 | 12 | కోని | కొని |
| 45 | 1 | 5 | కై | కై |
| 45 | 1 | 7 | మ్తైన | మైన |
| 45 | 1 | 12 | పైకి | పైకి |
| 45 | 1 | 14 | మూలలో | మూలలో |
| 45 | 1 | 15 | జ్వరము | జ్వరము |
| 45 | 2 | 6 | మంచ | మంచు |
| 45 | 2 | 6 | శుభ్రిమైన | శుభ్రమైన |
| 46 | 2 | 1 | శుద్ధా | శుద్ధా |
| 47 | 2 | 2 | మూఁడు | మూఁడు. |
| 48 | 1 | 1 | నైర్మల | నైర్మల్య |
| 48 | 1 | 12 | వ్యాప్తమై | వ్యాప్తమై |
| 48 | 1 | 16 | బజారులు | బజారులు |
| 49 | 1 | 8 | న చేయకుము | చేయకుము |
| 49 | 1 | 8 | చెప్పుచున్నది | చెప్పుచున్నది |
| 49 | 1 | 5 | యథేచ్ఛము | యథేచ్ఛము |
| 49 | 2 | 2 | యధా | యథా |
| 50 | 5 | 1 | ఆరోగ్య | ఆరోగ్య |
| 50 | 5 | 7 | కొందరు | కొందఱు |
| 50 | 5 | 9 | కొంక | కొంఁక |
| 50 | 5 | 17 | గూడఁ | గూడ |
| 51 | 1 | 10 | మొన | మొన్న |
| 51 | 1 | 12 | సైన్యములో | సైన్యములో |

| పుట. | పేరా | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|---|
| 51 | 1 | 15 | గాయములు | గాయములు |
| 51 | 1 | 17 | రోగమ | రోగము |
| 51 | 2 | 8 | మాట | మూట. |
| 52 | 1 | 5 | పెణ్టు | పెట్టు |
| 54 | 1 | 6 | జీర్ణము | జీర్ణము |
| 54 | 2 | 11 | ప్రతినము | ప్రతిదినము |
| 56 | 1 | 2 | టానివ్వు | టానివవ్వు |
| 56 | 2 | 1 | అతిమత్రి | అతిమాత్రి |
| 56 | 2 | 16 | హిమవత్పర్వము | హిమవత్పర్వతము |
| 56 | 2 | 24 | దెశములో | దేశములో |
| 57 | 1 | 1 | యూత | యాత్ర |
| 57 | 3 | 7 | నిల్లగును | నిల్లగును. |
| 58 | 1 | 2 | నివ్వు | నివ్వు |
| 58 | 2 | 5 | విశ్వశా | విశ్రశా |
| 58 | 2 | 6 | హిసలు | హీనులను |
| 59 | 1 | 1 | ఆంగేయులు | ఆంగ్లేయులు |
| 59 | 2 | 2 | మరి | మతి |
| 60 | 1 | 6 | బజారు | బజాలు |
| 6. | 2 | 3 | లేవిరో | లేవిరో, |
| 60 | 3 | 4 | పవరి | పరి |
| 61 | 3 | 1 | పశ్చిమ | పశ్చిమ |
| 61 | 3 | 8 | ఆ దేశము | ఆ దేశము |
| 62 | 1 | 7 | మట్టునసే | మట్టునసే— |
| 62 | 1 | 22 | లోపలc | లోపలc |
| 64 | 1 | 5 | పాత్రిలు | పాత్రిలు |
| 64 | 1 | 15 | గరిc చేటు | గరిc చేలు |
| 64 | 1 | 20 | సుపరిరా | సుపరిరాగ |
| 68 | 1 | 3 | అవి | అది |
| 69 | 2 | 5 | పదులు | పదులు, |
| 69 | 2 | 10 | బట్టతో | బట్టతో |
| 71 | 2 | 8 | అోము | అోమ్ము |
| 72 | 2 | 3 | కొనుట | కొనుట, |

| పుట. | పేరా | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 78 | 2 | 7 | కాగ్ధ్య | కార్ధ్వ |
| 78 | 2 | 8 | స్త్రి | స్త్రీ |
| 78 | 2 | 7 | దీపములు | దీపములు. |
| 78 | 2 | 12 | చేయుదురు | చేయుదురు. |
| 78 | 3 | 5 | గాదు. | గాదు, |
| 78 | 3 | 6 | మార్చన, | మార్చన. |
| 79 | 2 | 10 | కెం | కేం |
| 81 | 3 | 11 | బ్బిలు | బ్బీలు |
| 82 | 1 | 3 | చేసినని | చేసినవి. |
| 82 | 3 | 2 | దౌర్బల్యణమ, | దౌర్బల్యణము, |
| 82 | 3 | 10 | జాతియు | జాతీయు |
| 84 | 2 | 6 | ప్రెంచి | ఫ్రెంచి |
| 84 | 3 | 5 | కిలిఁప్పుడు | లిఁకిప్పుడు |
| 86 | 2 | 4 | మారు | మాఱు |
| 86 | 2 | 5 | ప్రిచ్ఛన్న | ప్రచ్ఛన్న |
| 86 | 3 | 4 | లన్నియును | లన్నియును- |
| 87 | 1 | 13 | కలకత్తా | కలకత్తా |
| 87 | 1 | 26 | వశించు | వసించు |
| 88 | 2 | 20 | జాకరూకు | జాగరూకు |
| 88 | 2 | 21 | ప్రాతి | పాతి |
| 89 | 3 | 5 | అగ్థ | అర్ధ |
| 90 | 2 | 4 | పద్దతి | పద్ధతి |
| 91 | 3 | 2 | ంబము | కంబము |
| 92 | 1 | 7 | వారు | వారు. |
| 92 | 1 | 6 | అ | ఆ |
| 92 | 1 | 20 | మంది | మంది. |
| 93 | 1 | 18 | ప్రాశి | ప్రాఁశి |
| 94 | 1 | 6 | తియన | తీయన |
| 95 | 2 | 5 | సమస్త | సమస్త |
| 95 | 2 | 8 | ప్రత్యే | ప్రత్యే |
| 97 | 2 | 3 | తోను | తోను |
| 97 | 2 | 10 | గరిగించి | గరఁగించి |

| పుట. | పేరా | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 99 | 1 | 28 | పిడికళ్లు | పిడికిళ్లు |
| 99 | 1 | 25 | కుమార్తె | కొమార్త |
| 100 | 1 | 8 | దలును | దలను |
| 100 | 2 | 6 | ఇవియును ఆవులును గొర్రెలును | వీనిని ఆవులను గొర్రెలను |
| 100 | 2 | 8 | చర్మమలు | చర్మములు |
| 104 | 2 | 8 | వారగు, | వారగు, |
| 110 | 2 | 18 | పారము | పారము. |
| 110 | 2 | 15 | వృద్ధి | వృద్ధి. |
| 111 | 2 | 25 | ర్వ్యాగొ | ర్వ్యాగో |
| 115 | 3 | 2 | నివసించు | నివపించు |
| 116 | 1 | 2 | సూక్ష్మ | సూక్ష్మము |
| 116 | 3 | 2 | తివ్రి | తీవ్రి |
| 117 | 2 | 6 | వైశ్య | వైశ్య |
| 117 | 3 | 9 | చివారు | చివారు |
| 118 | 2 | 8 | హిను | హీను |



# Works of Kuchi Narasimham,

**PITHAPURAM. Godavari East.**

---

(a) Approved for Libraries—Fort St. George Gazette of 21-6-1921 Page 637.
(b) Do 11-5-1926—191 & 184
(c) Do & Teachers 22-12-1925—515

## TELUGU

(a) 1 Life and teachings of Sri Rama Krishna Parama Hamsa (Poetry) 2nd Edition ... ... 0 10 0

(a) 2 Lord Gauranga (Life of Chaithanya Swami) Poetry Vol. I ... 1 4 0

(a) 3 Do Do ,, II ... 1 4 0

(a) 4 Rupalata:—An Original Drama (Prescribed for the ElementaryHigher Grade Training S. L. C. Examination of 1920) 3rd Edition ... ... 0 14 0

5 Arrows of fire Paul Richard's Sayings) ... 0 1 0

(b) 6 Swami Vivekananda's 'East & West' ... 0 14 0
(Prescribed for Part I B of the Intermediate Examination of 1928.)

7 Vanavasi:—The story of Parnell's Hermit ... amplified and dramatized—3rd Edition (approved for use in Schools, *Fort Saint George Gazette* of 14-6-1921 Page 619—prescribed for the Elementary Higher Grade Training S. L. C. Examination of 1925 and for the B. A. Examination of 1923) ... 0 12 0

| | | | | | |
|---|---|---|---|---|---|
| | 8 | Selections in Telugu poetry and prose:—from the author's own works (approved for use in Schools, *Fort Saint George Gazette* of 6–3–1923 Page 1, prose portion prescribed for the Secondary Grade training Course of 1924—25 ... ... | 0 | 12 | 0 |
| | 9 | Telugu in Schools ... ... ... | 0 | 3 | 0 |
| | 10 | Comic writings & Contributions to Journals ... | 0 | 12 | 0 |
| | 11 | An appeal to Andhra Ladies ... ... | 0 | 2 | 0 |

(*Approved for* School use *Fort Saint George Gazette* of 11–5–1926 Page 189)

| | | | | | |
|---|---|---|---|---|---|
| (*b*) | 12 | Vivekananda's Lectures on Bhakthi Yoga ... | 0 | 10 | 0 |
| (*b*) | 13 | Twelve Lectures of Vivekananda ... | 1 | 8 | 0 |
| | 14 | Atmanivedanamu—Poetry ... ... | 1 | 4 | 0 |
| (*c*) | 15 | Four Lectures of Vivekananda on the Hindu Epics ... | 0 | 8 | 0 |

## ENGLISH (Pocket Size)

| | | | | | |
|---|---|---|---|---|---|
| (*b*) | 16 | Character .. ... | 0 | 2 | 0 |
| (*b*) | 17 | Student Life Now & Then .. ... | 0 | 3 | 0 |

FOR COPIES, APPLY TO THE AUTHOR

AT

**PITHAPURAM,**

(East Godavari Dt.)